# దేవ రహస్యాలు

గ్రంథకర్త

'విమర్శకా గ్రేసర'

కొత్త భావయ్య చౌదరి

ప్రచురణ:

కొత్త భావయ్య చౌదరి శత జయంత్యుత్సవ

కమిటి

40/-

# DEVA RAHASYALU

(The Pre - Historical Secrets of India)

By
"VIMARSAKAGRESARA"
**KOTTA BHAVAIAH CHOUDARY**

Third Edition : January 1997
Copies : 1000

Books Availabale at
**ADARSA GRANDHA MANDALI**
&
**SAHITHI NAVAJEEVAN BOOK LINKS**
Museum Road (Eluru Road Crossing)
Vijayawada-520 002

*సాహితి నవజీవన్ బుక్ లింక్స్, మ్యూజియం రోడ్డు ఏలూరు క్రాస్ రోడ్డు విజయవాడ -520 002*

**KOTTA SUBRAHMANYESWARI** (Retd. D.E.O.)
Sangam Jagarlamudi, Guntur Dist. 522 213

**SRI YALAMANCHI VENKATRAO**
Aruna 1 Apartment
Loyola Gardens, Vijayawada - 520 008

Printed at:
**KAMAKSHI OFFSET PRINTERS,**
Vijayawada-2



" విమర్శకాగ్రేసర "
కొత్త భావయ్య చౌదరి

జననం 2 - 6 - 1897 | నిధనం 22 - 6 - 1973

# అంకితము

సత్యదీక్షా ప్రాశస్త్య ప్రచురణ గోరెడి
సత్యాన్వేషణాసక్తిపరు లందరికి
ఈ గ్రంథము సమర్పితము

- గ్రంథకర్త

# పీఠిక

మనదేశపు ప్రాచీన చరిత్ర యింకను నిర్మింపబడలేదు. దీనికై మన పూర్వవాజయ మంతటిని శోధింపవలసిన యావశ్యకత యెంతయోగలదు. కాని మానవాతీతములైన మహత్తులతోను, కల్పనలతోను పరస్పర విరుద్ధ గాథలతోను మన వేదపురాణాదులు నిండియుండి సామాన్యకృషి కలవి గాకుండనుండుట గూడ యధార్థమే.

ముఖ్యముగా వైదికవాఙ్మయము తెరచి చూచిన మనదేశ చరిత్ర చాలా బయట పడునని శ్రీ డాక్టరు ఎ.సి. దాసు, యం.ఏ., పి.హెచ్.డి., గారు తమ 'ఋగ్వేద ఇండియా' (Rigvedic India) అను గ్రంథములో నొక్కి చెప్పుచు, పండితులనేకులు కలిసి దానిని చేయు విధానముగూర్చి నుడివిన వాక్యములగొన్నిటి నిట నుదాహరింతును.

"It should therefore be taken up by a number of learned vedic scholars, preferably Indians, well versed in the modern art of historical research on a truly scientific basis, who should from themselves into a society for the reconstruction of Ancient Indian History from Vedic literature which forms the only basis of research in this line." ఇది 28 సం॥ల క్రిందట వ్రాయబడినను నేటికిని ప్రయత్న మారంభమైనట్లు లేదు. ఇట్టి దుస్సాధ్యమగు పని నావంటి యొక సామాన్య పరిశోధకునకు సాధ్యముగానిదే యైనను మున్ముందు చేయబడవలసిన యీ మహత్కార్య సాధనకు కొంతవరకు తోడ్పడునని యీ పరిశోధనా గ్రంథమును శృతి, స్మృతి, పురాణేతిహాసాది పెక్కు గ్రంథములను శోధించి వానిలోని కల్పనలు, మహత్తులను త్రోసిరాజని, సత్యదూరము కానంతవరకు సమన్వయించి విదేశ పండితాభిప్రాయములను గూడ గమనించుచు వ్రాసితిని. ముఖ్యముగా కాలనిర్ణయములో తగిన జాగ్రత్త చూపబడినది. ఇందలి నిర్ణయమే యనేక గ్రంథ విషయముల కనుకూలముగా నున్నదని చదువరులు గ్రహింపగలరు.



దేవతార్యుల పూర్వగాథలలో హేతువాదములైన సత్యములు చెప్పబడినవి. ఎవ్వరో కొందరు. హేతువాద శూన్యులు తప్ప తక్కినవారు వీనిని చారిత్రక సత్యములుగా నంగీకరింప గలరు. ఈ యార్యుల ఆరంభ కాలము బి.సి. 28800 మొదలు 1500 బి.సి. వరకు నానావిధములుగా ననేక పండితులు నిర్వచించినారు. డా॥ అనిబిసెంటు, మాక్సుముల్లరు, మెగ్డనాల్డు, యల్.హెచ్. మిల్లు, హాగు, ఎ.సి. దాసు మున్నగువారు తమ తమ గ్రంథములలో దీనిని నిర్ణయించిరి. అనిబిసెంటుగారు 28 వేల కాలమగు ననిరి. ఎ.సి. దాసు, యం.ఎ. పి.హెచ్.డి. గారు ఋగ్వేద నాగరికతా కాలము బి.సి. 25 వేల సం॥ల క్రిందట నుండి యున్నట్లు నమ్ముచు, ప్రథమ మనువు కాలములోని జలప్రళయము బి.సి. 7500 సం॥ నాటిదేనని భూగర్భ పరిశోధకులు నుడివిన ప్రళయ చిహ్నములను బట్టి నుడివెను. మాక్సుముల్లరు, హాగు, మిల్లు, మెగ్డనాల్డు మొదలగు పండితులు మనదేశ వాఙ్మయ కాలమును చాలా తక్కువగా లెక్కించినను ఈ గ్రంథమున చూపిన నిదర్శనలనుబట్టి మన దేశచరిత్ర బి.సి. 7833 సంవత్సరముల నుండి యున్నట్లు స్పష్టపడుచున్నది.

మనమిపుడు దేవతలుగా కొల్చుచున్న యనేకులు పూర్వము మనదేశమున నివసించు చుండిన ఆదిమ వాసులేనని యీ గ్రంథము రుజువు పరచుచున్నది. ప్రకృతిలోని నానావిధ వస్తువుల (Elements) పూజలతో ఆరంభింపబడిన హిందూమతము క్రమముగా వీరపూజా పద్ధతి ననుసరించి తర్వాత నొక్కటేయగు పరమాత్మ కనుబంధింపబడి మొదటి నుండి ముక్తి కొరకై ప్రాకులాడక పోయినను, యీ దేశమును భోగభాగ్యములు గల కర్మభూమిగ మార్చి సర్వేశ్వరుని సృష్టి రహస్యముల నెన్నో గ్రహించి విశేష కృషి సల్పుచున్నట్లు మనదేశ వాసుల చరిత్రవల్ల స్పష్టమగుచున్నది. చాలా మతము లిందలి యొక్కొక్క పద్ధతిని గ్రహించినట్లు తోచును.

ఇందు పూర్వ చరిత్ర దిఙ్మాత్రముగానే తెలిపితిని. దీని బునాదులపై చరిత్రకారులు మన పూర్వ వాఙ్మయ మంతటిని శోధించి నిర్మించుటకై కృషి

సేయగలరని నా యాశయము. పూర్వ పురాణాదుల నుండి తీసిన యీ కథలు చరిత్రలే కావని కొందరనవచ్చును గాని యెట్టి యతిశయోక్తులతో నున్నను నవి చరిత్రలేనని నా విశ్వాసము. పురాణము లందలి పురుషుల వంశ విషయము లనేకములిపుడు చరిత్రలుగా రుజువగుచుండట మన మెరుగుదుము. మహేంజొదారొ, హరప్ప మున్నగు స్థానములలో నిటీవల బయలుపడిన భూగర్భ నగరములు, అచటి శాసన లిపులు, ప్రాచీన వస్తువులు మన దేశపు ప్రాచీనతను రుజువుపరచుచున్నవి. ఇవి మహేంద్రాదుల నగరము లన్నను ఆశ్చర్యము లేదు. బెలూచిస్థానులో గూడ నిట్టి ప్రాచీన శిధిలములు దొరకినవి. అచట నిప్పటికిని పురాణములందలి శిబిచక్ర వర్తి పేరిట గల శిబి నగరమున్నది. భువనేశ్వరము వద్ద శిశుపాల ఘర్ ఉన్నది. అచట ప్రాచీన కోటలు దొరకినవి.

వేదములందే పురాణ ప్రశంస యుండుట వల్ల నవి వానితోపాటు మిక్కిలి ప్రాచీనములై 4వ శతాబ్ది వరకు ననేక మార్పులకు చేర్పులకు లోబడినట్లు కనబడును. వేదార్థముల నుడువుటలో నిరుక్తము నందేమి, దాని ననుసరించిన సాయనుడు, మాక్సుముల్లరు మున్నగువారి గ్రంథము లందేమి వేదకాలపు కొందరు చారిత్రక పురుషులను వారి కథలను గూడ సూర్యాది నక్షత్రములకు తమ యూహాగానములతో నంటగట్టి వానిని తారుమారొనర్చి సత్య విషయములు మరుగు పరచబడెను. భాగవత కారుడే వీరందరికన్నా చక్కగా వేదార్థములను చారిత్రకముగా గ్రహించెను. అతడు వ్యాసుడు గానీ మరొకడుగానీ మోసములేదు. సాయనాదులు వారి ననుసరించిన పండితులనేకు లిందు కేవలము పొరబడినారని చెప్పక తప్పదు. అశ్విని దేవతల కథలే యిందుకు తార్కాణము. వాని కన్నిటికిని సూర్య నక్షత్రముల పరముగ నర్థములు వచించుట అతి సాహసమేగాని వేరుగాదు. ఈ రీతిగనే తక్కిన వనేకములున్నవి. వారిపేరిట నక్షత్రములకు నామకరణము జరిగిన పిమ్మట వ్రాయబడిన రుక్కులలో గొన్నిటికి మాత్రము అట్టి యర్థములు వచ్చేను. ఈ గ్రంథము వ్రాయుటలో వేదపురాణములేగాక మెగ్డనాల్డు డా॥ ఎ.సి. దాను మున్నగు పండితులు రచించిన వైదిక విమర్శ గ్రంథములు,



తద్భాషాంతరీకరణములు (శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరిగారిది) కొన్ని Astrological Magazines నాకు కొంతవరకు తోడ్పడెను. ఆ రచయితలకందరికిని నా కృతజ్ఞతాపూర్వక ప్రణామములు.

ఎవరేమనుకొన్నను దీనిలో సత్యసిద్ధాంతములు వెల్లడింపబడినవి. వీనిపై మనదేశ చరిత్ర యింకను విపులీకరింపబడగలదని నమ్మెదను. ఈ గ్రంథము న్యాయముగా నానాదేశ ప్రకటనావశ్యకత గలదైనందున నింగ్లీషులో వ్రాయదగి యున్నను, నా యశక్తిచే నట్లొనర్పక మాతృభాషలోనే వ్రాసితిని. ఆంధ్ర మెరుగని పరిశోధకలు ముఖ్యముగ దీనిని తర్జుమా చేయించుకొని సంగతులు గ్రహింతురుగాక!

దేవతార్యుల చరిత్ర మనదేశమున క్రీ.పూ. 7833 నుండి వేదపురాణములలో దొరకిన రీతిని యిందు వ్రాయబడినను, తత్పూర్వము మనదేశమున మానవ నివాస ముండెనను టకే నిదర్శనములున్నవి. ఆర్యులచే దస్యులుగా భావింపబడిన జాతి యొకటి ముఖ్యముగా నుండెను. వీరానాటి ద్రావిడులే ననవచ్చును. కాని వారి కాలపు చరిత్రలు మనకు వేదాలందు కానరావు. ఇంద్రాదులు వధించిన కొందరి నామములే యీ గ్రంథమున జదువగలరు. భూగర్భ పరిశోధకుల యభిప్రాయములను బట్టి మనదేశమున నింకను ప్రాచీన మానవ నివాసములున్నట్లు తేలుచున్నది. కాని యది పూర్వ ప్రళయ విషయముగా దలంపవలెను. అందుచే నా కాలపు చరిత్రకై మనము వెదుకజాలము. ఈ గ్రంథమునకు తొలిపలుకు వ్రాసి ఇచ్చిన ప్రొఫెరు శ్రీ కె. సచ్చిదానందమూర్తి, యం.ఏ., (బారిపాదలోని యం.పి.సి. కాలేజీ ప్రొఫెసరు) గారికి నేను మిక్కిలి కృతజ్ఞుడను.

సంగంజాగర్లమూడి<br>20-11-1948

ఇట్లు<br>**గ్రంథకర్త**

## FOREWORD

*By*

## SRI Dr. K. SATCHIDANANDA MURTHY, M.A.,

Professor of Philosophy, M.P.C. College, Baripada.

(Now Head of Philosophy, Andhra University)

It gave me great pleasure to go through Sri Bhavaiah Choudary's book "Deva Rahasyalu."

The Vedas are essentially spiritual books, sung in shapsody by mystics in their transportations of joy. They are neither completely historical nor entirely factual. Traditionally the Vedas have been interpreted in three ways down the ages (Trayorthah sarva Vedesu). The Ritualistic (Yajnika) and the Etymological (Nairuk-rtika) interpretations were the ones generally studied by western Savants. But, Sri Madhwacharya and his follower Raghavendra Swami, believe that the Vedas can be interpreted in a third way and that the supreme and inner meaning of the Vedas is essentially spiritual and esoteric. In recent times, the belief that the Vedic Mantras are supremely spiritual in their import, derived powerful support from renowned scholars of the stature of Sri Aurabindo, and T.V. Kapali Sastri. The Hindu tradition, moreover, holds that the Puranas are but the amplifiers of Vedic teachings (Vedarthasya Upabruhmanam). This might be a tall claim in case of many puranas. But, portions out of some Puranas and specially the Srimad Bhagavatam and the Mahabharata try to bring out what they deem to be the inner meaning of the Vedic legends.

European scholars of the Veda started theorising upon the religion, the history and the culture of the Vedic Aryans at a time when meterials were scanty and their studies only ankle-deep. The conclusions arrived at by most European savants are conjectural generalizations arrived at by hasty studies of comparative religion and comparative mythology. Today the excavations of Mahenjodaro and Harappa; the studies by expert of the Aztic, the Mexican, the Nordic and



Peruvian cultures; and the modern developements in the sciences of sociology and anthropology provide us with an abundance of material when we wish to launch upon a voyage of a critical study of the Vedas.

I do not know if Sri Bhavaiah Choudary was aware of all this, nor can I vouch safe that he has been able to put all this material to full use even if he was aware.

Sri Bhavaiah Choudary possesses a lively imagination and this supplimented by his keen intellect enables him to propound hypotheses at once startling and some times shocking and he has made so deep a study of our Puranas and our Vedas, that he marshals an amazing volley of facts to prove every hypothesis of his. Some times I have found it difficult to refute some of his conclusions, however foreign they may be to our tradition. I can only say that his theories about the Catur-yuga, the Devatas, the Sapta-Rsi, the Vishnu, the Surya Vamsa, the Brahmas, the Indras, the Rudra, and the fourteen lokas are ingenuous and deserve to be carefully studied without prejudice.

We may not agree with all that Bhavaiah Choudary says or suggests in his book. But that does not mean we should discard his views out-right,simply because they are novel. The time has come when we should re-study our religion and our ancient culture and should purge them of undesirable elements if any and should resuscitate and revitalize them. Indological studies is the paramount need of the day. This book, though small, is an effort in that direction; and it is to be appreciated in this context.

I congratulate my friend Sri Bhavaiah Choudary for havng produced this brochure, which is sure to provoke both orthodox Panditya and modern critical scholarship.

Dept. of Philosophy,
M.P.C. College,
Baripada, 1-10-48.



***K.S. MURTY***

## కీ॥శే॥ విమర్శకాగ్రేసర కొత్త భావయ్య చౌదరి శతజయంతి ఉత్సవ కమిటీ

| | |
|---|---|
| గౌరవాధ్యక్షులు : | శ్రీమతి డాక్టరు కొత్త లక్ష్మీ రఘురామయ్య |
| President : | Andhra Association - New Delhi<br>Delhi Women's League, New Delhi<br>Indian Women's Council for Social affairs, Madras<br>K.N. Jr. College, KRRM Degree College, Duggirala |
| Managing Trustee for life : | All India Women's Conference, New Delhi<br>Andhra Association<br>KRRM Trust, Kaviraj T.R. Choudary Trust, Andhra Mahila Sabha - Madras |
| International Vice President : | International Alliance of Women, London<br>Commonwealth Women League, Patron - All India Women's Conference, New Delhi |
| Secretary & Treasurer : | Swatantra Bharat Panorama - India |
| అధ్యక్షులు : | **శ్రీ సుంకర సత్యనారాయణ**<br>మాజీ విధానమండలి సభ్యులు (ఆంధ్రప్రదేశ్) మాజీ జిల్లా పరిషత్తు ఛైర్మన్ (కృష్ణాజిల్లా) శ్రీ సుంకర సత్యనారాయణ ప్రగతి చారిటబుల్ట్రస్టు వ్యవస్థాపకులు, ప్రధాన నిర్వాహకులు. |
| కార్యదర్శి : | **శ్రీ యలమంచి వేంకట్రావు**<br>ఉపశిక్షణాధికారి, ప్రభుత్వ పారిశ్రామిక శిక్షణ సంస్థ, విజయవాడ ఐతిహాసిక పరిశోధనా గ్రంథమండలి రాజపోషకులు. |
| కోశాధికారి : | **శ్రీ పిడికిటి రామకోటేశ్వరరావు**<br>మేనేజరు, ఆదర్శ గ్రంథమండలి, ప్రొప్రయిటర్ సాహితీ నవజీవన్ బుక్‌లింక్స్, విజయవాడ-2 |
| గౌరవసభ్యులు : | సర్వశ్రీ 1. కొత్త బాలకృష్ణమూర్తి, Rtd. Accountant C.C.Bank, Guntur Dist.<br>2. కొత్త సుబ్రహ్మణ్యేశ్వరి Rtd. D.E.O.<br>3. డా. వి. చౌదరి, U.S.A. |
| సభ్యులు : | సర్వశ్రీ 1. **దివి శేషగిరిరావు**, ఫిజియోథెరపి క్లినిక్ అధినేత, విజయవాడ<br>2. **చెరుకూరి రామారావు**, పారిశ్రామికవేత్త, విజయవాడ<br>3. **బోయపాటి శివరామకృష్ణయ్య**, కాంట్రాక్టరు, విజయవాడ<br>4. **చింతమనేని సతీష్**, కాంట్రాక్టరు, హోటల్ యాజమాన్యము<br>5. **అయినంపూడి వేంకటేశ్వరరావు**, కాంట్రాక్టరు, హైదరాబాద్<br>6. **చలసాని వీరరాఘవయ్య**, మాజీ ప్రెసిడెంటు, కోపరేటివ్ బ్యాంక్ మరియు గ్రామపంచాయితీ - వెంట్రప్రగడ |



# 'దేవ రహస్యాలు' - వెలుగుబాట

భౌతికముగా అన్నింటి కంటె విచిత్రమైనది సృష్టి. ఆ సృష్టిని బేధించుటకు మానవుడు ఎప్పటికప్పుడు అనేక విధములుగా సాగిపోతూనే వున్నాడు. అట్లా ఎంతో గతించినది. గతములోని అనుభవాలు మనకు చరిత్ర నేర్పిన పాఠాలు. వర్తమానము గతము సాధించిన దానికి తార్కాణము. భవిష్యత్తుకి వర్తమానము సోపానమవుతుంది. అదే హేతుబద్ధమవుతుంది. అదే తులనాత్మకమవుతుంది. అట్లా కానిది నిలబడలేదు. అది తెలుసుకోలేక ప్రస్తుతము మానవుడు అనేక సమస్యలతో శ్లేష్మములో పడ్డ ఈగవలె సతమతమగుచున్నాడు.

హేతుబద్ధమైన ఆలోచనా విధానముతోను తులనాత్మకమైన ఆచరణతోను ప్రవర్తించిన వారిని గుర్తించక తప్పదు. దీనికి తార్కాణమే స్వర్గీయ కొత్త భావయ్య చౌదరిగారి శత జయంతి సందర్భముగా "దేవరహస్యాలు" పునర్ముద్రణ కావించటము.

"దేవరహస్యాలు" గురించి చెప్పకుండా మిగతాది ఏది చెప్పినా సంపూర్ణము కాదు. గత ముద్రణ కావించి 35 సం॥ గతించినప్పటికి ఎవరికి వారు "దేవ రహస్యాలు" వుందంటారే కాని ఆ పుస్తకమును చూచిన వారు చాలా అరుదు. నేను 1988 సంవత్సరానికి పూర్వము చూడలేదు. ఆ తరువాత నా దగ్గరకు వచ్చినప్పుడు ఆసాంతము చదవకముందే అమెరికా పంపవలెనని ఒక మిత్రుడు వస్తే యిచ్చాను. వారు అమెరికా పంపినారో! లేదో! 1990 సం॥ నుండి ఆ విషయము ఆ మిత్రుడు ఈ రోజు వరకు చెప్పలేదు. నా పుస్తకము నాకివ్వలేదు. మరల దానిని సంపాదించటానికి సప్త సంవత్సరములు పట్టినది. ఇప్పుడు ఆసాంతము చదవకుండానే ప్రింటింగ్‌నకు పంపవలసి వచ్చినది.

1948 సం. అక్టోబరులో ప్రస్తుతము శతజయంతి జరుపుకొనబోవు స్వర్గీయ కొత్త భావయ్య చౌదరిగారు హేతుబద్ధమైన ఆలోచనతోను తులనాత్మకమైన సంఘటనలతోను వేదములు, ఉపనిషత్తులు, పురాణములు, ఆంగ్ల వాఙ్మయము

లోని పుస్తకములు చదివి, పరిశోధించి నాణెమునకు రెండవ వైపు సహేతుకముగా "దేవరహస్యాలు" అను పుస్తకము సామాన్య మానవులకు అర్థమగురీతిలో వ్రాసి సంచలనము సృష్టించి మేధావుల పత్రికల ప్రశంసలు అందుకొని 'విమర్శకాగ్రేసర' అను బిరుదు పొంది ఆ తరువాత కాలము చేసి 23 సం॥ కాలం పూర్తయినది.

స్వర్గీయ భావయ్య చౌదరిగారు మనకున్న కొద్దిమంది చరిత్రకారులలో ఒకరు. నాకు బంధువు, పరిచయము 1959 సం॥ ఏప్రియల్. 1969 సం॥లో వారికి సతీ వియోగము కల్గినప్పుడు పరామర్శ నిమిత్తము వెళ్ళినాను. ఆ సమయములో చరిత్రపట్ల నాకు ఆసక్తిని కలుగజేసినారు. అప్పటినుండియు చరిత్రపట్ల అభిలాషతో అప్పుడప్పుడు నేను వారిని కలుస్తూ వుండేవాడను. చివరకు 1973 సం॥లో వారు స్వర్గస్తులైనప్పుడు వారి సంస్మరణ సభకు స్వాతంత్ర్య సమర యోధుడు స్వర్గీయ చింతమనేని భావయ్య గారు అధ్యక్షత వహించగా ముఖ్య అతిధిగా కళాప్రపూర్ణ, దార్శనికులు పండిత గోపదేవ్ శాస్త్రిగారు, చారిత్రక శిరోమణి కొడాలి లక్ష్మి నారాయణగారు మరియు కొత్త వెంకటేశ్వరరావు గారు (చిన్నబ్బాయి) పాల్గొన్నారు. చింతమనేని భావయ్యగారు నన్ను మాట్లాడమని ప్రోత్సహించగా తడబడినాను. తప్పలేదు. నాకు తెలియకుండానే భావయ్య చౌదరిగారు వ్రాసిన ప్రభోద కుసుమావళిలోని పద్యాలను గుర్తుకు తెచ్చుకొని చదవగా మెచ్చుకొన్నారు. పెద్దల సభలో (అప్పటికి నేను చిన్నవాడను) మాట్లాడుటకు నాంది పలికినది భావయ్య చౌదరిగారి సంస్మరణ సభయే.

స్వర్గీయ భావయ్య చౌదరిగారు పరిశోధించిన చరిత్రకు సంబంధించిన గ్రంథమును 1989 సం॥లో కొందరు తారుమారుచేసి అసందర్భమైన సంఘటనలు భావయ్య చౌదరి గారు వ్రాసినట్లుగా సంకలనము చేసి చెలామణిలోనికి తెచ్చినారు. నేను మధనపడినాను. అదే పుస్తకము అదృష్టవశాత్తు 1995 సం॥లో కొందరు దాతల ప్రోత్సాహముతో స్వర్గీయ భావయ్య చౌదరి గారు వ్రాసిన యధాతధ చరిత్ర మరియు అదనపు సమాచారము అనుబంధముగా గతంలోని 3 సంపుటాలు ఒకే సంపుటముగా కమ్మవారి చరిత్ర వెలువడినది. అట్లాగే రెడ్ల చరిత్ర మహాజన చరిత్ర, ఆంధ్ర రాజులు, కాకతీయ రాజన్యచరిత్ర పునర్ముద్రించవలసిన అవసరమున్నది.



ఇప్పుడు కీ॥శే॥ భావయ్య చౌదరిగారి శత జయంతి సంవత్సరము. 18-12-1996న శ్రీ సుంకర సత్యనారాయణగారి అధ్యక్షతన శ్రీమతి డాక్టరు కొత్త లక్ష్మీ రఘురామయ్య గౌరవాధ్యక్ష్యతన కమిటి ఏర్పాటయి "దేవరహస్యాలు" పునర్ముద్రించుటకు నిర్ణయించటమైనది. ఈ ప్రయత్నానికి కమిటి కోశాధికారి పిడికిటి రామకోటేశ్వరరావుగారు (మేనేజరు ఆదర్శ గ్రంథమండలి, ప్రొప్రయిటరు సాహితీ నవజీవన్ బుక్‌లింక్స్) ఆర్థిక ప్రోత్సాహమివ్వటానికి ముందుకు వచ్చారు.

దేవరహస్యాలు మరియు దాని పుట్టుపూర్వోత్తరాలు నిమిత్తము స్వర్గీయ భావయ్య చౌదరి గారి స్వగ్రామమైన సంగంజాగర్లమూడి రెండు పర్యాయములు వెళ్లినాను. ఎవరూ సమగ్రమైన సమాచారము యివ్వలేదు. మలి ముద్రణ 1962 జనవరిలో అద్దేపల్లి (రాజమండ్రి) వారు ప్రచురించినారు. వారిని 15-12-96న పుస్తక ప్రతి కొరకు కలవగా వారు నిస్సహాయత వెలిబుచ్చారు. నిరుత్సాహపడక ప్రయత్నించగా హైదరాబాద్‌లోని సుంకర రామమోహనరావు గారు యిచ్చినారు. కొంత చిరిగిపోయిన కారణంగా వివరాలు సమగ్రంగా లేవు.

భావయ్య చౌదరిగారు చరిత్రకు సంబంధించిన పుస్తకాలేకాక నవలలు, నాటకములు, రూపకములు, శతకములు, వ్యాసములు, వినోద కథలు రచించినారు. 'వ్యామోహము' నవలలో సంతానము లేని కథానాయకుడు భరతుడనే అతనిని పెంచుకొని వ్యామోహము పెంచుకొనుట యితివృత్తము. దీనిలో చారిత్రకమైన ఉండవల్లి గుహల వర్ణన చాలా బాగున్నది. సగర పట్టాభిషేకము పద్య నాటకములో సగర వంశములోని చరిత్ర యితివృత్తము. రుక్మిణీకళ్యాణ రూపకములో స్త్రీకి ఆత్మ స్వాతంత్ర్యము యుండాలన్నది యితివృత్తము. అనాది కాలములోనే రుక్మిణి ఆచరించినట్లుగా వర్ణించినారు. పరశురామ నాటకములో పరశురాముడు క్షత్రియులపై కక్షబూని పంచములను తమ వర్గములోనికి చేర్చుకొని క్షత్రియులను తెగటార్చుట యితివృత్తము. మహాజన చరిత్రలో ప్రముఖుల జీవిత విశేషాలు, సంగభూపాలీయములో వారి గ్రామ చరిత్ర వున్నాయి.

ఆంధ్ర నలంద, భారతీయ సమితి, లలిత కళా సమితి వారిచే సన్మానం పొందిరి. 7 సం॥ గ్రామ పంచాయితీ ప్రెసిడెంటుగా చేసి పన్నులు వేయకుండా

ప్రజారంజకముగా నిర్వహించిరి. విశ్వవిద్యాలయములకు, కాలేజీలకు గ్రంథాలయములకు, పండితులకు భూరి విరాళములిచ్చిన వితరణశీలి. సర్వేయరుగా ఉద్యోగము చేసి రాజీనామా చేసిరి. స్త్రీ విద్యను ప్రోత్సహించిరి. సంతానము కల్గినది. కాని దక్కలేదు. మిగిలిన ఆస్తిని, వంశీయులకు వీలునామా ద్వారా పంచి యిచ్చిరి.

స్వర్గీయ భావయ్య చౌదరిగారి అన్నకుమార్డు అయిన కొత్త బాలకృష్ణమూర్తి మరియు అన్న మనుమడు శివలింగప్రసాద్‌గార్ల అనుమతితో "దేవరహస్యాలు" ఆంధ్రపాఠకులకు అందిస్తున్నాము.

స్వర్గీయ భావయ్యచౌదరిగారి శతజయంతి కమిటీ ఏర్పాటు కావటానికి అడిగినంతనే అంగీకరించి సహకరించిన శ్రీమతి డాక్టరు కొత్త లక్ష్మి రఘురామ్, సర్వశ్రీ సుంకర సత్యనారాయణ, కొత్త బాలకృష్ణమూర్తి, కొత్త సుబ్రహ్మణ్యేశ్వరి, డా. వి. చౌదరి, దివి శేషగిరిరావు, చెరుకూరి రామారావు, బోయపాటి శివరామకృష్ణయ్య, చింతమనేని సతీష్, అయినంపూడి వెంకటేశ్వరరావు, చలసాని వీరరాఘవయ్య, ప్రచురణకు అనుమతి యిచ్చిన కొత్త బాల కృష్ణమూర్తి, కొత్త శివలింగప్రసాద్, ప్రచురణకు ఆర్థిక సహకారము అందించిన పిడికిటి రామకోటేశ్వరరావుగార్లకు నా కృతజ్ఞతలు. 1962 సం.లో ద్వితీయ ముద్రణ ప్రచురించిన అద్దేపల్లి (రాజమండ్రి) వారిని సంప్రదించగా ప్రస్తుతము ప్రచురించే వుద్దేశ్యము లేదనియు శతజయంతి సందర్భముగా మీరు ప్రచురించుట సంతోషమనియు మౌఖికముగా తెల్పిన అంగీకారమునకు కృతజ్ఞతలు. కోరిన మీదట ఈ పుస్తకానికి కవర్ డిజైను గీసియిచ్చిన 'స్రవంతి గ్రాఫిక్స్' సృజన్‌గారికి నా కృతజ్ఞత తెల్పుతున్నాను. అభిమానులు వారి యితర గ్రంథాలను కూడా ప్రచురించటానికి సహాయపడగలరని నా విశ్వాసం.

గౌరవాభివందనములతో

ఇట్లు

**యలమంచి వేంకట్రావు**, కార్యదర్శి

స్వర్గీయ కొత్త భావయ్య చౌదరి శతజయంతి ఉత్సవ కమిటి.



## విషయ సూచిక

### ప్రథమ ప్రకరణము



### ద్వితీయ ప్రకరణము



### తృతీయ ప్రకరణము



### చతుర్థ ప్రకరణము

# దేవరహస్యాలు

## ప్రథమ ప్రకరణము

మన పురాణములు మున్నగు పవిత్రగ్రంథములలో గొన్నింటను నేటికి శ్వేతవరాహకల్పమునందు ఆరు మన్వంతరములు గడచి యేడవ దానిలో 27 మహాయుగము లంతరించి 28 వ దానిలో కలియుగము జరుగుచున్నదనియు, భారతయుద్ధకాలమైన 37 సం॥లకు శ్రీకృష్ణుని నిర్యాణకాలమున కలియుగ ప్రవేశము జరిగెననియు జెప్పబడియున్నది. ఈ యుగసంఖ్యలు నిర్ణయించుటలో కృతయుగమునకు 4800, త్రేతకు 3600, ద్వాపరమునకు 2400, కలియుగమునకు 1200 దేవమాన సంవత్సరములనియు, నిట్టి చతుర్యుగములు కలిసి 12 వేల దేవసంవత్సరములు ఒక మహాయుగమనియు, అట్టి 71 మహాయుగములు ఒక మన్వంతరమనియు, అట్టి మన్వంతరములు 14 అయినయెడల అనగా వెయ్యి మహాయుగములకు ఒక కల్పమనియు జెప్పబడినది. ఇట్టి కల్పములు బ్రాహ్మదేవునికి దినములుగా నుండుననియు నట్టి 360దినములుగల సంవత్సరములు నూరు అయినచో నతని యాయుఃప్రమాణమనియు గలదు. ఈ విషయము లెవరు నిర్ణయించిరో, ఎట్లు నిర్ణయించిరో, జరిగిన కాలనిర్ణయమున కాధారములేవో, యిందెంతవరకు సత్యముగలదో, యెంత బూటకమున్నదో, అట్టి వానికి కారణములేమో తెలుసుకోవలెను. అసలు బ్రహ్మలన నెవరు? దేవతలన నెవరు? రాక్షసు లెవరు? త్రిమూర్తులెవరు? వారందరు మనవంటి మానవులేనా? కాదా? స్వర్గము, ఇంద్రరాజ్యము, రంభలు మున్నగున వెచ్చట కలవు? ఖగోళమందలి నక్షత్రములలో నున్న సప్తర్షులు, బ్రహ్మ రుద్ర ఇంద్రాదు లెవరు? వారికిని పురాణపురుషులకును సంబంధా లెట్టివి?

బ్రహ్మాదిదేవతలంగరును పూర్వమానవులకు ప్రత్యక్షమై వరము లిచ్చుచుండిన మాటలు వాస్తవమేనా ? యిప్పు డేట్లు రారేల ? మన మతములో చెప్పిన యీ మాటలలో నెంత సత్యమున్నది ? వేదాలు బ్రహ్మముఖమున పుట్టిన వనుటలో గల యథార్థమెంత ? మొదటిదైన ఋగ్వేద మెప్పు డెచట నెవరిచే వ్రాయబడినది ? ఆ కాలపు దేవత లెవ్వరు ? మానవులు మొదట నెచట యుత్పత్తినైరి ? హిందూదేశము హిందూమతము అను పదము లెట్లుత్పత్తియైనవి? మన దేశపు వాస్తవిక చరిత్ర యెంతవరకుయేరీతిగా లిఖితమై యున్నది ? ఖగోళవిషయమై మన కున్న గణితశాస్త్రములు వానిని బట్టి మనకు తెలిసే విషయాలు, యజ్ఞాదులలో దేవతల హవిస్సులు, వాని ఫలాలు యెంతవరకు నిజం ? ఈ విషయా లన్నిటిని విమర్శనాదృష్టితో వీక్షించి సత్యాన్వేషణ నొనర్చి యసంబద్ధ ప్రలాపాలను ఎట్టి పవిత్రగ్రంథములో నున్నను వానిని త్రోసిరాజని, యితరదేశములలో యీ విషయమైన ఋజువు లున్నవేమో సరిజూచి, మనదేశములో దొరకెడి పూర్వశాసనాలు మొదలైన పరమప్రమాణములతో దర్కించి వాస్తవికజ్ఞాన ప్రకటనకొరకే యీ గ్రంథ ముద్దేశింపబడినది.

ఇట్టి సత్య సిద్ధాంతమును తెలుపుటలో చారిత్రకముగా ఋజువగు విషయములనే నమ్ముచున్నను మతభక్త్యాదుల యుద్ధరణకై వచింపబడిన పూర్వ ఋషిపుంగవుల ప్రమాణవాక్యములనుకూడ త్రోసివేయుటలో వారి యెడల ననాదరణభావము కాదు. సత్యాన్వేషణకొరకు వారివారి గొప్పయూహలను శ్లాఘించుటయే యగును. ఇక విచారణకు వత్తము.

గ్రీన్‌విచ్ నక్షత్రశాలలో పరిశోధకుడుగా గొంతకాలముండిన సుప్రసిద్ధ ఖగోళశాస్త్రజ్ఞుడగు మేజరు జనరల్ డ్రేసను పండితుడు (వూల్‌విచ్చిలో రాయల్ మిలటరీ అకాడమీ ప్రొఫెసరు) అనేక పరిశోధనలు సలిపి క్రీస్తు పూర్వము 14 వేల సం॥ల క్రిందట ఏషియా మధ్యదేశము మానవ నివాసమునకు వీలుకాని గొప్ప మంచుచే గప్పబడి యుండెననియు, రష్యా మున్నగు ప్రదేశములలో క్రీ. పూ. 4000 సం॥ల వరకు నట్లుండెననియు, సెంట్రలు ఏషియాలో నాకాలమున సూర్యరశ్మివేడిమి (Altitude) 35 ½ డిగ్రీలు



మాత్రమే యుండుననియు నిర్ధారించియుండెను. దీనినే తర్వాత పెక్కండ్రు విదేశశాస్త్రకారు లంగీకరించియుండిరి. దీనిప్రకార మచటినుండి యార్యులు మనదేశమున కాలిడిరను సిద్ధాంతము ననుసరించి యాకాలపు పూర్వవిషయములుగా నెచ్చట జెప్పబడినను నమ్మరానివిగా నిర్ధారణ యగును. కొందరు పండితులు మన వేదభాగములలో బ్రాహ్మణములందు కొన్నిచోట్ల వసంత, విషువత్తు కృత్తికా మృగశిరల కాలములో వచ్చినట్లు గల వాక్యములనుబట్టి యాకాలము క్రీస్తుపూర్వము 3 లేక 4 వేల సం॥ల క్రిందటనైయుండునని లెక్కించుచున్నారు. ఋగ్వేదములో నొకచోట యింద్రుడు చిత్తలో నున్నట్లు చెప్పబడినది. ఇదిగూడ విషువత్తు కథనముగానే భావించుచు, నాకాలము క్రీస్తుపూర్వము 13800 సం॥ల క్రిందటిదని కొందరు పండితులు వాదించుచున్నారు. మరియొకచోట ఋగ్వేదములో అశ్వినిలోని విషువత్తు ప్రస్తావన గలదు. ఆ విషువత్తు క్రీస్తుపూర్వము మన పూర్వ లెక్కలప్రకారము 28800 సం॥ లనియు (సావన సం॥లు కావచ్చును) నవీన సిద్ధాంతరీత్యా 26600 సం॥ లగుననియు క్రీస్తుపూర్వము దాదాపు 60 సం॥ల క్రిందట మరల నట్టి యశ్వినీవిషువత్తు పరిభ్రమణము వచ్చెననియు కొందరు పరిశోధకులు నుడివిరి. గాని పైన నుడివిన యశ్వినీ చిత్తలలోని విషువత్తులు లెక్కలచే చెప్పబడినవేనా ? లేక నప్పటినుండి మానవులు మన దేశమున నుండి ఖగోళ విజ్ఞానవంతులై యున్నారా యని విచారించిన కొలదిని డ్రేసను పండితాభిప్రాయానుసారముగ నేమి, మన పూర్వ కథలనుబట్టియేమి నమ్ముటకు వీలు కానిదిగ నున్నది. మన కథలన్నియు కోట్ల సం॥లతో మానవజీవితములను నింపివైచినందున సత్యమును వెలికిదీయుట కష్టముగుచున్నది. విషువత్తు పరిభ్రమణము 7200 సం॥ల కొకసారి యుండునని సూర్యసిద్ధాంతము వలన దెలియుచున్నది. ఇది నక్షత్ర పాదము వ్యత్యాసము గమనింపకుండా చెప్పుపద్ధతి. ఈ రెండుపద్ధతులలో నేది ఋగ్వేదమున జెప్పబడినదో గ్రహించినగాని వేదకాలనిర్ధారణ గానందున ముందుగా నితర విధముల దీనిని బరిశీలింతము. డాక్టరు అనిబిసెంటు మొన్నగువారు వేదకాల విషువత్తు

28800 సం॥ల నాటిదిగా అభిప్రాయపడిరిగాని దాని కితర సాక్షి సాధనములు లేవు. సృష్ట్యాదినుండి సైన నుడివిన విషువత్పరిభ్రమణము లెన్ని ముగిసి యెంత కాలము నిజముగా జరిగెనో సరియైన నిర్ధారణయగుటకు వీలు లేకున్నను మన గణిత గ్రంథాలలో సృష్ట్యాది యీభూగోళమునకు 195 కోట్ల సం॥లు జరిగినట్లు చెప్పబడినది. దానిని నమ్మదమన్నచో నప్పటి కాలపు మనువు లొక్కొక్కరే కొన్ని వేల సం॥లు (71 మహాయుగములు) జీవించినట్లుగా వ్రాయబడుటవల్ల యసంగతవిషయమైనది. అప్పటినుండి మనకు చరిత్ర యుండుటగూడ నమ్మశక్యముగానిది. మనుస్మృతిలో కృతయుగమందు మానవజీవితము 400 సం॥లుగాను. తక్కిన యుగములలో వరుసగా నాల్గవవంతు తగ్గి క్రమముగా 300, 200, 100 సం॥ల పరిమాణమని క్రింద శ్లోకమున జెప్పబడినది.

శ్లో॥ అరోగా స్సర్వ సిద్ధార్థా శ్చతుర్వర్ష శతాయుషః
కృతే త్రేతాదిషు హ్యేషామాయుర్హ్రసతి పాదశః॥
(అధ్యా 1—83)

ఈశావాస్యోపనిషత్తులోను, మరికొన్ని యితర యుపనిషత్తులలో గూడ 100 సం॥ల యాయుర్దాయమే నరులకు విధింపబడినది. జ్యోతిషశాస్త్రరీత్యా గూడ పరమాయుర్దాయము 120 సం॥లే. వేదవాక్కులలో చాల చోట్ల "శతాయుః పురుష" యనియే నుడువబడెను. వీని కన్నిటికిని విరుద్ధముగా మనువులు, మరికొందరు రాజులును వేలు, లక్షల సంవత్సరములు జీవించిరని వ్రాసిన పూర్వగాథలు గణితశాస్త్రములందున్నను మరియెచ్చట నున్నను పాటించరానివగుచున్నవి. ఇట్టి విషయము లనేకము మన పురాణములందు వ్రాయబడినవి.

## కాలజ్ఞానము - భారతయుద్ధకాలము

ఈ పురాణములలోని అంకెలను నమ్మినచో మొదటి మనువు మొదటు 453 మహాయుగములును, ౩ యుగములును అనగా మొత్తము 1815 యుగములు ఇదివరలో జరిగియున్నట్లు మనము విశ్వసింపవలయును. ఇవి 195 కోట్ల సం॥లకు దాటుచున్నవి. ఇవియన్నియు యెరిగినట్లే వారి పాలకులతో



గూడ పురాణములు చెప్పినవనవలెను. ఇది సామాన్య మానవసృష్టి కేగాక లోకమునగల సర్వమానవ ప్రపంచ విజ్ఞానకాలమునకు చాల దూరముగా నున్నదిగాన సందేహింపవలసియున్నది. ఇందలి బూటకమేమిదో క్రమముగా విచారింతము. కాని మనకు ఖగోళ గణితశాస్త్రజ్ఞుల లెక్కప్రకారము పంచాంగములలో యీ 1815 యుగములలో 7 యుగముల ఆద్యంతములు మాత్రమే చెప్పుచున్నారు. 8 వది కలి ఆరంభముగూడ జెప్పుదురు. పంచాంగములలో వాని ఆద్యంతము లీ క్రిందివిధముగ నున్నవి.

| | | | | |
|---|---|---|---|---|
| 1. కృతయుగము | ఆరంభం | కార్తీక శు ౯ | అంతం | శ్రావణ శు 3 |
| 2. త్రేతాయుగము | ,, | శ్రావణ శు 3 | ,, | మాఘ బ 3౦ |
| 3. ద్వాపరయుగము | ,, | మాఘ బ 3౦ | ,, | భాద్రపద బ౧౨ |
| 4. కలియుగము | ,, | భాద్రపద బ ౧౨ | ,, | మాఘ శు ౨ |
| 5. కృతయుగము | ,, | మాఘ శు ౨ | ,, | వైశాఖ శు 3 |
| 6. త్రేతాయుగము | ,, | వైశాఖ శు 3 | ,, | కార్తీక శు ౧౫ లేక బ ౧౨ |
| 7. ద్వాపరయుగము | ,, | కార్తీక శు ౧౫ లేక బ ౧౨ | ,, | వైశాఖ బ ౧౦ |
| 8. కలియుగము | ,, | వైశాఖ బ ౧౦ | ,, | ? |

వీనిలో చివరి కలియుగారంభమున భారతయుద్ధ, శ్రీకృష్ణ నిర్యాణములు జరిగెనని పురాణములందు గలదు. భారతయుద్ధమై కలియుగ ప్రవేశమైన పిమ్మట 25 సం॥లకు ధర్మరాజు చనిపోగా నాయనపేరిట సప్తర్షులు తిరుగు దానినిబట్టి యొక శకమేర్పడెనని చెప్పుదురు. సప్తర్షు లొక్కొక్క నక్షత్రమునందు నూరు సం॥లు ఉందురనియు అన్ని నక్షత్రములు తిరుగుటకు 2700 సం॥లు పట్టుననియు. నదియొక శకమనియు పురాణములు వాకొనుచున్నవి. నేటికి కలియుగము లెక్క 5047 అనియు, క్రీ. పూ. 3102 సం॥లోనే కలియుగారంభమైనట్లు మన గణితశాస్త్రములు చెప్పుచున్నవి. సూర్యసిద్ధాంతములోని విషయములనుబట్టి యిది రూఢిపడుచున్నది. గాని ఈ సప్తర్షిశకమును యీ కలియుగ సంఖ్యలును యిటీవలివారెవ్వరో కల్పించిరనియు,

దాదాపు క్రీస్తుపూర్వము 2747 ప్రాంతమున కలి ఆరంభించియుండవచ్చుననియు కొందరు గణితపండితులు వాదించుచున్నారు. (1) సప్తర్షులు యేస్థానమున నుండినదియు నిర్ణయించుటలోగల భేదములనుబట్టి చేతావని గ్రంథకర్త మున్నగువారు కలియుగ మిప్పుడే యంతమని వ్రాసియున్నారు. యుధిష్ఠిరశక మప్పు డేర్పడలేదని కొందరి యభిప్రాయము. భారత యుద్ధ కాల నిర్ణయమునందుగూడ పలువురు పండితులు పలురీతుల యభిప్రాయములు గల్గియుండిరి. వానిలో ముఖ్యములీ క్రిందివిధముగా నున్నవి.

| | | |
|---|---|---|
| జస్టిస్ ఫర్గిటరు సిద్ధాంత ప్రకారము భారతయుద్ధం క్రీ. పూ. | 1810 | సం॥ |
| శ్రీశచంద్ర విద్యార్ణవుడు ... ... | 1768 | ,, |
| ,, మరియొక లెక్కను ... | 1922 | ,, |
| స్వామి కన్నుపిళ్ళ ... ... | 2402 | ,, |
| కల్హణపండితుడు ... ... | 2448 | ,, |
| గోపాలయ్యరు ... ... | 1177 | ,, |
| జోన్సుపండితుడు ... ... | 2402 | ,, |
| తిలకుమహాశయుడు ... ... | 1440 | ,, |
| నడింపల్లి జగన్నాధరావు పంతులు ... | 3189 | ,, |
| కోడాలి లక్ష్మీనారాయణ ... ... | 980 | ,, |
| కొన్ని పురాణములు, భాగవతములనుబట్టి ... | 1470 | ,, |

వీరందరును మనకు లభించిన ఆధారము లన్నిటిని పరిశీలింపకపోవుట చేతనే యీవిషయమై వారి అంత్యనిర్ణయములు వివిధమై తృప్తి చేయజాలక పోవు కారణమని చెప్పవలసియున్నది. వీరిలో మొదటి ఇద్దరు పురాణములలోని లెక్కలనుబట్టియు జోన్సు పరాశర సిద్ధాంతమునుబట్టియు, దక్కిన వారు వరాహమిహిరాది గణితశాస్త్రజ్ఞుల వాక్యములలోని యర్థభేదములను బట్టియు, కోడాలి లక్ష్మీనారాయణగారు జైనవాఙ్మయము, సప్తర్షులు ముందుకు నడచునని చేసిన విపరీత సిద్ధాంతాదులబట్టియు వ్రాసిరి. జగన్నాధ రావుపంతులు అయన చలనాదులతో కలియుగారంభమును దక్కినశాస్త్రము

(1) Astrological Magazine, Banglore. Sept. 47



లకు సరిపెట్టి వ్రాసిరిగాని పురాణములలోని పాలన సంఖ్యలను గమనింపక పోయిరి. గాని వీనియన్నిటిలోను మొదటి యిద్దర కాలములే మనకు యథార్థ పరిజ్ఞానమును గల్గించుటలో తోడ్పడుచున్నవి. జగన్నాధరావు పంతులుగారు తక్కినవారి వాదముల నన్నిటిని ఖండించుచు "ఆంధ్ర మహా సామ్రాజ్యము" అను గ్రంథములో వివరముగ తెలిపియున్నారుగాన ఆ చర్చయంతయు నిచ్చట మానితిమి. కలియుగము క్రీ.పూ. 3102 అనుటకు వారు తగిన ప్రమాణములన్నియు సేకరించిరిగాని భారతయుద్ధకాల నిర్ణయములో నా కలియుగమునే అప్పటిదిగా భావించుటలో వారు పురాణముల లోని లెక్క సరిపెట్టలేకపోయిరి. అయినను వారికి దేవమాన సంవత్సరము లన్నియు కల్పితములుగా దోచకపోయినందున వాస్తవికచరిత్ర వారికి బోధపడలేదు. సప్తర్షులు ముందుకు నడతురని లక్ష్మీనారాయణగారు చేసెడి వాద మే పురాణమును వప్పుకొనుటలేదు. సరిగదా గణితశాస్త్రజ్ఞులెవను చెప్పుటలేదు. మన పురాణ ప్రామాణ్యములకన్న జైనగ్రంథ ప్రామాణ్య మింకను హీనముగా నతిశయోక్తులతోను, షుమారుగాను ఉండునేగాని విశ్వసనీయముగాదు. గోపాలయ్యరు లక్ష్మీనారాయణగార్ల వాదముల ననుసరించినచో చాల వంశములవారి పాలన లేకుండనే పోవలెను. గాని యిది యసంభవము. యుధిష్ఠిర శకారంభమునే సందేహించు పండితులు కొందరున్నారు. ఆ శకమును దెల్పెడి యొక శాసన దృష్టాంతము గలదు. అది యీ క్రిందివిధముగా నున్నది.

"యుధిష్ఠిరశకము 89 సం॥న ప్లవంగ సం॥లో సహాన్యమాసము అనగా పుష్య బ 30 అమావాస్య సోమవారమునాడు జనమేజయ మహారాజు తుంగభద్రానదీతీరమున గల యొక స్థలమును అచటి మునిబృంద మఠమునకు తన తండ్రి తాతల పుణ్యమునకై అపరాగసమయమున దానమిచ్చెను."

(ఇండియన్ ఆంటిక్వేరి వాల్యూము 4 పుట 333 లోగల సంపూర్ణ శాసనమునకు సారాంశము.)

లిపి సాంప్రదాయమును బట్టి యీ శాసనము తర్వాతివారెవ్వరో కల్పించి వ్రాయించినట్లు పరిశోధకు లభిప్రాయపడియున్నారు గాని యొకవేళ

నా శాసనము నిజమైనదైయుండి మొదటి శిల నశించుస్థితిలో దిరిగి యీ కాలపు వారు వ్రాయించియుండిరేమోనని విచారించదగియున్నది. క్రీ. పూ. అయిదారు శతాబ్దులనాటి శాసనములును, నాణెములును మనకు యిప్పుడు లభ్యమగుచునేయున్నవి. ఇది యింకను ప్రాచీనమైనదగుటచే మొదటి శిల యెప్పుడో నశించుస్థితిలో దానిని తర్వాతశతాబ్దులవారు పునరుద్ధరించుటలో నప్పటిలిపిలో వ్రాసియుందురా? ఈశాసనమందేగాక పెక్కు గ్రంథములలో గూడ యుధిష్ఠిరశక ముదాహరింపబడి యుండుటవల్ల దీనిని కేవలము కల్పితముగా త్రోసివేయజాలము. గాని అసలీ యుధిష్ఠిరు డెప్పటివాడో ముందు నిర్ణయించినగాని దీని యథార్థతను గనిపెట్టజాలము.

దీనినిబట్టి యుధిష్ఠిర శకారంభ సం॥ము ప్రమాది సంవత్సర మగుచున్నది గణితశాస్త్రజ్ఞుల లెక్కప్రకారముగూడ కలి ఆరంభసంవత్సరము ప్రమాదియే. కలి ఆరంభమైనతర్వాత 25 సం॥లకు యుధిష్ఠిరశకము ఆరంభమయ్యె నని చెప్పెడి పురాణములకుగాని, యితర జ్యోతిషగ్రంథములకుగాని, ఈ శాసనము సరిపోవుటలేదు. ఈవిషయ మటుంచి మనమిపుడు సూక్ష్మముగా విచారించినగాని సత్యము తేలదు. మనపూర్వులకు ఎంత నిజము తెలియునో ముందు కనుగొందము. జరిగిన మనువులయొక్కయు రాబోవు మనువుల యొక్కయు ఆదులను యీ క్రింది పండుగలుగా గణితశాస్త్రజ్ఞులు మన పంచాంగములం దిచ్చుచున్నారు.

(గతించిన మనువులు)

| | | |
|---|---|---|
| 1. స్వాయంభువమనువు | ఆది | కార్తిక శు ౧౨ |
| 2. స్వారోచిషమనువు | ,, | ఆశ్వీజ శు ౯ |
| 3. ఉత్తముడు | ,, | చైత్ర శు 3 |
| 4. తామసుడు | ,, | భాద్రపద శు 3 |
| 5. రైవతుడు | ,, | పుష్య శు ౧౧ |
| 6. చాక్షుషుడు | ,, | ఆషాఢ శు ౧౦ |
| 7. వైవస్వతమనువు | ,, | మాఘ శు ౭ గాని మాఘ బ ౩౦ గాని |



(రాబోవు మనువులు)

| | |
|---|---|
| 8. సావర్ణి (అగ్ని) | శ్రావణ బ ౩౦ (రుద్ర) |
| 9. దక్షసావర్ణి | కార్తిక శు ౧౫ |
| 10. బ్రహ్మసావర్ణి | ఫాల్గుణ శు ౧౫ |
| 11. భౌచ్యకసావర్ణి | జ్యేష్ఠ శు ౧౫ |
| 12. సూర్యసావర్ణి | భాద్రపద బ ౮ |
| 13. ఇంద్రసావర్ణి | కార్తీక బ ౮ |
| 14. రుద్రసావర్ణి | ఆషాఢ బ ౮ (ధర్మ) |

రౌచ్యకమన్వాది యని చైత్ర శు ౧౫ ఒకటి కలదు గాని యిది లెక్కలో నిదిగా గానబడదు.

ఇంకను ధర్మసావర్ణి, భద్రసావర్ణి, దేవసావర్ణి యనువారల పేర్లు కాన వచ్చుచున్నవిగాని యవిగూడ పైవారలలో కొందరి రెండవ నామములే యైనట్లు కనబడుచున్నది. ఏలన, మొత్తము మనువులు 14 గురే గాని హెచ్చుగాదు. రాబోవు మనువులకుగూడ ఆదులు నిర్ణయించుట అసంభ వము. అందును లక్షలసంఖ్యలలో నున్న సంవత్సరములందలి తిథులు మాస ములు చెప్పుట యింకను అశక్యము. ఈ ఆదులన్నియు మనువులయొక్క జన్మాదులని అంగీకరించినచో నీ సందేహము విడిపోవుచున్నది. పైన సుడివిన యుగాదులకును యీ ఆదులకును సంబంధములేనట్లు మీరు గ్రహించగలరు. అందుచే నీ ఆదులు వారివారి జన్మముల ఆదులేయని తెలియవచ్చును. అయితే రాబోవు మనువులు ఆదులెట్లగునని ప్రశ్న వచ్చును. ఆ రహస్యమే మన మిపుడు స్పష్టముచేయవలసి యున్నది. మన పూర్వగ్రంథాలలో నన్నిం టను జరిగిన చారిత్రక విషయములనే కమ్మిగా భావికాలవిషయములుగా మార్చి వ్రాసినట్లు అనేక దృష్టాంతాలున్నవి. భాగవతాదులలోను పురాణ ములలోను క్రీస్తు పూర్వమును తర్వాతను పాలించిన యనేకరాజుల విష యాలు అశోకచక్రవర్తి, ఆంధ్రరాజులు మున్నగువారివి భావిచరిత్రలక్రింద వ్రాయబడినను నిజమున కా భాగములన్నియు దర్వాత జేర్చబడినవే యనుట స్పష్టము. అదేవిధముగా నీ మనువుల విషయమును జరిగినది. దీనికి

2

వృత్తాంత మేమనగా — రాబోవు 8 వ మనువు సావర్ణి కాలములోని సప్తర్షులను నిర్ణయించుటలో భారతయుద్ధమునను దత్పూర్వము నున్నట్టి కొందరి పేర్లు వ్రాయబడినవి. అశ్వత్థామ, కృపుడు, బాదరాయణుడు ఋష్యశృంగుడు, పరశురాముడు మున్నగువారా మనువు కాలములో సప్తర్షులుగాను బలిచక్రవర్తి యింద్రుడుగాను చేర్పబడిరి. దీనినిబట్టి తేలినదేమన, కృపాశ్వత్థామ. పరశురామ బాదరాయణాదులు జన్మించి జీవించినపిమ్మటనే యీ మన్వంతరాల నిర్ణయములు జరిగినట్లు ధృవపడుచున్నది. అనగా భారత యుద్ధకాలము తర్వాతనే యీ మన్వంతరాలన్నియు నేర్పడినట్లు స్పష్టపడుచున్నది. దీనిని కప్పిపుచ్చుటకై వీరిని చిరకాల జీవులుగా చెప్పిరి.

"శ్లో॥ అశ్వత్థామ బలిర్వ్యాసో, హనుమాన్యశ్చ విభీషణః
కృపః పరశురామశ్చ సప్తైతే స్థిరజీవినామ్॥"

అని యొక ప్రమాణము ప్రచారమొనర్చిరి.

ఇక మన్వంతరాలు పూర్వ మెట్లున్నదియు, వాని నేవిధముగ మార్చినదియు కనుగొందము. స్వాయంభువమనువు మొదలు మన పురాణములందు లెక్క కనుబడును. ఆయనక్రింద 10 మంది రాజులుండిరి. ఉత్తానపాదుడు, ప్రియంవదుడు మున్నగువారు. రెండవమనువు స్వారోచిషుని క్రింద 11 మంది రాజులుండిరి ద్యుచుత్సేనుడు. రోచిష్మతి మున్నగా గలవారు. ఈ విధముగనే ఉత్తమ, తామస, రైతవ, చాక్షుష మనువులకు గలరు. ఉత్తమ, తామస, రైతవ మనువులు ముగ్వురును అన్నదమ్ములే. అందుచే వారి పాలనకాలము హెచ్చుగా గనబడదు. ఈ మనువులందరి వద్దను ఇంద్రుడు, కొందరు దేవతలు, సప్తర్షులు, రాజులును ఉందురనియు శ్రీ మహావిష్ణువు ప్రతిమన్వంతరమున నొక్క యవతారము నైకొనుననియు పురాణములందు గలదు. భగవద్గీతలో ప్రతియుగమున కొక యవతారము వచ్చునని చెప్పబడినది. ప్రతి మన్వంతరమునగాని, యుగమునగాని వచ్చిన విష్ణువులు మానవులేననియు వారికి తల్లిదండ్రులున్నట్లు వారి పేర్లు వివరముగా భాగవతాదులయందున్నవి. వానిని ముందు వివరించెదను. మొదటి స్వాయంభువమనువు మొదలు ఆరవ మనువువరకు 20 తరములకన్న హెచ్చులేవు.



మొదటి మనువు వంశమంతయు లెక్కించినను 32 తరములే కనబడుచున్నవి. ఆ కాలపు జనులు మనుస్మృతిలో నున్నట్లు 400 మొదలు 100 సం॥ల వరకు జీవించి, 50 సం॥ల ప్రాయమున సంతానము బొందుచుండిరని లెక్కవేసినను, 6 వ మనువువరకు గల తరములకు 12 వందల సంవత్సరములు మాత్రమే యగును. మనుస్మృతిలో కృతయుగమున 400 సం॥ చొప్పున జీవించిరని యున్నది. ఈ కాలమును మన పూర్వులు 1704 యుగములుగను. అవి దేవమానములుగను మనకు పెంచి చెప్పుటలో గల యంతరార్థమును మనమిపుడు తెలుసుకొనవలెను. గణితశాస్త్రజ్ఞులు లెక్కలు వేసి సృష్ట్యాది 195 కోట్ల సంవత్సరములయ్యెనని నిర్ధారించిరి. ఇది దేశీయ విదేశీయ శాస్త్రజ్ఞులంద రంగీకరించుచున్నారు. ఈ నిర్ధారణ దాదాపు భారత యుద్ధకాలమునకే జరిగియుండును. ఈ కోట్లసంవత్సరములను విభాగించి మన పూర్వ చక్రవర్తులగు మనువులపేరిట మన పూర్వులు మనకు పురాణాదులలో చెప్పదలచిరి. అందుచేతనే ఒక్కొక్క మనుకాలము 284 యుగములు దేవమానముగా లెక్కపెట్టి సరిపెట్టిరి. దేవమానమనగా మనకు సంవత్సరమైనచో దేవతల కొకరోజు. ఈ రీతిగ పురాణము లన్నింటను రాజుల కాలములను వీలైనచోట్ల నెల్ల దేవమానములుగా పెంచి చెప్పియుండిరి. ఇక మొదటి ఆరుమనువుల కాలములును, తర్వాత కాలమును తెలుసుకొందము. మొట్టమొదట దేవరాక్షసులు హిమగిరియందు మందరగిరి యను పర్వతప్రాంతమున వసించుచుండిరి. దీనినే త్రివిష్టపమనిరి (Tibet). క్రమముగా కొంతకాలమునకు వారు విడిగా నివసింపజొచ్చిరి. దేవతలకు ఇంద్రుడను హోదాతో నొక పాలకు డేర్పడెను. తర్వాత కొంతకాలమునకు యీ యింద్రరాజధాని అమరావతియయ్యెను. అచ్చటనుండియే దేవరాజ్యము పాలింపబడుచుండెను. దీనినే తర్వాత బ్రహ్మావర్త మనిరి. అచుట్టుప్రక్కల నివాసులందరు దేవతలనబడుచుండిరి. వారి దాయాదులు రాక్షసు లనబడిరి. వీరందరును * కశ్యపసంతతి. ఈ దేవరాజ్యములో నింకను గరుడ,

* దేవతలనబడువారు మొదట యుత్తరధృవ ప్రాంతమున వసించినవారి సంతతి యనియు, వారచట సం॥ర మొక దినముగా గెంచుదురనియు,

గంధర్వ, యక్ష, సిద్ధ, సాధ్య, చారణ, విద్యాధర, అప్సరస, నాగ, కిన్నర, కింపురుష జాతులవారును, రాక్షసులలో దానవ, దైతేయ, పిశాచ, అసురాది గణములు నుండెను. ఖగోళములోనుండిన దేవతలను (ఇంద్ర వరుణాదులు) గురించి ముందుపుటలందున్నది. మనుసంతతి వారుమానవులై అయోధ్యాది స్థలముల నివసింపజొచ్చిరి. మనువు యింద్రరాజ్యమునకు, అయోధ్యాది రాజ్యములకు చక్రవర్తిగా నుండెను. ఇట్టి మనువులు 6 గురు గడచిరి. దేవరాజ్యమునకు, మానవరాజ్యమునకు అన్యోన్యత యుండెనుగాని రాక్షసులకు దేవరాజ్యమునకు విరోధములు హెచ్చి అనేక యుద్ధములు జరుగుచుండెను. మానవులు దేవతలకు సహాయులై నిలచిరి. ఆ వివరములన్నియు ముందుపుటలలో చెప్పబడును. మానవరాజులు కొందరు దేవరాజ్య పాలన గూడ నప్పుడప్పుడు చేయుచుండిరి. మొదటి మనువు ఆడపిల్ల కిచ్చిన భూభాగము దేవరాజ్యముగాను, మగసంతతిది మానవ రాజ్యముగాను అయ్యెను నాటినుండి భారత యుద్ధకాలమువరకు యీ దేవరాజ్యమును, అందలి చిన్నచిన్న యధిపతులు (అగ్ని, యమ, వరుణాదులు) ను ఉండెడివారు. జలంధరుడు, త్రిపురాసురులు, బలి, బాణుడు, హిరణ్యకశ్యపుడు మొదలగు రాక్షసులకు జలంధర్, త్రిపురి, సోనపూరు మున్నగు నగరములు రాజధానులుగా కొంతిపాలన యుండెను. నాగపూరున నాగులును, ఖడ్గపూరున గరుడులును, కందహారున గంధర్వులును, అలకాపుర ప్రాంతమున యక్షులును, నివసించుచుండిరి. వామనుడు బలిచక్రవర్తిని పాతాళమునకు పంపువరకు అనగా దక్షిణహిందూదేశమునకు పారద్రోలువరకు రాక్షసులు

నదియే దేవమాన మయ్యెననియు, నా ప్రాంతమున వారు కేవల మాంసాహారు లగుటవల్లనే తర్వాతగూడ దేవతార్యులలో నీయాచార మున్నట్లును కొందరు పండితు లిటీవల గ్రహించిరి. హిమాలయ పరిసరపు దేవికానది వద్దనే మానవ యుత్పత్తియని భారతమున నున్నదిగాని యిరాను మున్నగు చోట్లనుండి వీరు నానాచోట్లకు వలస వెడలినట్లును, తత్పూర్వము ధృవప్రదేశ వాసులనియు అవెస్తా వాఙ్మయమువల్లను, ఋగ్వేద దృష్టాంతములను దెలియుచున్నది. (ఋ 7-87-7) సప్తసింధునుండియే యిరాను మున్నగుచోట్లకు వెడలిరనుటకు గూడ కొన్ని ఆధారము లున్నవి.



ఉత్తరదేశముననే నివసించిరి. బలి, బాణుని వంశీకుల శాసనములు చిత్తూరు జిల్లాలో దొరికినవి. ఇవి 11వ శతాబ్దినాటివి. మనువులు ఆగ్నర మన్వంతరాలు (మొదటిఆరును) 1200 సం॥లకన్న హెచ్చుకావని లోగడ తెల్పితిమి. 7వ వైవస్వతమనువు ఆరంభముతో కృతాయుగారంభమయ్యెనట. అప్పుడు సూర్యవంశంలో ఇక్ష్వాకు మొదటిరాజు. అతనితో మూడు తరములు గడువగనే పురంజయుని కాలముననే కృతయుగము అంతమయ్యెనట. చంద్రవంశములోగూడ నట్లే 8 తరములు గడచుసరికి పురూరవుని కాలముననే యుగము మారెను. మూడు తరములకు హెచ్చుగా మనుస్మృతి ప్రకారము లెక్కవేసినను 150 సం॥ల కన్న హెచ్చులేదు. దీనికి 4800 దేవమాన సంవత్సరములు గడచినట్లు లెక్కవేసిరి. మన సిద్ధాంతు లీకాలమునే మహాయుగముగా జేర్చుకొని 12 వేల దివ్యవర్షాలనిగూడ చెప్పుచున్నారు. పైన నుడివినట్లు యీ హెచ్చు సంఖ్యలన్నియు సృష్ట్యాదినుండి వచ్చిన కాలము లెక్క సరిపెట్టుటకే వేయబడినవి. అయినచో నిజమైన లెక్క తేలుటెట్లు ? దానినే క్రింద వివరించెదను. ఋగ్వేదములో నైదుసంవత్సరములకొక యుగము చెప్పబడినది గాని యీ పద్ధతి తర్వాత మార్చబడెను.

ఇక్ష్వాకు మొదలు భారత యుద్ధకాలమువరకు నున్న బృహద్రథుని వరకు ఆ వంశములో 88 లేక 83 తరములు మాత్రమే జరిగినవి, (అనుబంధము చూడుడు.) వీనికి మన పూర్వుల లెక్కప్రకారము 27 మహాయుగములు (ప్రతిమువ్వురకు ఒక యుగం) జరిగినట్లున్నను నిజమునకు 4800 సం॥ల కన్న హెచ్చుకాలేదు. అనగా మన పూర్వులు చెప్పిన దేవమానములు అంతరభేదములు మిథ్యయని త్రోసివేసి చూచుకొనుచో ఒక తరమునకు యేబదిపైగా సం॥లు లెక్కించినను నాలుగు సమానయుగములు జరిగినట్లు కనబడును. యుగమునకు 1200 మానవ సం॥లే మొదట జరుగుచున్నట్లును, భారతయుద్ధమువరకు అట్టివి ఇక్ష్వాకు మొదలు 4 జరిగినట్లును, తత్పూర్వమొకటి మొదటి మనువునుంచి ఆరవమనువు వంశము ఆఖరువరకు జరిగినట్లును మనము స్పష్టముగా భావింపవచ్చును. మన పూర్వులు సృష్ట్యాది లెక్కను చెప్పుటకొరకే యుగసంఖ్యలు పెంచిరని లోగడ తెల్పితిమి. ఇట్లు పెంచుటలో కృతయుగమునకు 4 రెట్లు, త్రేతకు 8 రెట్లు, ద్వాపరానకు 2 రెట్లుగాను పెంచుటయేగాక అన్నింటికి దేవమానక్యా...

నింకను 360 రెట్లు పెంచియుండిరి. వారి యుద్దేశ్యములో నా కాలమువారు వరుసగా 400, 300, 200, 100 సం॥ జీవింతురనియు, ధర్మదేవతగూడ ఆ యుగములలో 4, 3, 2, 1 పాదములమీద నడచుననియు తలంచి యుండిరి. ఇదియే మనుస్మృతిలో జెప్పబడినది. ఇట్లు లెక్కలువేసి సృష్ట్యాదియంతను సరిపుచ్చినను వారికి తెలిసిన పూర్వుల తరములకు సరి పెట్టుటలో కుదరక చిక్కువచ్చినందున అనగా ఆ లెక్కప్రకారముగూడ వారికి పూర్వరాజుల పేర్లు చాలనందున అందరికి సమానముగా యుగములు పంచిరి. ప్రతి దేవమహాయుగమునకు ముగ్గురు రాజుల చొప్పున భావించి వైవస్వతమనువునుండి 27 మహాయుగములు జరిగినట్లు గూడ పెంచి చెప్పిరి. దీనికి దృష్టాంతమేమన, మన ప్రాచీన శాస్త్రములరీత్యాగాని, గణిత శాస్త్రజ్ఞులకు తెలిసినవిగానీ యేడు యుగములే గడచినవి 8 వది జరుగు చున్నది. వీని ఆరంభాంతములను లోగడ వ్రాసితిమి. ఇవియే మనపంచాం గములలో కనబడుచున్నవి. పూర్వ గణితశాస్త్రములలో నింతవరకే యాద్యంతములు దొరకుచున్నవి. ఇవి మానవ యుగములే యనియు, 1200 కన్న ప్రతియుగమును హెచ్చులేదనియు ఇక్ష్వాకు వంశములోని తరముల సంఖ్యలను బట్టి నిర్ణయించితిమిగదా. వీని ప్రకారము మన పూర్వులు నేటివరకు $7 \times 1200 = 8400$ సం॥ల చారిత్రమునే యెరుగుదు రనియు, దర్వాతవచ్చిన యుగము అనగా ప్రస్తుతయుగము 247 సం॥ల క్రిందట ఆరంభమైనట్లును మనకు కనబడుచున్నది. అయితే యిప్పటి పంచాంగ లెక్కప్రకారము కలియుగము 5047 అని చెప్పుచున్నారు. దాని వివరమేమియో తెలుసుకొందము.

## కలియుగ రహస్యము

మొదటి ఆరుమనువుల కాలము నిజమునకు ఒక యుగమే అయినను అనగా దాదాపు 1200 సం॥లే అయినను వానిని చాల పెంచి చెప్పిరిగదా. దానిని వదలి ఇక్ష్వాకునుండి కృతయుగమని చెప్పబడినందున భారతయుద్ధము తర్వాత 37 సం॥ల వరకు 4 యుగములు అనగా 4800 జరిగియుండెను. అప్పటికి నాల్గవయుగము అంతమైపోవలెను. కాని అప్పటి గణితశాస్త్రజ్ఞు



లగు ఋషీశ్వరుల కది యిష్టములేక సృష్ట్యాదిని సరిపుచ్చుటకై మన పూర్వీకులపేరిట మన్వంతరాలు, సప్తర్షులు(Great Pear Stars)మున్నగు వాని పేర్ల కకాల నేర్పరచి అప్పుడములలో చివరకువచ్చిన కలియుగాన్ని దేవమానముచేసి 1200 దేవమాన సం॥లకు గాని అంతముకానట్లు వ్రాసిరి. అయినను యుగాదుల ఆరంభాంతములను మాత్రము ప్రతి 1200 సం॥లకు గణితశాస్త్రజ్ఞులు మామూలుగా చూపించుచునే వచ్చిరి. ఇది క్రీస్తుశకము దాదాపు 1630 సం॥ల వరకు వేయుచుండిరనవచ్చును. ఏలన, వీరికి తెలిసిన 7 యుగములలో ఒకటి, మొదటి ఆరుమనువులవరకు గల పూర్వు లకు వదలకుండా ఇక్ష్వాకు మొదలు భారతయుద్ధమువరకు 4 యుగములును, పోగా మిగతా 3 యుగములు తర్వాతను లెక్కించియుండవచ్చును. అయితే ఇవి యెంతవరకు వచ్చినది నిర్ణయించుటలో ముందుగా భారత యుద్ధకాల నిర్ణయమును, కలికాల నిర్ణయమును, యుగకాలనిర్ణయమును, యుధిష్ఠిర కాల నిర్ణయమును గావించినగాని ధృవపడదు. అందుచే వానిని నిర్ణయించు టకై యిపుడు యత్నింతము. గణితశాస్త్రములలో నిపుడు ముఖ్యమైనదిగా భావింపబడు సూర్యసిద్ధాంతములో ప్రతి దేవమాన యుగారంభమునందును గ్రహము లేడును, మేషరాసియం దుండునని వ్రాసియుండిరి. ఆ ప్రకారము కలియుగారంభమునాడు క్రీస్తుపూర్వము 3102 సం॥ల క్రిందట. ప్రమాది సం॥లో అట్లేయుండెను. అప్పుడొక యుగారంభము జరిగినట్లు చాలమంది విదేశీయ, స్వదేశీయ గణితశాస్త్రజ్ఞు లొప్పుకొనుచున్నారు గాని * పురాణ ములలో చెప్పినట్లు యీ యుగారంభ మప్పుడే కృష్ణనిర్యాణము, భారత యుద్ధాదులు జరిగెనని చెప్పుటకు వీలుగాలేదు. ఏలన, దీనిలో అనగా నీ యుగారంభమున కృష్ణనిర్యాణము, భారతయుద్ధము జరిగెనని చెప్పెడి పురాణాలన్నింటిలోను పరీక్షిత్తు జన్మము మొదలు అనగా భారతయుద్ధము మొదలు నందాభిషేకపర్యంతము హెచ్చుసంఖ్యనే తీసుకొన్నచో 1050 సం॥లని వ్రాయబడినవి. క్రీస్తుపూర్వము నందులవరకు 422 సం॥లు లెక్క తేలుచున్నది. మొత్తము 1922 సం॥లు అగుచున్నది. అందుచేత క్రీ. పూ.

* కలకత్తా యూనివర్సిటీవారు ప్రచురించిన ఆంగ్లభాష సూర్యసిద్ధాం తము చూడుడు.

3102 సం॥ నాడు ఆరంభమైన యుగారంభము ముందు భారతయుద్ధము జరుగలేదనియు తర్వాత జరిగిన యుగారంభకాలము ముందు నది జరిగెననియు తెలుచున్నది. అనగా అప్పటికి కలియుగం అంత్యమైనది. కాని దానిని అట్లు అంత్యము అయినట్లు భావింపనీయక, అప్పటివారు యుగాదులసంఖ్యను పెంచి మార్చివేయుటలో మన పురాణములందు కలి యుగారంభముతో కృష్ణనిర్యాణము, భారతయుద్ధములు కలిపివ్రాసి సరిపుచ్చుకొన్నట్లు కనబడుచున్నది. దీనికి దృష్టాంతము మహాభాగవతములో కనబడుచున్నది. దీనిలో 4 యుగములే జరిగినట్లుగూడ కలదు.

శ్రీకృష్ణ నిర్యాణకాలమునకు, సప్తర్షులు మఖానక్షత్రమం దుండిన కాలములో వచ్చిన కలి, ప్రవేశించి 1200 జరిగినను అది మిక్కిలి తీక్ష్ణముగా నుండక కృష్ణనిర్యాణానంతరమే ప్రవృద్ధమగుననియు అందుచే నప్పటినుండే కలిని భావింపవలయుననియు, కలిపురుషుడు రవి శుక్ర చంద్ర గురువు లేకరాశిగతులైనపు డుద్భవించుననియు మహాభాగవతమున ద్వాదశ స్కంధమునందు చెప్పబడినది. (ఆనందప్రెస్ ముద్రిత ప్రతి) సప్తర్షులు వాస్తవముగ మఖానక్షత్రమందు కలియుగారంభమున నునిడినను ఆ విషయము కృష్ణనిర్యాణమునకును, భారతయుద్ధమునకును పరీక్షిత్తు జననమునకును గూడ అంటగట్టి మన పూర్వపురాణములన్నియు సవరించుకొన్నట్లు పైభాగవత కథనమువల్ల గూడ గోచరించును. ఇవియన్నియు దేవమాన యుగాలు భారతయుద్ధానంతర మేర్పరచినప్పుడు జరిగియుండును. దేవాపి మరుత్తులను వారు కలాపి యను గ్రామమున కలియుగాంతమువరకు వేచి యున్నారనియు కల్యంతమున వారు సూర్యవంశము నుద్ధరింతురనియు జెప్పబడిన పురాణముల వ్రాత లా కాలపు యుగములు త్వరలోనే యంతమొందుటను భారతయుద్ధముతర్వాత వచ్చు యుగమును సూచించుచున్నవి. దీనినిబట్టి అదివరకు మామూలుగా 1200 సం॥ల పరిమాణము మాత్రమే గల యొక యుగము భారతయుద్ధమైన పిమ్మట 37 సం॥లకు వచ్చినట్లును, అప్పుడే కలియుగాంత మయ్యెననియు, కలి ఆరంభమందే మఖలో సప్తర్షు లుండిరనియు గ్రహింపవచ్చును. అంతేగాని భారతయుద్ధకాలమందు గాదు.



ఆ వ్రాతలు తర్వాత కల్పిరి కాని మనవారు అప్పుడే యుగములు పెంచుటవల్ల పూర్వపద్ధతిగూడ కొంతకాల మమలునందుండెను. ఇది కొన్ని చోట్ల నుండియుండును. దీనికి దృష్టాంతము సూర్యసిద్ధాంతము.

## సూర్యసిద్ధాతము

సూర్యసిద్ధాంతమను గణితగ్రంథము కృతయుగాంతమున చెప్పబడినట్లు అందు వ్రాయబడినది. ఈ కృతయుగ మేది? ఇక్ష్వాకునాటిదా? లేక భారతయుద్ధానంతరము వచ్చిన కృతయుగమా? దేవమాన యుగమా? దేవమానయుగ కాలమునకు మానవోత్పత్తియే సందేహము. ఇక్ష్వాకునాటి మానవ సాధారణ కృతయుగ కాలమున కింకను జ్యోతిషవిజ్ఞానము హెచ్చుగా పెరిగియుండలేదు. ఇటీవల లభించిన వేదాంగ జ్యోతిషము చాల పరిమితిగానే యున్నది. అందుచే నిది భారతయుద్ధము తర్వాత వచ్చిన కృతయుగాంతమునందే వ్రాయబడినట్లు చెప్పవచ్చును.

దీనికి దృష్టాంతములు లేకపోలేదు. ఆర్యభట్టు ఆర్యభటీయమను గణితశాస్త్రమును కలియుగము 3600 సంవత్సరములో వ్రాసినట్లు చెప్పుకొనియున్నాడు. వేదాంగ జ్యోతిషము తర్వాత మొదటిగ్రంథ మిదియే. ఈ శాస్త్రమునందలి కొన్ని సూత్రములు సూర్యసిద్ధాంతములో చెప్పబడినవి. వరాహమిహిరుడను నవ ఖగోళశాస్త్రవేత్త 505 A D. ప్రాంతములో విక్రమార్కుని (III) ఆస్థానమున మహాకవి కాళిదాసునితో సహా ఆస్థానపండితుడుగానుండి పంచసిద్ధాంతికాద్యనేక గ్రంథములనురచించెను. అందులో సూర్యసిద్ధాంతము నుదహరించెను. * అందుచే సూర్యసిద్ధాంతము కలి

* చివరకీ గణితశాస్త్రవేత్త కాలములోగూడ వివాదాభిప్రాయములు జనించెను. ఆతడు పేర్కొనిన శకకాలములను సైరసు శకమని తలచి పెక్కండ్రు పొరబడిరి. ఈ సంశయములను విచ్ఛేదమొనరించుచున్నది కాళిదాసు మహాకవి రచితమగుజ్యోతిర్విదాభరణము. దీనిలో స్పష్టముగా (జైన) కలివర్షములు 3068 లో తానా గ్రంథము వ్రాసినట్లును, వరాహమిహిరుడును తానును మరికొందరు పండితులును విక్రమార్కుని ఆస్థానపండితుల మనియు వ్రాసియున్నాడు. విక్రమార్క, శాలివాహన శకముల నితడు ప్రస్తావించెను. అందుచే కాళిదాసుగూడ 500 A.D. ప్రాంతీయుడగుచున్నాడు.

3600, A.D. 505 నాటికి వచ్చిన కృతయుగాంతమున రచింపబడి నట్లు తేలుచున్నది. కలి 1200 సం॥లో నొక యుగము వచ్చినట్లు మహా భాగవతమున స్పష్టముగనే యున్నదిగదా. ఇది భారతయుద్ధకాలపు యుగము. ఆ యుద్ధమైన 37 సం॥లకు వచ్చెను. అప్పుడారంభమైన యుగము కృత యుగమే కాని యన్యముగాదు. కాని కలి యని లెక్కించిరి. తర్వాత కృత యుగము 1200 సం॥లు జరుగుచుండగా నదగా నప్పుడే వృద్ధిజేయబడిన దేవ మాన మహా కలియుగము 3600 సం॥లు జరుగుచుండగా నీ సూర్యసిద్ధాంత రచనము జరిగినట్లు కనబడుచున్నది. ఈ సిద్ధాంత మట్లు వ్రాయబడి క్రమ ముగా మార్పులు చేర్పులనుగూడ బొందినట్లు మనకు స్పష్టపడుచున్నది. కలకత్తా యూనివర్సిటీ ప్రచురణ పీఠికను సమగ్రముగా జూచినచో నీ విషయము బోధపడును గాని యందలి కాలనిర్ణయము మాత్రము వ్యత్యాస ముగ నున్నది.

ఈ యుగములన్నియు 360 సూర్యోదయ దినములుగల్ల సావన సంవత్సరములచే నిర్మింపబడుటవల్ల నివి సౌరమానము ప్రకారము చూచి నప్పుడొక్కొక్కయుగమునకు 1182 సం॥లు 8 మా 20 రోజులుగా అగుచున్నవి. ఈ ప్రకారము గణితము వేసినయెడల పూర్వకాలమున సౌర మాన ప్రకారముగ నీ క్రింది కాలములందు పూర్వయుగము లేర్పడినట్లు తేలును.

క్రీ. పూ. 6651 వ సం॥ నవంబరు ప్రాంతమున ప్రమోదూత సం॥లోను,
,, 5468 ,, సెప్టెంబరు ప్రాంతమున ప్రమాదీచ సం॥నను,
,, 4285 ,, మే నెల చివర దుర్ముఖి సంవత్సరమందును,
,, 3102 ,, ఫిబ్రవరిలో ప్రమాది సం॥నను,
,, 1920 ,, నవంబరు ప్రాంతమందు దుందుభి సం॥మందును,
,, 737 ,, ఆగస్టు మొదటిలో విశ్వావసు సం॥మందును,
క్రీస్తుశకం 447 ,, ఏప్రియల్ చివరలో సర్వధారి సం॥మందును,
,, 1630 ,, జనవరి చివర లేక ఫిబ్రవరిలో ప్రజోత్పత్తి సం॥ర

మందును యుగములు వచ్చెను. ఈ చివరిది మహాకల్యాంతర్గత కలియుగం ఇది క్రీ.శ. 2812 లో అంతమగును. మన పంచాంగములందు చెప్పబడెడి



ఆద్యంతములు ఒకదానికొకటి తారుమారైనట్లు కన్పడుచున్నవి. వానిని యీ క్రిందిరీతిగా అమర్చి చూచినచో సరిపోగలవు. గణితకారులు దీనిని పరిశీలించి గుణించి చూడగలరు.

కల్పాది సర్వజితు చైత్ర శు ౧. ఇది కల్పముగా చెప్పబడినది గాని ఒక యుగమే జరిగినది.

మొదటి యుగం కార్తిక శు ౯ ఆరంభం
2 వది ,, భాద్రపద బ ౨౧ ,,
3 వది ,, వైశాఖ బ ౧౦ ,,
4 వది ,, మాఘ బ 3౦ ,,
5 వది ,, కార్తిక శు ౧౫ లేక బ ౧౨ ఆరంభం
6 వది ,, శ్రావణ శు 3 ఆరంభం
7 వది ,, వైశాఖ శు 3 ,,
8 వది ,, మాఘ శు ౨ ,,

ఇందలి 2, 6 ఆరంభములు ఒకదానికొకటి మారనుగూడ వచ్చును. వృశ్చిక, సింహ, వృషభ, కుంభసంక్రమణ ప్రవేశములలో యుగారంభము లైనట్లు గల ఆధారములు చివరమన్న 4 యుగాల కన్వయించును. ఇవి యన్నియు 3102 సం॥ ఫిబ్రవరి18వ తేదీ నాటి యుగారంభమున మేష రాశియందు సప్తగ్రహము లున్నట్లు కనుగొనిన శాస్త్రజ్ఞుల లెక్కలనుబట్టి తక్కినవి నిశ్చయింపబడినవి. ఇవియే మన పురాణములందలి వంశావళి తరములకు పంచాంగములలోని యుగాబ్దతిథులకు సరిపడును. గాని యితర విధములగు గుణకములకు సరిపడవు. పైన నుడివిన కల్పాదికి 20 యుగ ములకు పూర్వము ప్రభవ సం॥లో నొక యుగారంభము గన్పడుచున్నది. ప్రతి మన్వంతరమునకు ఒక విష్ణు వవతార ముండుననియే పురాణములం దున్నది. ఈ రీతిగ విష్ణుపదవిలోనున్న యనేకుల పుట్టుపూర్వోత్తరాలు ముందుపుటలలో నుడివెదము. ప్రతి యుగమునందు ఒక్క విష్ణువవతారము మాత్రమే వచ్చునను విషయము భగవద్గీతలో తర్వాత కల్పింపబడినది. ఒక్క యుగమందే మొదటి ఆరుగురు మనువులు పాలించినను దానిని

మనవారు ఎన్నో యుగాలుగా పెంచి చెప్పిరని లోగడ వ్రాసితిమి. వీరందరి కాలమునందును విష్ణుప్రవక్తలుండి దేశ రక్షణమును, మతప్రచారమును గావించుచుండిరి. ఇక భారత యుద్ధకాల ప్రశంస గావింతము.

## భారత యుద్ధకాలము

పురాణములలోను, భారతమందును కనబడు ప్రకారము కలియుగారంభమునకు 37 సం॥లు ముందు భారతయుద్ధము జరిగినట్లు తెలుసు. ఆ యుగము క్రీస్తు పూర్వము 1920 సం॥ నాటిదని లోగడ రుజువు చేసితిమి. అందుచే దానికి పూర్వము 37 సం॥ర క్రిందట అనగా క్రీ.పూ. 1957 సం॥లో నది జరిగియుండును. యుధిష్ఠిరశకము ప్రమాది సం॥లో ఆరంభించినట్లు లోగడ నుడివిన శాసనమునుబట్టి కనబడుచున్నందున యుధిష్ఠిరుడు చనిపోయిన నాటికి యుగారంభము నుండి 18 సం॥లు మాత్రమే జరిగినట్లు అగుచున్నదిగాని 25 సం॥లని భారతాదులలో నున్న వ్రాతయే ప్రమాణముగా మనము భావించుట యుక్తము.

ఏలన, పైన నుడివిన శాసనము 11 వ శతాబ్దము దాదాపుగా పుట్టబడినది. దానిలోని సంఖ్య త్రోసివేసి చూచితిమేని యుధిష్ఠిరశకము శక లౌకికశకము క్రీస్తుపూర్వము 1895 సం॥లో నేర్పడినట్లు మనమిప్పుడు నిశ్చయింపవచ్చును. వరాహమిహిరాదుల లెక్కకిది వ్యత్యాసముగానున్నను పురాణములలోని పరీక్షిత్తు జననకాలము యుగారంభములను బట్టి నిర్ణయింపబడినదగుటచేత మిక్కిలి ప్రమాణమైనది. వరాహమిహిరుడు కల్యాది నొప్పుకొని దాని కనుగుణ్యముగ నాకాలము దాపుగా నీ శకము చెప్పుటయే పొరపాటు. ఇట్లే క్రీస్తుశకారంభమున తర్వాతను నుండినట్టియు, పూర్వ మన్వంతరాల సంఖ్యలే ప్రమాణములుగా గుడ్డిగా నమ్మినట్టియు, మన జ్యోతిష గణితశాస్త్రజ్ఞులు యీ భారతకాల యుగమునకును, తత్పూర్వము ఆరంభమైన క్రీ పూ. 3102 నాటి కలియుగారంభమునకును, నాటి సప్తర్షుల స్థానమునకును భేదము గుర్తింపజాలక, నీ రెండుయుగముల వర్ణనలను కలిపివైచిన పురాణవ్రాతలను విడదీయజాలక, కలియుగారంభము క్రీ. పూ. 3102 అనియు, యుధిష్ఠిరశకము 3077 అనియు తలంచి యీ ప్రకారమే



తమతమ గ్రంథములందు వ్రాయించియుండిరి. వరాహమిహిరుడు తన గ్రంథములలో నిట్టి సంఖ్యల కనుగుణముగనే నాటికి ప్రచారమందున్న శాలివాహన, కలియుగశకములలో వాకొనియున్నట్లు కనబడుచున్నది. ఈ వివరములకు ఆంధ్రమహాసామ్రాజ్యమను గ్రంథము చూడుడు. వరాహమిహిరాది గణితశాస్త్రజ్ఞుల కాలమునాటికే సూర్యసిద్ధాంత మమలునందుండుటయు సూర్యసిద్ధాంత జ్యోతిష గణితశాస్త్రములలోగూడ భారత యుద్ధకాలము పిమ్మట నేర్పరుపబడినట్టియు, సృష్టి పరిమితిని తెలుపుటకై యుద్దేశింపబడినట్టియు మన్వంతరాలు, యుగాలు, దేవమానములు లెక్కలోనికి తీసికొనబడి వానిప్రకారమే గ్రహగతులు, నక్షత్రగతులు మున్నగునవి నిర్ణయమొనర్పబడి యుండుటవల్లను, వరాహమిహిరాదు లీ రహస్యమును భేదింపక పోవుటకు కారణమనవచ్చును. వారికి చారిత్రక సత్యములతో గణితమును రుజువుచేయు నావశ్యకత లేకుండెను. అయినను వారుగూడ కల్యారంభము క్రీ.పూ. 3102 గానే చెప్పిరిగదా. ఆ దేవమానాది నిర్ణయములు, కాలములు వారి గణితములకుగాని, సూర్యసిద్ధాంత ప్రతిపాదనలకుగాని వ్యత్యాసములు కలిగించియుండవు. ఇక రాబోవు మనువుల విషయము విచారింతము. 8 మొదలు 14 వరకు గల మనువులుగూడ భారతయుద్ధమునకు పూర్వమే జనించి కొన్ని ప్రదేశములలో పాలించినవారుగా గన్పడుచున్నారు. మొదటి సావర్ణి సూర్యకుమారుడుగా వర్ణింపబడినాడు. ఒకచోట నతడు మనువులలో జివరివాడని చెప్పబడెను. వీరిక్రింద పాలనలో నున్న రాజుల విషయములు పురాణములు వచించుచున్నవి. వారికి కుమారులు మున్నగువారున్నారు. వీరందరి పేర్లతోను రాబోవు లక్షలకొలది సంవత్సరములుగా నుండు కాలమానమును మన పూర్వశాస్త్రజ్ఞులు కట్టివైచిరిగాని యవి యెంతవర కాచరణములో నుండగలవో ముందుకాలమే నిర్ణయించును. లింగ పురాణములో నొకచోట రాబోవు మనువుల నామములు సూర్యునిలోగల రంగుల పేరిట పెట్టబడినట్లు వ్రాయబడినది. మన గ్రంథములందు గానబడుచున్నట్టియు, అపూర్వముగా నున్నట్టియు, భారతయుద్ధానంతరము నిర్మింపబడినట్టియు, నీ యుగ, మన్వంతర కాల నిర్ణయాదులు వేదేతిహాసములందును లేవు. అట్లు లేవనిగూడను పురాణములందు గలదు. ఇది

కేవలము లోగడ నుడివినట్లు మన పూర్వులు తమ ప్రతిభను చూపుటకై గణితశాస్త్రముప్రకారము లెక్కవేసిన సృష్ట్యాది సంఖ్యలను తెలుపుటకే ప్రాచీనుల పేరిట కల్పింపబడిన యొక చారిత్రక నవలాప్రపంచముగ నున్నది. మహాభారతమును రచించిన వ్యాసమహర్షి కాలములో యివి యన్నియు నూహింపబడి పూర్వ పురాణములందును తదితర గ్రంథములం దును చేర్చబడియుండును. ఆతడే వేదములనుగూడ భాగించి వేదవ్యాసు డయ్యెను. ప్రాచీన ఋగ్వేదములు బహు స్వల్పముగా నుండును దానిలో కొంతభాగము క్రీ.పూ. 6350 ప్రాంతమున రచింపబడియుండును. ఏలన, ఋగ్వేదమున ఇక్ష్వాకు, పురూరవుడు, పూరువులు, తుర్వసులు, యదువులు, ద్రుహ్యులు, అనువులు, సుదాసుడు, తృత్సువులు, ఆయువు, పురుకుత్సుడు మున్నగు యయాతి వంశీకులు మున్నగువారు పేర్కొన బడుటవల్ల నాభాగములన్నియు వారలతర్వాతకాలములో వ్రాయబడినవనుట స్పష్టము. అప్పటికే కొన్ని ఖగోళనక్షత్రములకు వారి పూర్వీకులపేరిట నామకరణము గావించియుండిరి. ఆకాలముననే ఆంగిరసులు, భృగు వంశీకులు, కణ్వులు మున్నగు ఋషిగణములు ప్రబలియుండెను. వైవసత్వమను కుమారుడగు యిక్ష్వాకు కాలములో వచ్చిన కృతయుగము క్రీ.పూ. 6651 సం॥ నాటిదని లోగడ యిచ్చిన సూర్యవంశ తరముల సంఖ్యనుబట్టియు, యుగకాలములనుబట్టియు స్పష్టమేగదా. ఆ యిక్ష్వాకు తర్వాతవారే పైన నుడివిన రాజులందరు నని తెలుసుకొనదగియున్నది. ఇక నిక్ష్వాకుకు పూర్వ ముండిన 6 గురు మనువులకాలము కలిపి యొక యుగము. అనగా 1200 సం॥లు (సావనరీత్యా) కన్న హెచ్చుగాదు. అందుచే మొదటిమనువగు స్వాయంభువు క్రీ. పూ. 7833 సం॥ క్రిందటివాడగుచున్నాడు. తక్కిన మనువుల కాలములనుగూడ మన మీ క్రిందిరీతిని రమారమిగా నిర్ణయింప వచ్చును.

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 స్వాయంభువమనువు | క్రీ.పూ. | 7833 | | 5 రైవతమనువు | క్రీ. పూ. | 7100 |
| 2 స్వారోచిష | ,, | ,, | 7600 | 6 చాక్షుషుడు | ,, | 6950 |
| 3 ఉత్తముడు | ,, | ,, | 7400 | 7 వైవస్వతుడు | ,, | 6750 |
| 4 తామసుడు | ,, | ,, | 7250 | 8 ఇక్ష్వాకు | ,, | 6651 |



ఇవి రమారమి అంకెలు. మనుస్మృతిప్రకారము వీరి కాలమానందు మానవుల జీవితము 400 సం॥లుగా లెక్కించి వేయబడినవి. ప్రతి మనువు నకు మధ్య పాలించిన రాజులు, వారి కుమారులు మొదలగువారి కాలములు గూడ నిందే చేరియున్నవి. మనకు కల్పాదిగా చెప్పబడెడి చైత్ర శు ౧ ఒక యుగాదిగా తలంపవచ్చును. ఇదియే స్వాయంభువునాటిదని భావింప వలసియున్నది. వేదములలో చెప్పబడిన యశ్వినీ విషువత్తుగూడ యీ మనువుల కాలములోనిదే యనవలెను. ఇప్పుడు మనము దేవమాన కలి యుగము వాడుకొనుచున్నాము గనుకను ఆప్రకారమే దేవమాన సం॥ లన్ని పురాణములందును చేర్చబడియున్నవి గనుకను వాని ప్రకారము మన మిప్పుడు చూచుకొనినచో దేవమాన కలియుగారంభమునుండి 4 సామాన్య యుగములు గడచి, 5 వది జరుగుచున్నట్లు కనబడును. మన పూర్వులు శ్రద్ధాళురును, జాగ్రత్త గలవారును అగుటవల్లనే రమారమి క్రీ.పూ. 7833 సం॥ర వరకు గల వృత్తాంతములన్నియు భద్రపరచి పురాణాదులలో అతి శయోక్తులతోనైనను పెంచి చెప్పినందులకు మనము గర్వింపదగినదే. ఒక్క అవెస్తా వాఙ్మయమునందు గాక .యింతటి ప్రాచీనవిషయము లేదేశము నను, యేభాషలోను కానరావు. పవిత్రగ్రంథమగు బైబిలులోగూడ కొందరు జనులు పూర్వము 700, 800 సం॥లు జీవించిరని వ్రాయబడినది. మను స్మృతి 400 సం॥లనియే చెప్పినది. యుగాలవిషయమై యెట్టి యద్భుత కల్పనలు జరిగినను వానిని మనమిపుడు నమ్మజాలము. మన పూర్వుల నెట్లు కొనియాడుకొన్నను వారి ప్రజ్ఞకు సంతసింపవలసినదేగాని సత్యాన్వే షణలో యసత్య మెచటనున్నను త్రోసివేయకతప్పదు. సూర్యసిద్ధాంతమున చెప్పబడిన 7200 సం॥ర కొకసారి వచ్చు అశ్వినీవిషువత్తునే ఋగ్వేదము నందు చెప్పబడినట్లు ధృవపడుచున్నది. ఇప్పుడు మనసిద్ధాంతమునందు పరీక్షిత్తు జననకాలము, భారతయుద్ధకాలము పురాణములందిచ్చిన కాలము నకే సరిపుచ్చియుంటిమి. భాగవతములో చెప్పబడిన కల్యారంభమునే అనుసరించితిమి. నేటి కలియుగసంఖ్యనుగూడ సరియైనదని కనుగొంటిమి. సూర్యసిద్ధాంతమునందలి కృతయుగాంతమను పదార్థమును గ్రహించితిమి. పురాణములలోని తరములసంఖ్యనుబట్టియు నేడు పంచాంగములలో కన్పడు

యుగసంఖ్యలనుబట్టియు జరిగిన యుగాలను కనుగొంటిమి. సూర్యసిద్ధాంతములో చెప్పబడినరీతిగా అశ్వినీవిషువత్తు పరిభ్రమణము క్రీ. పూ. సావన సం॥ల రీత్యా 7260 సం॥ల క్రిందట నున్నట్లును, అదియే ఋగ్వేదమున నొకచోట నుదాహరింపబడియుండుననియు గ్రహించితిమి. స్వాయంభువు అనగా మనదేశములో మొట్టమొదటి పురుషుడు. క్రీ. పూ. 7838 సం॥లవాడనియు, నాతని తర్వాతనే పైన నుడివిన ఋగ్వేదమం దుదాహరింపబడిన విషువత్తు వచ్చియున్నట్టును గ్రహించితిమి. యుగాద్యంతముల తిథులనుగూడ గమనించి యవి సావన సం॥లచే నిర్మింపబడిన 1200 సం॥ల పరిమాణయుగాలని గ్రహించితిమి. మృగశిరలో విషువత్తు ఉన్నట్లు గల ఋగ్వేదసూక్తులనుబట్టి ఆకాలము B.C. 4500 నాటిదని లోకమాన్య తిలకుగూడ వ్రాసియున్నాడు. తైత్తిరీయమున బృహస్పతి తిష్యానక్షత్ర సన్నిధి నున్నట్లు గలదానినిబట్టి యా కాలము B.C. 4650 ప్రాంతమగునని వి. బి. కేట్కారు పండితుడు నుడివెను. ఇవిగూడ మన నిర్ణయములకు విరుద్ధముగ లేవు.

నిజస్థితి యీవిధముగా ఋజువగుచుండగా మన గణితశాస్త్రజ్ఞులు కేవలము గ్రుడ్డిగా నొక్కొక్క శాస్త్రమునే ఆధారముగాగొని, విమర్శనాదృష్టితో యితర ప్రమాణగ్రంథములనుగాని, యితరదేశ శాస్త్రములనుగాని పరిశీలించి సత్యమును గ్రహింపక పూర్వపుపక్కీనే వేలకొలది సం॥లు పూర్వరాజులు జీవించిరిట్లు వ్రాయుచున్నారు. ఒకపంచాంగకర్త యీ క్రింది కాలములు తన పంచాంగమునందు వ్రాయుట యెంత అసంబద్ధమో చూడుడు.

ఈయన వ్రాసినప్రకారము

| | | | |
|---|---|---|---|
| బలిబంధనాబ్దములు | 1951889040 | సం॥లు | అయినట్లు |
| హరిశ్చంద్రమహారాజు | 28820182 | „ | „ |
| నలమహారాజు | 13623889 | „ | „ |
| కార్తవీర్యాబ్దములు | 12835040 | „ | „ |
| రావణాబ్దములు | 12569040 | „ | „ |
| శ్రీరామ రాజ్యాంతవత్సరము | 12558040 | „ | „ |
| భరతాబ్దములు | 5088 | „ | „ |
| పాండవాబ్దములు | 5040 | „ | „ |



ఇట్టివారికి పురాణములవంటి వ్రాతలుగూడ అక్కరలేదు. వారి కభిమాన గ్రంథమగు సూర్యసిద్ధాంతవ్రాతలో, మరేసిద్ధాంతపువ్రాతలోగాని యితర ప్రపంచవిజ్ఞాన మక్కరలేదు. ఇట్టి యజ్ఞానపూరిత గణితములను సాగనిచ్చినచో మన దేశమున వాస్తవిక జ్ఞానము వృద్ధియగుట కల్ల. అందువల్ల ప్రభుత్వమువారు గూడ జోక్యము కల్గించుకొని నిజమారసి, పంచాంగములందు వాస్తవికజ్ఞానము నభివృద్ధిపరచుటకై తోడ్పడునట్లు కట్టుబాట్లు చేయదగియున్నది. ఇక్ష్వాకు మొదలుకొని పాండవులకాలము వరకు 83 తరములే ఇక్ష్వాకువంశములో నుండెనని లోగడ తెలిపితిమిగదా! అవి గమనింపక కేవలము సృష్ట్యాది సం॥లు నిర్ణయించుటకై వారలపేరిట యేర్పరచబడిన కాలములన్నియు వారి జీవితకాలములుగా నమ్మి దేవమానములను మనుష్య జీవితమానములుగా దలంచి వేయు యీతప్పులెక్కలవల్ల దేశములో నజ్ఞానము నశింపదని వేరుగ చెప్పనక్కరలేదు.

## దేవమాన మెందుకు త్రోసివేయవలెను?

స్వాయంభువు మొదలు దేవతార్యులందరు మనదేశమునందే వసించిరిగాని ధ్రువమండలప్రాంతమున గాదని మున్ముందు వ్రాయు విషయముల వల్ల దెలియగలదు. ధ్రువమండలములో తమ పూర్వులు నివసించిన ట్లార్యులొక్కచోటమాత్రము ఋగ్వేదములో చెప్పియుండినను ఆ కాలపువారి పేర్లేమియు నుదహరింపలేదు. అచటినుండి క్రమముగా వచ్చినపిమ్మట నిరాను ప్రాంతములో చాలకాలముండిన పిమ్మటనే యీ భూమికి వచ్చిరి. ఆ కాలమెంత జరిగెనో యెచ్చటను చెప్పబడలేదు. మన దేశమునకు వచ్చిననాటి నుండి సూర్యోదయాస్తమయములు నిత్యము జరుగుచునేయుండెను గాని ధ్రువమండలపద్ధతి గాదు. అందుచే నీ దేశమునబుట్టి పెరిగి చనిపోయిన వారందరిని దేవమాన సం॥ల రీత్యా లెక్కలుకట్టి పురాణములలో వర్ణించుట కేవలము తప్పుగానున్నది. వాని ననుసరించియే పై లెక్కలు చూపబడినట్లు వేరుగ చెప్పనక్కరలేదు. మనుస్మృతి ప్రకారము జీవితము 400 సం॥లుగా చూచినప్పుడు దేవమానము కల్పితముగా ఋజువగుచున్నది. ఇచటనే పూర్వమునుండి యుండిరన్నను, దేవమానముతో పనిలేదు.

ఇక నీ విషయమును వదలి మన సిద్ధాంతప్రకారము భారత యుద్ధకాలమైన పిమ్మట పాలించిన రాజుల కాలవిషయము క్రీస్తుశకమువరకు తెలిపినయడల సంగతి చక్కగా బోధపడగలదు. క్రీస్తుపూర్వము 1957 లో భారతయుద్ధము జరిగెనని లోగడ చెప్పితిమి. మగధరాజ్యశాలనలో

| | |
|---|---|
| క్రీ౹పూ. చంద్రగుప్తుని పాలనారంభమునాటికి జరిగిన సంవత్సరాలు | 826 |
| మహాపద్మనవనందులు పాలించిన సంవత్సరాలు | 100 |
| తత్పూర్వము శిశునాగవంశమువారు పాలించినది | 360 |
| ,, ప్రద్యోతనవంశజులు 5 గురు | 150 |
| ,, భారత యుద్ధకాలము తర్వాత బృహద్రథవంశములో సోమాదినుండి రిపుంజయుని వరకు | 1020 |

దీనినే మరియొకవిధముగా జెప్పవచ్చును

| | | |
|---|---|---|
| పరీక్షిత్తు మొదలు మహాపద్మ వరకు | 1500 | B. C. 1956 |
| మహాపద్మాదినవనందులు కలిసి | 69 | |

ఈ సం॥రములకు యీ విధముగా లెక్క సరిపెట్టినచో భారత యుద్ధకాలమునుండి జరిగిన పాలన సంఖ్యలు సరిపోవచ్చును. ఈ కాలములన్నియు పురాణములలో గన్పడుచున్న హెచ్చుసంఖ్యల ననుసరించియు, లోగడ నుడివిన యుగారంభ కాలనిర్ణయమునుబట్టియు, ఆ యుగమునకు పూర్వము 87 సం॥లకు ముందు భారతయుద్ధమైనట్లు వ్రాసిన వ్యాసమహాని వ్రాతలనుబట్టియు నిర్ధారణ చేయబడినది. గనుక పైన నుడివిన యందరి నిర్ణయములకన్నను యివి దృష్టాంతపూర్వకమైనవిగా భావింపవలెను. గణిత శాస్త్రజ్ఞులా కాలపు పంచాంగములు గుణించి చూచి నా లెక్కలతో నాయా యుగములందలి గ్రహగతులను సరిజూచెదరుగాక! ఇంతవరకును ఒక్క ఇక్ష్వాకు వంశములోని తరముల సంఖ్యలను బట్టియే పూర్వయుగ విషయములను నిర్ణయించితిమి. పురాణములన్నింట గల యే యితరవంశముల యొక్క తరములును వీనికి మిక్కిలి తక్కువగానే యుండుటవల్ల నందు కొన్ని లోపించియుండినట్లు భావించవచ్చును. చంద్రవంశములోని వివిధ శాఖల యొక్కయు, ఇంద్రుల యొక్కయు, ప్రజాపతులను బ్రహ్మల

| | |
|---|---|
| తర్వాత చంద్రగుప్త మొదలు | 326 |
| యుధిష్టరుడు పాలించినది | 61 |
| | 195 |



యొక్కయు, మిథిల రాజులయొక్కయు వంశావళులు శోధించినను ఇట్లే యుండుటవల్ల వానిని హెచ్చుగా దర్శించుటలేదు.

పురాణములలోని యన్ని విషయములను సాంగోపాంగముగా నమ్ముచు, కొన్ని నమ్మక, కొన్ని నమ్ముచున్నామని యాక్షేపించువారి వాదముగూడ ఆలోచింపబడినది. మహాకవి కాళిదాసువంటివాడే దాని నొప్పుకొనెను. (1) ఇదిగాక సాధారణ ప్రకృతిసిద్ధాంతములకు విరోధముగాని ప్రతి విషయమును చారిత్రకదృష్టితో బరిశీలించియే నమ్మితిమనియు, దానికి విరుద్ధవిషయములో త్రోసివేసితిమనియు నిచట జెప్పవలసియున్నది. ఎవరేమి చెప్పినను విశ్వసించుట యెట్లు తప్పో, యెవరేమి వ్రాసినను విమర్శ లేకుండ నమ్ముట యట్టి తప్పే యగునని ప్రతి మానవునికి అంతరాత్మ బోధించును. అట్టి విమర్శ చేయజాలని బుద్ధి గలవారు అట్టి నిపుణుల మాటలను విశ్వసింపక తప్పదు. ఇక క్రీస్తుపూర్వము దాదాపు 7883 సం॥ల నుండి యున్న మన దేశపు వాస్తవిక విషయాలను పురాణాదులనుండి విమర్శచే తెలుసుకొందము.

---

# ద్వితీయ ప్రకరణము

## హిందూదేశము పేరెట్లువచ్చినది?

ఆదిలో హిందూదేశములోని మతమునే హిందూమతమని గూడ పిలచియున్నట్లు కనబడుచున్నది. ఈ హిందూమతములో ప్రధాన శాఖలు మొట్టమొదట ననగా క్రీస్తు పూర్వము 7800 సంవత్సర ప్రాంతములో శైవ, వైష్ణవ మతములై యుండెను. విష్ణువునే మొదట హిందువని హిందూమూర్తి యని పిలిచెడివారనియు, నాతని మతమును, దేశమును హిందూనామములు ధరించినట్లును విష్ణుమాయోత్తర ఖండములో వ్రాయబడినది. కాని యిది విష్ణుభక్తులలో నెవరిచేతనో గల్పింపబడినట్లు కనబడుచున్నది. ప్రజాపతులు కొందరును, స్వాయంభువ మనువును మొదట మనదేశమునకు వచ్చినపుడు, వారిలో నొకశాఖ వారిని ఇంద్రుడను నతడు పాలించునట్లేర్పాటు చేసుకొనిరి. ఇంద్రుడనగా శ్రేష్టుడని యర్థము. ఈ యింద్రుడు అమరావతిలో తన స్థానమునుంచి పాలించెను. ఇది మొదట త్రివిష్టపమున (తిబెట్టు) నుండి క్రమముగా నచటికి మారెను.

అప్పటినుంచి యీ ప్రదేశము ఇంద్రుని రాజ్యమయ్యెను. ఈ యింద్రపదమే పామరులనోటను హిందూరాజ్యమయ్యెనని తలంచుట కవకాశమున్నది. అచట ప్రవహించుచుండిన యొక నదినిగూడ యీ పేరిటనే ఇంద్రనదియని మొదట బిలుచుచు ఇంద్రునితో లేక ఇంద్రరాజ్యముతోగూడి స+ఇంద్ర=సింద్రనదియై క్రమముగా సింధునది యయ్యెనని గ్రహించుట యుక్తము. వరుణ,బ్రహ్మపుత్రనదులుగూడ యిట్లేర్పడిన నామములే. పాశ్చాత్యుల నోటబడి సింధుయే హిందుయయ్యెనని కొన్ని పూర్వవ్రాతలు కలవు గాని వానికి విరుద్ధముగ అర్థమేదియైనను మొదటిపదమే "హిందు" అని పైనుడివిన విష్ణుమాయోత్తరఖండము నుడువుచున్నదిగదా! అందుచే వాని

(1) 'పురాణ మితి ఏవ నసాధు సర్వమ్
నచ అపిసర్వమ్ నవమితి అవద్యమ్'



యర్థము తర్వాత కల్పింపబడినట్లు మనము గ్రహింపగలము. ఇంద్రుడు గూడ విష్ణువునకు లోబడిన వాడగుటవల్ల నాతని యంశము గల యింద్రునకుగూడ (నృపాలురందరట్టి యంశము కలవారేయను ప్రమాణమును బట్టి) యీవిధముననే యీపేరు తర్వాత వచ్చియుండెనేమో! విష్ణునిభార్య శ్రీదేవిని ఇందిరయని పిలుచుటగూడ నుండెను. హిందూశబ్దము మొదట ఎటు పుట్టినను విష్ణునామమునగా నేర్పడిన నాటినుండి, యాతని భార్యకు ఇందిరయను నామము వచ్చినట్లు కనబడుచున్నది. ఇంద్రపదము మనదేశమున కార్యులు రాకపూర్వమే ఇండోయైరేయనుల కాలములోననగా ఇరానులోను,ఇండియాలోను ఏకజాతివారు నివసించు కాలముననే వచ్చియుండును-దానినిబట్టియే మనదేశ నామమేర్పడెననియు, నట్లేమతమునకు వచ్చెననియు గ్రహించుట యుక్తము. ఇండోయైరేయనుల కాలము క్రీ: పూ. 7800 సం॥ల నుండి యున్నట్లు మన లెక్కలవల్ల తేలుచున్నది.

## స్వర్గ, మర్త్య, పాతాళములు

ఈ హిందూదేశములోని హిమాలయ ప్రాంతము మొదలు అమరావతి ప్రాంతము వరకు స్వర్గ లోకము లేక రాజ్యమనియు బ్రహ్మావర్తమనియు దర్వాత పేర్వడెను. దానికి దక్షిణరాజ్యము మర్త్యలోకమనియు లేక మనుసంతతి మానవ రాజ్యమనియు బ్రఖ్యాతి గాంచెను. దానికి దక్షిణముగా దండకారణ్యము దాటినపిమ్మట గల ప్రదేశము పాతాళలోకము లేక రాజ్యమనియు పేరొందెను. ఈ మూడింటినే విభజించి పదునాలుగు లోకములుగా గూడ జెప్పియుండిరి. ఉపనిషత్తులలో గొన్నిటియందు అంతరిక్ష, వాయు, భూలోకములని మూడుగా విభజింపబడినవి. గాని భూలోక విభజనము లేదు. మూడవరాజ్యభాగ మగుటవల్లనే అందలివారికిని స్వర్గమునకు త్రిదశులనియు, త్రిదివమనియు వరుసగా పేర్లు వచ్చెను. బ్రహ్మావర్తము దేవత లేర్పరచినదనియు, నందు కురుక్షేత్ర, మత్స్య, కన్యాకుబ్జ, మధురాది దేశము లున్నట్లును, దీనికి తూర్పుగా వింధ్య హిమాచలముల మధ్య సరస్వతీ ప్రయాగ నదులవద్ద మధ్యదేశమున్నట్లును దీనికి తూర్పు పూర్వ పశ్చిమసముద్రముల మధ్యప్రదేశమార్యావర్తమనియు మనుస్మృతిలో గలదు.

## బ్రహ్మలెవరు? వారికాలములు

ఇంతవరకు మన పూర్వులు కాలమును లెక్కించుటకై యుగాలు, కల్పాలు, వగైరాలు యేర్పరచి యవి పూర్వరాజన్యాది ప్రముఖుల పేర్లను మనకు తెలిపినట్లు లోగడ గ్రహించితిమి. అట్లే బ్రహ్మలవిషయములో గూడ నైయుండెను. మొట్టమొదట మన దేశమునకు వచ్చినవారినే బ్రహ్మలనియు, ప్రజాపతులనియు మన పురాణములందు వర్ణించిరి. వీరినుండియే దేవతలు, రాక్షసులు, మానవులు మున్నగుజాతులు క్రమముగా నేర్పడి నట్లిందుగలదు. క్రీస్తుపూర్వము రమారమి 7888 సం॥ల క్రిందట కొందరు బ్రహ్మలనబడువారును, వారి పెద్దయగు స్వాయంభువమనువును మన హిందూదేశమునకు వచ్చి నివసించినట్లు కనబడుచున్నది. వీరి జాతి, మత వర్గీయులు కొందఱు ఇరానుదేశములోగూడ నున్నట్లు అచటి యవెస్తా గ్రంథములను బట్టి తెలియుచున్నది. రుచిప్రజాపతి, కర్దమప్రజాపతి, మరీచి ప్రజాపతి మున్నగువారే మనదేశమున గాలిడినవారు. మొదటిబ్రహ్మకు 10 మంది బ్రహ్మలు కలిగినట్లును, వారే దక్షుడు, నారదుడు, పులహుడు, భృగువు, క్రతువు, అంగీరసుడు, వశిష్ఠుడు, మరీచి, అత్రి, ధర్ముడు, కర్దముడను వారలనియు గలదు. ఆ బ్రహ్మకు జనించిన యాణియను సరస్వతిని వయసు వచ్చిన పిమ్మట వాటడే చేపట్టెనట. దాని కాతని కుమార్లాక్షేపించినను చెల్లిపోయెనట. ఈ ప్రజాపతు లను బ్రహ్మలందరును స్వంత సోదరీమణులను, పినతండ్రి పెదతండ్రి కుమార్తెలను తరచుగా మొదట వివాహమాడుచుండిరి గాని కుమార్తెలను చేపట్టలేదు. ఇందలి భృగువుకుమార్లు ధాత, విధాత యనువారు. వీరు క్రమముగా బ్రహ్మలైరి. ఈభృగువునకు శ్రీదేవి యను కొమరిత గూడ యుండెను. ఈమె విష్ణుభార్య యయ్యెను. ధాత మున్నగువారు ఆనాటి ప్రజలకు సాముద్రిక, జ్యోతిషములు చెప్పుచుండిరి. అందువల్లనే ధాత వ్రాలు తప్పదను వాక్యోక్తి ప్రబలెను. భృగుమహర్షి తండ్రి వరుణుడనియు, తల్లి చర్షిణియను నామె యనియు భాగవతమున నున్నది. వరుణుడు గూడ బ్రహ్మలలోనివాడే. ధాతకు సాయమ, దర్శ, ప్రాతరాఖ్య, పూర్ణిమాఖ్యులను సుతులుండిరి. ఈప్రజాపతులనబడు బ్రహ్మలపేరిటనే మనవారు సృష్టికి కారణభూతుడగు బ్రహ్మసృష్టి నిర్ణయమును ఊహించి పురాణములందు క్రతపరచిరి. విధాతకు అగ్ని పురీష్యాదులనువారు జనించిరి.



ఈ యగ్ని యింద్రసామంతుడయ్యెను. వీరందరును మొదట వారిలో వారికి జనించిన కన్యలను పెక్కండ్రను వివాహమాడి, వారి వంశములను మిక్కిలివృద్ధిజేసిరి. తర్వాతవచ్చిన బ్రహ్మ లనేకులీరీతిగనే ప్రజలనుసృజించిరి. క్రమముగా వీరల ఆడ మగపిల్లల సంతతియే మన హిందూదేశవాసులందరు నని మన పూర్వగ్రంథములు కంఠోక్తిగ నుడువుచున్నవి. తత్పూర్వీకులగు దేశవాసులు వీరలచే క్రమముగా వశింపచేయబడిరి. అంతేగాని బ్రహ్మలన వేరేలోకమున నెచటనో నివసించి వారీ ప్రపంచసృష్టి జేయుచున్నా రన గూడదు. అట్టివ్రాత లెందున్నను ప్రమాణములుగా గన్పడవు. జగత్తున కంతటి కాధారభూతమగు జగదీశ్వర నిర్మాణారంభమునుగూర్చి నిజముగా నేరికిని సంపూర్ణముగ దెలియదు. అట్టి యీశ్వరున కీ బ్రహ్మలను, విష్ణువులను, శివులను ముడిపెట్టి వారికి మహత్తులను గల్పించి పురాణములందు వర్ణింపబడినను, నిజము చెప్పక తప్పలేదు. ఒకానొక బ్రహ్మకుమారుడగు స్వాయంభువు తన సోదరియైన శతరూపను చేపట్టెను. వీరే మనకు తెలిసిన మనదేశపు ఆదిదంపతులు. వీరికి 2 కుమార్లును, 3 కుమార్తెలును కల్గిరి. ఈ కుమార్తెలు ఆకూతి, ప్రసూతి, దేవహూతి యనువారు వరుసగా రుచిప్రజాపతి, దక్షప్రజాపతి, కర్దమప్రజాపతు లనువారిని చేపట్టిరి. మరీచికి కశ్యపప్రజాపతి జనించెను. కర్దమప్రజాపతి కుమార్తె కళ యను నామె మరీచికి భార్యగానుండెను. ఈమెవల్లనే కశ్యపబ్రహ్మ కల్గెను. ఇతడు దితి, అదితి యను యిర్వురకన్యలను మొదట చేబట్టెను, వారివలన సమస్త దేవతలు, రాక్షసులు క్రమముగా ఉత్పత్తియైనట్లు చెప్పబడినది. దక్ష ప్రజాపతికి జనించిన యనేక కన్యలనుగూడ యీయన చేబట్టి చాల సంతానము గనెను. ఈ రీతిగా బ్రహ్మలందరును మనదేశమున మొదట ప్రజావృద్ధి గావించుకొనుచు వారిదేశమునకు బ్రహ్మవర్తమని పేరుపెట్టుకొని దానిని మనువు పాలనలో నుంచిరి. ఈ బ్రహ్మలు క్రమముగా కొందరు దేవతలను కల్పించుకొని పూజించుచుండిరి. వారి కప్పుడు ప్రకృతిలో నుపకారము గావించుచువచ్చిన మహత్తరవస్తుజాలములన్నియు దేవతలుగానే భావించిరి.

ఇంద్రుడు, సూర్యుడు, చంద్రుడు, వరుణు లేక వర్షదేవత, ఉషఃకాలము, సాయంకాలములందలి యాకాసము, వాయువు, అగ్ని, జలము మున్నగునవన్నియు వారు దేవతలుగా దలచి, వారి పేరట తమ పిల్లలపేర్లు గూడ బెట్టుకొనుచుండిరి. ఈ దేవతలపై క్రమముగా వారపుడు మాటలాడు

చున్న భాషలో వారు గీతములను వర్ణించుచుండిరి. ఇట్టివానిలోనిదే సూర్య దేవతాపరమగు గాయత్రీమంత్రము. ఈ గీతములతో వారు ఆ దేవతలకు ప్రార్థనలు సల్పుచుండిరి. అగ్నిని సృజించి దానిని స్తోత్రముచేయుచు, దక్కిన దేవతలను కొన్నింటిని ప్రత్యక్షముగను, దక్కిన వగ్నిరూపకముగను ప్రార్థించుచుండిరి, అట్టి ప్రార్థనలు క్రమముగా కట్టుదిట్టములైన మంత్ర తంత్రములతో పూజాపురస్కారములతోను వృద్ధిజెందెను. తామనుభవించు సర్వవస్తువులు ఆ దేవతలకుగూడ నిచ్చు నేర్పాటయ్యెను. దేవతలతోపాటు వారి బంధుమిత్రాదులకు తామనుభవించు వస్తువులు పంచిపెట్టుపద్ధతి యేర్పడెను. ఇట్టి క్రతువులు తగిన మంత్రములతో నిర్దిష్టముగ జేయించుపని ప్రతిబ్రహ్మకును విధికృత్యమయ్యెను. తక్కినవారు అనగా వారిలో నట్టిపని చేయనివారు సాధారణముగా కృషి మున్నగు కార్యములు చేయజొచ్చిరి. క్రమముగా నీ బ్రహ్మలందరికిని సవ్యముగా నేర్పుటకును, వారి పనులు చూచుటకు ఒక గురుస్థాన మావశ్యకమయ్యెను. అదియే ప్రధాన బ్రహ్మ స్థానము. ఈ బ్రహ్మపదవికి పైన నుడివినవారిలో సమర్థుని యెన్నుకొనుచుండిరి. ఆ కాలపు జనులలో నెవరి కెట్టిసహాయము కావలసినను మంత్ర తంత్ర క్రతుకార్యాదు లన్నింటను ఒక బ్రహ్మ యోగి పనులు నిర్వర్తించుచుండెను. అవసరమైనపుడు మూలబ్రహ్మ ప్రత్యక్షమగుచు కోరినవరముల నిచ్చుచుండెను. ఆ వరములు మన పురాణములలో గన్నడు నతిశయోక్తులు గాకపోయినను, అవసరసహాయములని నమ్మదగియున్నది. ఈ సంప్రదాయ ప్రకారమే నా బ్రహ్మల సంతతి యంతయును బ్రాహ్మణులనియు, యజ్ఞాదులలో మంత్రతంత్రాదులు నెరవేర్చు ముఖ్యుని బ్రహ్మయనియు నప్పటివారు పిలుచుచుండిరి. ఈ యాచారమే యజ్ఞాదులం దిప్పటికిని వచ్చుచున్నది.

అప్పుడు చేయుచుండిన యజ్ఞయాగములలో 33 గురు దేవతల నాహ్వానము చేయుచుండిరి. అందు 23 దేవతలు సూర్య, చంద్ర, పంచ భూతాది గణములవారు, 11 దేవత లానాటి దేవతానాయకులే. వీరు ప్రత్యక్షముగనే హవిస్సులను సోమమును గైకొనుచుండిరి. ఈ వివరములు ముందుపుటలో జెప్పబడును. ఈ యజ్ఞ యాగాదులలో గోవులు, అశ్వములు, ధనములు మొదలగు సంపద లిమ్మనియే వారిని ప్రార్థించుచుండిరి. గాని యావాటివారు మోక్షముకొరకై ప్రార్థించలేదు. మోక్షము లేక అమృతమను పదములు తర్వాత క్రమముగా నేర్పడెను, ఉపనిషత్తుల



కాలమున కమృతత్వవిషయ మమలునకు వచ్చినది. ఋగ్వేదమున పెక్కుచోట్ల త్రిరేకాదశ దేవతాః యని చెప్పబడెను.

ఇట్టి బ్రహ్మలలోనివారే బృహస్పతి, శుక్రుడు, త్వష్ట, విశ్వకర్మ, మయబ్రహ్మ మున్నగువారు. వీరిలో శుక్రుడు కవీశ్వరుడు. విశ్వకర్మ శిల్పాదులు, గృహనిర్మాణములలో నతికెక్కెను. విశ్వకర్మకుమార్తె బర్హిష్మతిని స్వాయంభువమనువు కుమారుడగు ప్రియవ్రతుడు వివాహమాడెను. మూల బ్రహ్మస్థానము హిమాలయము నుండి బ్రహ్మకపాలమునకు మారెను. పిమ్మట గయాప్రయాగ పుష్కరాదిస్థానములందు గూడ బ్రహ్మక్షేత్రము లభివృద్ధిజెందెను. ఇపుడచట వసించు గయాళీవంశపుదే దైయుండురు. ఈ బ్రహ్మస్థానమును గౌరవించుటకై మనపూర్వులు నక్షత్రములలో నొకదానికి బ్రహ్మయని పేరిడిరి. ఇట్లే తక్కినవారికిని పేర్లుంచబడియెను. అందరికన్న పెద్దయగు బ్రహ్మ యున్నపుడు ఆయనకు హెచ్చు గౌరవముండెను. శివుడుగూడ అట్టిపెద్దకు నమస్కృతు లాచరించుచున్నట్లు దక్షయజ్ఞ ధ్వంస కథవల్ల దెలియుచున్నది. ఇంద్రుడే బ్రహ్మండమున కంతటికి, సూర్యాది గ్రహములకు కారణభూతుడని కొన్ని ఋగ్వేదరుక్కులలో నున్నది.

## ఇంద్రరాజ్యము-స్వర్గము

దేవతలు మొదట హిమగిరియందలి త్రివిష్టపమున, ననగా నేటి టిబెట్టు ప్రాంతమున నివసించిరని చెప్పితిమి. స్వర్గ మెచటనో యుండి యందలి యధిపతియగు యింద్రుడు చచ్చినవారికి స్వర్గాదిభోగము లిచ్చునను కథ కొన్ని పురాణములందు తర్వాత కల్పింపబడి వ్రాయబడినటు కన్పడును. ఇందలి వాస్తవ మారయుదము. స్వర్గరాజ్యము బ్రహ్మవర్తములోనిదే. దీని రాజధాని క్రమముగా అమరావతియైనది. అమరులు అనగా దేవతలు వసించుటచే నమరావతియయ్యె. దీనికి దాపుననే అమృతసరమున్నది. ఇవి నేటి పంజాబుదేశములో నున్నవి. (*) ఈ చుట్టుప్రక్కల నున్న రాజ్య

(*) మనుస్మృతి 2 వ అధ్యాయమున మత్స్య, పాంచాల, మధుర, కన్యాకుబ్జ దేశము లనబడు పంజాబు శూరసేనదేశములు పూర్వము బ్రహ్మర్షి దేశములేక బ్రహ్మవర్తములోనివనిపిలువబడుచున్నట్లుగలదు. సరస్వతి, దృషద్వతీనదుల మధ్యభాగమును, వింధ్య హిమాచలములమధ్య పూర్వ పశ్చిమసముద్రముల మధ్యనున్న దేశ మార్యావర్తమనియునున్నది.

మంతయు పూర్వము యింద్రుడను హోదాలో పెక్కండ్రు రాజ్యమేలినట్లు పురాణములందున్నది. ఇంద్రు డావాటి రాజులలో నొకడనుటకు ఋగ్వేద, అథర్వణవేదములందును, శతపథ బ్రాహ్మణమందును ప్రమాణములివి :

1. శ్రు॥ శతమశ్మన్మయీనాం పురామింద్రో వ్యాస్యత్ । దివోదాసాయదాశుషే॥
(ఋగ్వేద తృతీయాష్టక షష్టాధ్యాయం 3,6,20 అండ్ 22)

టీ॥. రాళ్ళతో గట్టబడిన నూరు నగరములను దివోదాసుడను యజ్ఞము చేయించినవానికి ఇంద్రు డిచ్చెను.

2. శ్రు॥ అథయది రాజన్యోయజతే ఇంద్రవాజం । జయేంద్రాయవాచం వదతేంద్రవాచం । వదతేంద్రవాజం । జాయతో తిక్షత్రగ్ం హీంద్రః । క్షత్రగ్ం రాజన్యః ॥
శతపథబ్రాహ్మణం - కాం. 5 - అ. 2 - బ్రా. 2

3. శ్రు॥ త్వమిన్ద్రాధిరాజః శ్రవస్యుస్త్వంభూ రభిభూతి ర్జనానామ్ త్వందేవీర్విశ ఇమా వి రాజయుష్మత్ క్షత్రమజరం తే అస్తు ॥
(అథర్వణవేదము కాం. 6 98-5-2 సంపు 2-201 పుట)

ఇట్టి ప్రమాణము లనేకము ముందు పుటలలో నున్నవి.

పై 2, 3 శ్రుతులలో యింద్రుడు రాజనుటకు ప్రయోగములు కలవు. కొండలను చెక్కించి సమస్థలముగా నీ యింద్రుడు నివాసము లేర్పరచెను. ఇంతేగాక మొదటి స్వాయంభువమనువు కాలములో అయన కుమార్తె యాకూతికి జనించిన యజ్ఞుడు లేక సుయజ్ఞుడనువాడు యింద్రపదవిలో నుండి యీ దేవరాజ్యమును పాలించెను. ఆ కాలపు టాచారము ప్రకార మితడు తన సోదరియగు దక్షిణను పెండ్లాడెను. రెండవమనువగు స్వారోచిషునికాలములో రోచనుడనువాడు యింద్రుడయ్యెను. ఇతడు మొదటి యింద్రునికి జనించిన 12 గురు కుమారులలో నొకడు. మూడవ మనువగు ఉత్తముని కాలమునందు సత్యజిత్తను నతడు యింద్రుడయ్యెను. అట్లే తామసుని కాలమున త్రిశిఖుడనువాడును, రైవతుని కాలములో శుభ్రుడను వాడును, చాక్షుషమన్వంతరమున మంత్రద్యుమ్నుడనువాడును, యింద్రులుగానుండి పరిపాలించిరి. వైవస్వతమనువు వచ్చుసరికి పురందరుడు అను యింద్రుడు పాలించెను. ఈ విషయములు మహాభాగవతమున గలవు. ఈ

(*) ఊర్జస్వియను ఇంద్రుడు చివరపాలించినట్లు హరివంశమున గలదు.



రీతిగా ఉత్తరహిందూస్తానమును సర్వ సౌఖ్యములతో అనుభవించు యీ రాజ్యమును స్వర్గరాజ్యమనిరి. స్వరాజ్యమగుటచేతనే దాని నట్లు పిలిచిరి. దేవతలును వారి దాయాదులగు రాక్షసులును మొదటి మనువు కాలమునందే వేరుపడిరి. రాక్షసులలో జలంధరుడు జలంధరపట్టణమును, త్రిపురాసురులు త్రిపురములనే పట్టణములను నిర్మించుకొని పాలించుచువచ్చిరి. హిరణ్యకశ్యపుడు, బలిచక్రవర్తి, బాణుడు మున్నగువారందరును వారి భాగధేయములను పాలించుచుండిరి. గాని వీరందరును యింద్రరాజ్యముతో విహితులుగా నుండక అప్పుడప్పుడు వారి రాజ్యమునుగూడ నాక్రమింపజొచ్చిరి. బలిచక్రవర్తి, బాణుడు మున్నగువారి వంశీకులు భారతయుద్ధకాలమునందేగాక 11, 12 శతాబ్దములవరకు నుండి సామంతులుగా చిత్తూరుజిల్లా ప్రాంతమును పాలించుచుండిన నిదర్శనములు శాసనములందు దొరకుచున్నవి. వామనుడు బలిచక్రవర్తిని పాతాళమున కణగద్రొక్కెనని వ్రాసిన పురాణవ్రాతలనుబట్టి యాతని వంశీకులను యింద్రరాజ్యము దాటించి సరిహద్దు (అయోధ్య) రాజ్యమునుగూడ దాటించి, దక్షిణదేశమునకు పారద్రోలినట్లు గ్రహింపవచ్చును. అందువల్లనే తద్వంశీకులచట స్థావరము లేర్పరచుకొన గల్గిరి. ఇంద్రపదవి ఖాళీయైనపుడు వారి కత్యంత స్నేహితులును, సరిహద్దురాజులునగు సూర్యచంద్ర రాజులలో నర్హులగువారి కా పదవి లభించుచుండెను. నహుషుడు. రజి, ఆతనిపుత్రులు. వీరు చంద్ర వంశీకులైనను కొంత కాలము ఇంద్రరాజ్యమును పాలించిరి. ఈ యింద్రరాజ్యము భారత యుద్ధకాలమువరకు నుండెను. శ్రీకృష్ణు డింద్రపట్టణమునకు వెళ్ళివచ్చెను. అర్జునుడుగూడ వెళ్ళి యింద్రునిచే సత్కారము లందెను. కృష్ణమూర్తి, యమ, వరుణాది పట్టణములకుగూడ వెళ్ళియుండెను. ఈ అష్టదిక్పాలుర పట్టణములన్నియు నాకాశమందెచ్చటనో లేవు. ఈ యింద్రరాజ్యమునకు చుట్టును సరిహద్దులలో నచ్చటచ్చట నీ దిక్పాలుర పట్టణము లుండెను. రాక్షసాది యన్యప్రభువుల యాక్రమణ సాగకుండగా, వీరు సరిహద్దులను రక్షించుచుండిరి. ఈ సరిహద్దులలో నున్న రాజ్యమే స్వర్గమని క్రమముగా

ఏర్పడెను. దేవతా రాక్షస యుద్ధములందు సహాయముజేసిన రాజులను స్వర్గమునకు తీసుకొనిపోయి గౌరవించుచుండిరి. అట్టి గౌరవములలో రంభా సంభోగ మొకటి. స్వర్గరాజ్యమున ననేక సుందరవనిత లుండిరి, వారిలో చాలమంది బానిసలుగను, దాస, దాసీజనములుగను నృత్త గీత వాద్య కుశలురై యింద్రుని సభయందుండువారుగ నుండిరి. అట్టివారిలో కోరిన వారిని యింద్రుడు వారి స్నేహితులగు రాజులకు నిచ్చువాడు. సూర్య చంద్ర రాజులు అగ్ని హోత్రాది కైంకర్యములు తమ దేవతలపేర్లను క్రతువు'లను పేరిట చేయుచువచ్చినప్పుడే యింద్రరాజ్యములోని పెద్దలందరిని ముఖ్యముగా బ్రహ్మలను, దేవతలను, యింద్రాది దిక్పాలురను ఆహ్వానించి హవ్యమును (నేతితోగూడిన మృష్టాన్నము) యిచ్చి గౌరవించి యందు పాల్గొననిచ్చి నందులకు ప్రతిఫలముగా నట్టి రాజులకు రంభాది సుందరకన్యలను ప్రసాదించుచు వచ్చిరి. చచ్చినవారికిగూడ నిత్తురను కథ తర్వాత కల్పితమయ్యెను. అవి యింద్రాదుల పేరిట నక్షత్రములు వెలసినవిమ్మట కట్టుకథ నిర్మాణ మయ్యెను. తనను ఆహ్వానించకుండా చేయు నట్టిక్రతువులనుయీఇంద్రుడు మున్నగువారు భంగపరచుటకై ప్రయత్నించుచుండిరి. ఇంద్రుని రాజ్యము క్రమముగా పామరులనోటబడి హిందూరాజ్యమయ్యెను.

## హిందూరాజ్యము

సింధునది ప్రాంతమున నివసించువారు హిందువు లనబడిరని యొక వాద మున్నదిగాని హిందువులతోగూడిన యీనది సింధు (స + ఇంద్రనది =సింద్రనది లేక సింధునది) యయ్యెనని గ్రహించుట యుక్తమనియు మొట్టమొదట ఇందునదితోగూడి అది సింధునదిగా మారియుండునని లోగడ తెలిపితిమి. ఆ కాలపు ప్రజలకు ప్రజావృద్ధి లేక ప్రజాసృష్టి యొక పవిత్రమైన ముఖ్యకార్యముగా నుండెను. అందుచేతనే ప్రభువులగువారికి వారి దేశపు సుందరవయస్కుల నిచ్చి యింద్రాదులు సృష్టికి తోడ్పడుచుండిరి. రాక్షసులకు, దేవతలకు వైరములు వృద్ధిజెందినకొలదిని యీ యింద్రరాజ్యమునకు ప్రత్యేక రక్షకుడు (Protector) కావలసివచ్చెను. అప్పటికే దేవతలలో ననేక భాగస్థు లేర్పడినట్లు కన్పడును. గరుడ, గంధర్వ, యక్ష,



కిన్నర, కింపురుష, నాగ, నభశ్చర, సిద్ధ, సాధ్య, విద్యాధర, అప్సరసాదులు దేవతలలోనుండి యుద్భవిల్లి యనేక పట్టణములు నిర్మించుకొనిరి. వీరందరిని అవసరమైనపుడెల్లను రక్షించుటకై ప్రత్యేకస్థానము అవశ్యకమయ్యెను. దీనికొరకే దేవతలందరును కలిసి తమ యందరి శ్రేయస్సు కొరకు విష్ణు వొకనిని యేర్పరచుకొనిరి.

ఈ యింద్రాదులు నాటి ప్రజలే యనుట కనేక దృష్టాంతములున్నను కొన్ని మాత్రమే పైన వ్రాసితిమి. ఋగ్వేదమునందింకను కొన్ని గుర్తులు కలవు. సరమ యను కుక్క (సురేంద్రదూతి) యొకటి దేవతుని పణులు అపహరించిన గోవులను మరలించి తీసుకొనివెళ్ళుటలో సంవాదము సల్పుచున్నట్లొక ఋక్కు తెలుపుచున్నది. (౧౦-౧౦౮) ఇంద్రుని భార్య యొకతె యొక వానరమును గురించి కోపించి తనభర్తతో నా విషయమై వాదించుచున్న యొక ఋక్కుగూడ గలదు. (౧౦-౮౬) ఇంద్రావరుణుల సంవాద మొకటి వారి పరస్పర యౌన్నత్య విషయమై స్పర్థించుచున్నట్లు గానుపించెడి దొక ఋక్కుగూడ యున్నది. (౪-౪౨) యాజ్ఞిక క్రియల భారము వరుణాగ్నులలో నెవరు వహింపవలెనను విషయమునకు సంబంధించిన యొక ఋక్కు కనబడుచున్నది. దీనిప్రకార మగ్నియను యింద్ర సామంతుడు దనకు శ్రమకరమైన యీపనిని స్వీకరించుట కంగీకరించినట్లు సూచన గలదు. ఇట్లు వీరందరా నాటి ప్రజలపై యధికారములు వహించిన నాయకులని స్పష్టముగా దెలియుచున్నది. ఇంద్రుడు రాక్షసులలోని వలాసురుడు, శుష్ణుడు, శంబరుడు, అశ్వధుడు, కరంజుడు, పర్ణయుడు, వంగృదుడు, పిప్రుడు, కృష్ణుడు, రౌహిణుడు, కుయువుడు, పణులు మొదలగువారిని సంహరించినట్లనేక ఋక్కులలో గలదు.

(ఋ 1-10-53, 15-101-2, మరియు 103-2 చూడుము.)

ఇంకను బలాసురుడు గోవులను హరించినపుడు వానిని విడిపించి తెచ్చెను. అంహోయను రాక్షసుని పదమణంచెను. యుద్ధములందు యింద్ర సహాయము బొందిన యీ క్రిందిరాజులు పెక్కుండ్రు గన్పడుచున్నారు. నర్యుడు, తుర్వశుడు, యదువు, తుర్వీతుడు, పురుకుత్సుడు, సుదాసుడు, ఋజాశ్వుడు, కుత్సుడు, అతిథిగ్వుడు, ఆయువు. ఇందలి చివరి ముగ్గురును సుశ్రవసునకు లోబడచేసెను. ఈ యింద్రుడు శంబరునితో బోరాడినపు

డాతనియొక్క 99 పురములను నాశన మొనర్చెను. ఋజాశ్వుడను రాజుతో గలిసి కృష్ణుడను రాక్షసుని జంపెను. ఈయన స్వర్గరాజ్యముగుండా 7 నదులు భూమికి ప్రవహించి సముద్రమునకు పోవుచుండినట్లు గలదు. ఇనుముతో చేయబడిన కవచము లీతడు యుద్ధములందు ధరించుచుండెను. (ఋ 1-12-72-8, 1-10-56-8)

పై కార్యములన్నియు నొక్క యింద్రుడే చేసెననజాలము గాని ఏయే యింద్రుడే యే కార్యము లొనర్చెనో విడిగా తెలియగల సాధనము లేకున్నను, ఆనాటిస్వర్గరాజ్య రాజులుగానుండి వారొనర్చిన కార్యములే పైన వివరింపబడినవి. వృషాగిరి పుత్రులగు అంబరీష, సహదేవ, భయమాన, సురాధ లను రాజులు యింద్రుని సహాయము బొంది యాతనిని స్తోత్రము జేసి నట్లు ఒక ఋక్కు గలదు. చివరకు బెజవాడవద్దగల నొక పర్వతమునకు ఇంద్రకీల పర్వతమనిగూడ నీ యింద్రులవల్లనే పేరువచ్చినట్లు చెప్పవచ్చును. పురోవాసుడను యింద్రుడొక కాలమున నున్నట్లు ఆతనిని నూరుగోవుల నిమ్మని ప్రార్థించుచున్న యొక ఋక్కుగూడ ఋగ్వేదమున నున్నది. (ఋ 8-70-1)

ఇంద్రుడు ఆర్యవర్ణుల నుద్ధరించువాడనియు, ననేకదస్యులను సంహరించుచుండెననియు, దస్యులు, అవ్రతులు, అక్రతులు నల్లనివర్ణము గలవారనియు, వారి ననేకులను సంహరించుటేగాక, గుహలలో కొందరిని బెట్టెననియు ననేక ఋగ్వేదఋక్కులు తెలుపుచున్నవి. (ఋ 2-12-41-30-8, 8-34-9, 10-22-8, 4-28-4) ఈ యింద్రులలో మిగతవారిని గురించి మున్ముందు చెప్పబడును.

## విష్ణువులు

దేవరాక్షసజాతులవారు చీలిపోయిన పిమ్మట దేవతలు తమ రాజ్యమంతటను దిరిగి తమ్ము సంరక్షించుటకై యొక విష్ణువు నేర్పాటు చేసికొన్నట్లు లోగడ తెలిపితిమి. ఈ విష్ణ్వాశ్రమము బదరీనారాయణమున నుండెను. ఈ విష్ణువు దేశరక్షణ బాధ్యత గల్గియుండుటేగాక నాటి దేవతలకు మతప్రవక్తగాగూడ నుండెను. ఈ విష్ణుపదవిలో నరనారాయణు లను



ఋషులు గూడ కొంతకాల ముండిరి. విష్ణువులలో కొంతకాలమునకు వైకుంఠుడనువాడు వచ్చెను. ఈయన వికుంఠయను నామె కుమారుడు. ఈతడు తన పేరిట వైకుంఠమను ఆశ్రమమును గట్టించి తన మతాశ్రమము నచటికి మార్చినట్లు కనబడుచున్నది. అప్పటినుండియు బదరీనారాయణ మొక యుపశాఖయయ్యెను.

ఈ యాశ్రమాధిపతులందరును విష్ణువులనబడుచుండిరి. వీ రాశ్రిత రక్షణబిరుదము వహించి దేవతాసంతతి కెవరివల్ల నెట్టి కష్టనష్టములు వచ్చినను వానిని దీర్చుచు వచ్చిరి. దేవతలలో నందరినుండి తగినంత సిబ్బందిని (Military) దీసుకొని బదరీనారాయణమునను వైకుంఠమునను యీ విష్ణువులు నివసించుచుండిరి, ఈవిష్ణువులు శంఖు, చక్ర, గదా శార్ఙ్గ కౌస్తుభము లను చిహ్నములుగను, గరుడకేతనమును ధరించుచువచ్చిరి. మొదటి స్వాయంభువమనువు కాలమున కర్దమప్రజాపతికి దేవహూతి యను భార్య యందు జనించిన కపిలుడు మొదటి విష్ణువయ్యెను. ఆకాలమునందే కొంత కాలము యింద్రుడగు యజ్ఞుడుగూడ విష్ణుపదవిలో నున్నట్లు కనబడు చున్నది. రెండవ మనువగు స్వారోచిషుని కాలమునందు విభిదుడు లేక విభుడను నతడు విష్ణువయ్యెను. ఈతడు వేదశిరుడను విప్రునకు దుషిత యను భార్యయందు జనించెను. ఇట్లే ఉత్తమమనువు కాలమునందు ధర్ముడను వానికి సూనృతయను సతీమణియందు జనించిన సత్యసేనుడనువాడు విష్ణువయ్యెను. పిమ్మట తామసుని కాలమున హరిమేధుడను వానికి హారిణి యను సతియందు జనించిన హరియను నతడును, రైవతమనువు కాలములో శుభ్రుడనువానికి వికుంఠయను నామెయందు జనించిన వైకుంఠుడను వాడును, చాక్షుషమన్వంతరమున వైరాజునకు సంభూతికి జనించిన యజితుడును వైవస్వతమనువుకాలమునందు కశ్యపున కతిధియందు బుట్టిన వామనుడును విష్ణుపదవిలోనుండి దేవతలకు సహాయులై నిలచి, వారివారి కాలములందు దేవతలకు రాక్షసులకు జరిగిన యనేక యుద్ధాది కార్యములందు రాక్షసులను సంహరించి దేవతలకు జయముగల్గించి. యింద్రుని రాజ్యమునందు నిలిపి తమ యాశ్రమపదవిని బలపరచుకొనుచు స్థిరపడినట్లు పురాణములలోని చరిత్రలవల్ల దెలుసుకొనుచున్నాము.

సోమకాసురుడు, హిరణ్యాక్షు, హిరణ్యకశ్యపులు మున్నగువారిట్టి విష్ణువులచే సంహరింపబడినవారే. బలి, వృత్రుడు మున్నగువారిని జయింపలేనప్పుడు యుక్తిచే జయింపుచుండిరి, వామనుడను విష్ణువు బలివద్ద యుక్తిచే దానముగా రాజ్యమంతటిని గ్రహించి యాతనిని వెడలగొట్టెను. వృత్రాసురుడు యింద్రరాజ్య మాక్రమించినపుడు శ్వేతద్వీపమునకు పారిపోయి తర్వాత బలముల గూర్చుకొనివచ్చి క్రమముగా నాతనిని జంపి రాజ్యమాక్రమించిరి. విష్ణ్వాశ్రమము వైకుంఠమున నుండి యచటనే విష్ణువు నివసించుచు దేవరక్షకుడుగా నుండెను. ఈ వైకుంఠము శుభ్రునికొడుకగు వైకుంఠుడను విష్ణువు గట్టించెనని పురాణములందున్నది. ఈ పట్టణముగూడ నొక్కొకపారి దేవశత్రువులగు రాక్షసులచే లూటీ చేయబడుచుండెను ఆ క్రోధమువల్లనే విష్ణువు నరసింహమువలె నుగ్రమూర్తియై యనగ మిక్కిలి కోపవంతుడై బయలుదేరి హిరణ్యకశ్యపుని సంహరించెను అప్పుడు దేవతాసమూహము లందరితో నతడు దండయాత్ర కేగను ఈయన దేవరాజ్యమునందేగాక తన సైన్యములతో అయోధ్య, ప్రతిష్ఠాపురాది రాజ్యములకు గూడ నొక్కొక్కప్పుడు సహాయుడై తన పలు బడిని విస్తరించెను. ఈ విష్ణువు సహాయము లేకున్నయెడల ధ్రువుడి ప్రసిద్ధమైన రాజ్యమును బొందియుండడు. దేవతలకు రాక్షస సంహార విషయమున సహాయము చేయుచున్నట్టియు విష్ణ్వాశ్రమమునకు మతమున లోబడి భక్తులై యుండిన రాజులలో ప్రముఖులు కొందరుగూడ విష్ణ్వ తారములుగనే క్రమముగా భావింపబడుచుండిరి. ఋషభుడు, పృథుచక్రవ శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, బలరాముడు, పరశురాముడు మున్నగువారి విష్ణ్వవతారములైపోయిరి. కృష్ణార్జునులు పూర్వజన్మమందు నరనారాయ లని చెప్పబడిరి. మత్స్య, కూర్మ, వరాహ, నారసింహములవలె నా వేళలందు సంచరించిన విష్ణువు లా యా యవతారము లనబడిరి. నీళ్ల దాగుకొని యున్న రాక్షసులతో బోరాడునపుడు మత్స్యమువలెను, రక్క లతో కపటస్నేహము నటించవలసినపుడు, కూర్మము తన యంగము బయటికి గన్పడకుండ లోనికి ముడుచుకొనునట్లు తన హృదయ మ మును వెలికి రానీయక కూర్మమువలెను, తన నగరమును లూటీ చేసిన లకు గల పూర్వక్రోధముతో నుగ్రరూపుడై సింహమువలెను, జలప్రళ కాలములో మొదటి మనువెక్కిన నావయన్ని ప్రక్కలకు చలించుచున్న



దానిని రక్షించుటకై బురదలోదిగి వారాహమువలెను సంచరించిన విష్ణువులే మత్స్య, కూర్మ, నారసింహ, వరాహావతారులుగా భావింపబడిరి. ఇట్లే క్రమముగా విష్ణువు లనేకుల మతకర్తలై వెలసిరి. వీరు ముఖ్యముగా రాక్షస వధలో నిమగ్నులగుచు తమ మతముయొక్క సర్వ వ్యాపకత్వభారము వహించుచుండిరి. వీరిమతమే వైష్ణవమతమయ్యెను. వైష్ణవగ్రంథము లన్నింటను క్రమముగా నీ విష్ణువులందరొకటిగనే భావింపబడి, వారికి ఏకత్వమును సర్వలోకనాయకత్వమును, రక్షణమును అంటగట్టిరి. అట్టి సర్వేశ్వరుడగు మొదటివిష్ణువును ధ్యానించుచు, పూజించుచు, అనుసరించుటయే యీ మత లక్షణములు. రక్షణగోరుచుండిన పూర్వకాలపు దేవవంశీకు లాదిగా మానవు లందరును అవసర రక్షణకై యీ విష్ణువునే ఆహ్వానించువారు. సాధారణముగా బ్రహ్మలకు, యింద్రునికి నలవిగాని కార్యములందుగాని, క్రతువు లందుగాని యీతని ప్రార్థించి యాహ్వానించుచుండగా, నాతడు వచ్చి వారి యాపదలను తొలగించుటలో సాయపడియు, కోర్కెల బడయుటలో తోడు పడియు ప్రసిద్ధి కెక్కుచుండెను. క్రమముగా నీ పదవి బొందినవారెల్లరును పురుషోత్తము లనబడుచుండిరి. ఈ విష్ణువులపేరిట తర్వాత ఖగోళ నక్షత్రములలో నొక సమూహమునకు విష్ణుపదమని పేరు బెట్టబడెను. ఇదియే "తద్విష్ణోః పరమంపదమ్" అని ఆర్యోక్తిగా బలుకబడినది. ఈ విష్ణుపదమును గ్రీకులు హెర్క్యులస్ (Hercules) అనెదరు. ఇది హారికులేశ (బలరామ) శబ్దమేగాని యొండుగాదని కొందరు పండితు లనుచున్నారు. నక్షత్రముల కన్నిటికి నుత్పత్తిస్థానమగు నీ ఖగోళప్రదేశము తమ మతకర్త పేరిట వైష్ణవమతస్థులు గుర్తించుట విశేషము, శ్రీరామ, శ్రీకృష్ణుల చివరకాలమున మునులు వైకుంఠాధిపత్యముకొరకై పిలిచియుండిరి. ఇది వేరులోకమునకు గాదనియు, దేవరాజ్యమున నున్న వైకుంఠాశ్రమ పదవికై పిలిచినట్లును, వారు దానిని కొంతకాలము స్వీకరించినట్లును మనము గ్రహింపవచ్చును.

## శివులు లేక రుద్రులు

మొట్టమొదటి మహాదేవుడు లేక దేవదేవుడను శివుడు రాక్షసులకు మతప్రవర్తగాను, రక్షణ సహాయకర్తగాను యేర్పడిన యొక యాశ్రమాధి

పతి ఈయనస్థానము కైలాసగిరి. ఇది హిమవత్పర్వతమున నున్నది. ఇతడా చుట్టుప్రక్కల గల రమణీయ ప్రదేశములను, మానస సరోవరాది ప్రాంతములను వశమునందుంచుకొని కొందరు సైనికులు (వారినే ప్రమథ గణ మనెదరు) తోడ్పాటుచే రాక్షసులకు కోరిన సహాయము లొనర్చుచుండెను. ఈతడు రుద్రుడనిగూడ పిలువబడుచు క్రమముగా దేవ, మానవ జాతులందరికిని తన మతములో నున్నవారికి రక్షణ నిచ్చుచుండెను. కాల క్రమమున నీ రుద్రులు 11 మంది ప్రాముఖ్యములోనికి వచ్చిరి. వీరినే ఏకాదశ రుద్రులందురు. మన్యు, మను, మహాకాల, మహచ్ఛివ, ఋతధ్వజో, రు, రేతోభవ, కాల, వాసుదేవ, ధృతవ్రతులనువారే 11 గురు. వీరికి వరుసగా ధీ, వృత్త్యి, శనో, మా, నియు, త్సర్పి, రిలాంబకే, రావతీ సుదా, దీక్షా, నాములగు పత్నులుండిరి. ఇందలి యొక శివుని (రుద్రుని) వర్ణనము ఋగ్వేదములోనుండి, యాయన బలశాలియనియు, జటాజూటధారి యనియు, తపస్వియనియు, శత్రుసంహారియనియు జెప్పుచున్నది.

* కైలాస పర్వత మిపుడు నేపాలురాజ్యములో జేరియున్నది.

ఇంద్రరాజ్యములోని దేవతల కందరకును రక్షకస్థానముగా విష్ణ్వాశ్రమము స్థాపింపబడినంతనే రాక్షసులు తమ శ్రేయస్సుకొరకు యీశివాశ్రమము జేరి యాయన మతి మనుసరించుచుండిరి. వీరుగూడ పూర్వదేవతలే యగుటవల్ల శివునకు దేవదేవుడను పేరువచ్చెను. ఈయన దక్షప్రజాపతి కల్లుడయ్యెను. సతియను పేరుగల దాక్షాయణియే యీ మొదటిశివునిభార్య. ఈయన వైద్యముగూడ చేయుచున్నట్లు ఋగ్వేదమందలి రుద్రస్తోత్రములు తెలుపుచున్నవి. (1-16-114-5) సాధ్యమైనంతవర కీయన దేవరాజ్యమునకు, రాక్షసులకు విరోధములు కలుగనీయకుండను యుద్ధములు జరుగకుండను రాజీపరిష్కార ప్రయత్నములు సల్పుచుండినట్లు కనబడును. అందువల్లనే దేవతలుగూడ యీతని ప్రార్థనలు జేయుచుండిరి, మొట్టమొదట నీయనను బహిష్కరించి యజ్ఞయాగాదులలో భాగము లీయగూడదని తలంచిరిగాని దక్షయజ్ఞములో జరిగిన పరాభవముతో దేవతలు బుద్ధి

* శ్రు. ఇమాగ్ం, రుద్రాయ తపసే కపర్దినే క్షయద్వీరాయ ప్రభరామహేమతిం । యథానః సమసద్ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం గ్రామే అస్మి న్ననాతురమితి॥ (ఋగ్వేదము 4-5-10-3)



దెచ్చుకొని యాతని నంకటినుండి భాగస్వామిని చేసిరి. క్రమముగా నీయన దేవతలలోనే కలిసి రాక్షసులను సంహరింపజొచ్చెను. ఈ శివాశ్రమాధిపత్యమున క్రమముగా క్రింది గణములవారుగూడ శివపదవి నధిరోహించుచుండిరి. ఈ యాచార మా మతాశ్రమములందు 11, 12 శతాబ్దులవరకు నున్నట్లే కనబడుచున్నది. ఈ మతములో జేరినవారందరును వీర మహేశ్వరులనియే చెప్పుకొనుచున్నట్లు శాసన దృష్టాంతము లనేకము గలవు. ఈ మతాశ్రమాధిపతులు సైతము తాము శివులనియు, యీశ్వరులనియు నామకరణము గావించుకొనుచు ప్రజలకు తాము మొదటిశివుని యవతారములుగనే గోచరింపజేయుచుండిరి. నందీశ్వర, చండీశ్వర, భృంగీశ్వర, గణేశ్వర, మహేశ్వర, వామదేవ, వీరభద్ర, పరమేశ్వర, తత్పురుషశివ, అఘోరశివాదులు మొదటిగణములలోనుండిన శివులే, శిలాదునిపుత్రుడగు నందీశ్వర పట్టాభిషేక వర్ణనము లింగపురాణమున నున్నది. 12, 13, 14 శతాబ్దములలో నీ శైవమతమునందు గోళకీమఠమునకు జెందిన వారిలో విమలశివ, శాంతశివ, ధర్మశివ, విశ్వేశ్వరశివ, పరిపూర్ణశివ, ఉత్తమశివ, శ్రీకాంతశివులను శైవగురువు లున్నట్లు శాసనములు వచించుచున్నవి. 12 వ శతాబ్దిని పాలించిన బిజ్జలుని కాలమున వీరశైవులందరిని శివులుగనే భావించుచున్నట్లు బసవపురాణము జదివినవారికి తెలియును. మొదటిశివుని యాకారలక్షణములు జటాజూటధారణ, త్రిశూలధారణ, విభూతి, రుద్రాక్ష, నాగాభరణ ధారణాదిలక్షణము లీమతము నందున్నవి. లింగపూజ యీమతమునకు ముఖ్యము. ఆదికాలపు మానవులు (రాతియుగములోనివారు) స్త్రీపురుషులు సృష్టికార్య మతి పవిత్రవంతముగా భావించి మైథునమందుగల విశేషాసక్తి శ్రద్ధలతోను భక్తిపరత్వమునను దాని కాధారమగు లింగమును యీశ్వరదృష్టితో బూజించుటయు, దానిని పరంపరావ్యాజమున నీ యాదిశివు లనుసరించుటయు నిందలి విశేషము. ఈ ఆదికాలపు శైవమతమునే పెక్కండ్రు అనుసరించుచు వచ్చిరి. మొదటిశివుడు దక్షకన్యయగు సతీదేవి చనిపోయిన పిమ్మట హిమవంతుడను కొండరాజు కుమార్తె దుర్గాదేవిని పెండ్లాడెను. ఈ దుర్గపేరునను శివునికుమారులగు వీరభద్ర, వినాయక, కుమారస్వామి, భైరవాదుల పేర్లనుగూడ మతశాఖలు క్రమముగా వెలసి, వారి కనేక గుళ్లు గోపురాలు నిర్మింపబడెను. (గ్రంథవిస్తరణ భీతిచే వీరందరి భార్యలు,

సంతాన వివరాలు (వ్రాయబడుటలేదు) శివలింగమును స్థాపించుచు వేల కొలది గుళ్లు మనదేశమున క్రమముగా ప్రబలెను. 7 వ మనువగు వైవస్వతుని కాలమునకే (యీతడు సూర్యుని పేరిట వానికి జనించినవాడే గాని సూర్యుడు కాదు) యీ శివయోగులలో ననగా మతకర్తలలో శ్వేతుడు, రుద్రుడు, సుతారుడు, మదనుడు, సుహోత్రుడు, కంకిణుడు, లోకాక్షి, జైగీషవ్యుడు, మహాతేజుడు, దధివాహనుడు, ఋషభుడు, దగ్రుడు, అత్రి సుబాలకుడు, గౌతముడు, వేదశీర్షుడు, గోకర్ణుడు, గుహావాసి, ఖండభృతుడు, జటామాల్యాట్టహాసుడు, తారకుడు, లాంగలీకులనువా రున్నట్లు లింగ పురాణమున నున్నది. వీరందరును కైలాస శివాశ్రమాధిపతులుం గాకున్నను దాని కనుబంధాశ్రమాధిపతులై యుండి మత, రాజ్య రక్షణకై పాటుబడుచున్నట్లు కనబడుచున్నది. కూర్మపురాణములో నీ బ్రహ్మ విష్ణు మహేశ్వర మతము లెట్లు వ్యాపించినవో యీ క్రిందిరీతిని వ్రాయబడినది.

## —♦ ఇ త ర మ త ము లు ♦—

| | | |
|---|---|---|
| రాజులు | ... | విష్ణువుని, ఇంద్రుని అరాధించుచుండిరి. |
| బ్రాహ్మణులు | ... | అగ్నిని, బ్రహ్మను, రుద్రుని ఆరాధించుచుండిరి. |
| శూరులు | ... | విష్ణువునే ఆరాధింతురు. |
| రాక్షసులు | ... | రుద్రు నారాధింతురు. |
| గంధర్వులు, యక్షులు | ... | వీరు చంద్రుని ఆరాధింతురు. |
| విద్యాధరులు | ... | వీరు లక్ష్మీదేవిని ఆరాధించెదరు. |
| సాధ్యులు, వైఖానసులు | ... | వీరు సూర్యదేవుని ఆరాధన మొనర్తురు. |
| అసురులు | ... | రుద్రుని ఆరాధింతురు. |
| కిన్నరులు | ... | దుర్గాదేవిని పూజింతురు. |
| ఋషులు | ... | శివుని కుమారున్ను ఆరాధింతురు. |



| | | |
|---|---|---|
| మనువులు, వారి వంశీకులందరు | ... | విష్ణువు, రవి, రుద్ర, బ్రాహ్మలను ఆరాధన మొనర్తురు. |
| బ్రహ్మచారులు | ... | బ్రహ్మ నారాధింతురు. |
| గృహస్థులు | ... | అందరు దేవతలను ఆరాధించెదరు. |
| యతులు | ... | రుద్ర నారాధించెను. |
| భూతములు, కూష్మాండులు | ... | వీరు గణేశ్వరుని, రుద్రుని పూజించెదరు. |
| జనులందరును | ... | బ్రహ్మను పూజించెదరు. |

మనదేశమున మొట్టమొదటగా నేర్పడిన మతసంస్థలు మూడును ప్రజోపయోగకర సంస్థలుగా నేర్పడి వానినుండి చీలి యనేక మతములుగా వ్యాపించెనని చెప్పవచ్చును. దాదాపు భారతయుద్ధమువరకు కీర్తి యాశ్రమములు క్రమముగా జరుగుచుండెను. భారతయుద్ధకాలమునకు కొంచెము పూర్వమున నుండిన రాక్షసరాజగు ఒక బాణుడు శివు నొకనిని వాకిట కావలిగా నుంచినట్లును, అతడు కృష్ణునితో యుద్ధమున నోడిపోయినట్లును భాగవతమున నున్నది. ఎప్పుడో యొకప్పు డిట్టి తప్పనిసరి పోరాటములు గల్గినను, సాధారణముగా వైష్ణవ, శైవ ఆశ్రమము లన్యోన్య స్నేహముగనే మొదటి నుండి యుండెను. రుద్రకోటి, మధువనం, పద్మనగర్, కాలంజర్ పట్టణము లందును. పంచనది, గోకర్ణము, విజయ, ఏకాంగ, విరజ మున్నగు తీర్థము లందును. శైవులు విరివిగా వ్యాపించి మతమును వృద్ధిజేసిరి. అట్లే వైష్ణవ మతము నారాయణతీర్థము, సాలగ్రామము, అశ్వతీర్థము, కుబ్జాశ్రమము మున్నగుచోట్ల మొదట వృద్ధియైనట్లు గన్పడును. ఆశ్రమ భేదములును, వస్తుధారణాది భేదములును, దేవతా స్వరూపాకారాది భేదములున్నను, యీ మతములవా రందరును ఒకే యాత్మస్వరూపమును నమ్ముచు దానిని జక్కగా తెలుపు ప్రజాసేవకులైన మఠాధిపతులను గొల్చుచు వారినే చివరకు (ఆత్మ స్వరూపులు) దేవులుగా భావించుచు వచ్చిరి, దేవతాశబ్దము అ కాలములో పూర్వపెద్దలను భావమం దుండెను. హిందూదేశములో నే మతమున్నను, ఒకేయాత్మ వస్తువును దెల్పునదిగనే యుండును. అందువల్లనే యెవరెవ రే పేరిట నే దైవమును నామకరణ మొనర్చినను, వారి యంతఃకరణములో

మాత్రి మా దేవుడు పరమాత్మ స్వరూపమనియే నమ్ముచుండిరి. ఈ శివాశ్రమమునకు చేరువనే కుబేరపట్టణ ముండెను. అతనితో శివులందరు సఖ్యము నెరపుచుండిరి. క్రీ. పూ. 6650 సం॥ల క్రిందటనున్న నాభాగుని కాలములో అంగీరసులు దాచిన సత్రపరిశోషిత ధనము హిమాలయమందు దొరకెను. అది యెవరిదను ప్రశ్న వచ్చెను. నాభాగుడు తన తండ్రి సన్నిధికేగి విచారించగా, నది శివస్థానములో నున్నది గావున నాయనదేనని చెప్పెను. అప్పుడు నాభాగుడు తనకా ద్రవ్యముతో పనియున్నను తీసుకొనక కైలాసాశ్రమాధిపతియగు నప్పటి శివుని వద్దకేగి, యా ద్రవ్యము దొరకిన విషయము నివేదించెను. సత్యమును పలికినందులకై యా దేవదేవుడగు శివుడు సంతోషించి దాని నాతనికి మరల నొసగగా స్వీకరించెను. అప్పటి యాశ్రమాధిపతు లిట్టి సేవలనే యొనర్చుచుండిరి, ఇట్టి రుద్రులు 11 గురు పేరిట ఏకాదశరుద్రులును, విష్ణుస్థానము పేరిట తద్విష్ణోః పరమః పదమ్మను విష్ణుస్థానమును ఖగోళమున దక్కినవారికివలెనే మన పూర్వులు నిర్మించిరి అనగా నామకరణ మొనర్చిరి. ఈ రుద్రులు యింద్రుని కంగరక్షకులైరి.

## ఇతర దేవరాజ్యములు

బ్రహ్మావర్తమునందు ఇంద్రుడు అమరావతి రాజధానిగా నేలుచు వచ్చెనని లోగడ తెలిపితిమి. గరుడులు కర్గపూరు ప్రాంతమును, (Cuttack) నాగులు నాగపూరు ప్రాంతమును, 'గంధర్వులు కంధహారు ప్రాంతమును, మూజవత్తులు మూజవత్ పర్వతప్రాంతమునందును, యక్షులు అలకాపుర ప్రాంతమును, రాక్షసులలోని బాణులు శోణపురప్రాంతమును, (Sonapur) త్రిపురాసురులు త్రిపురి, త్రిపుర ప్రాంతములను(Tripuri, Tripura etc) జలంధరాసురుని వంశీకులు జలంధర్ ప్రాంతమును మొదట పాలించుచు వచ్చినట్లు కనబడుచున్నది. ఇది దాదాపు క్రీ. పూ. 7800 ప్రాంతమున నుండియు నున్నట్లు చెప్పవచ్చును. ఈ వంశముల వారందరును క్రమముగా దేవతలతోను, మనువు సంతతివారగు మానవులతోను సంబంధము లొనర్చి క్రమముగా హిందూదేశసంతతును ప్రాకిపోయిరి. వాతాపిరాజ్యము



బాదామీపుర రాజధానిగా నుండెను. దీనికి చాలా శాసనదృష్టాంతము లున్నవి. యక్షులరాజగు కుబేరుని వంశీకుని శారనుని 12, 13 శతాబ్దులలోని వైశ్యశిఖామణు లనేకులు శాసనములు లిఖించియున్నారు. అతని పేరిట ననేక పట్టణములుగూడ ఆంధ్రదేశమునందు నైతము వెలసెను. కుబేరవంశ్యులే చేరులని పేర్వడిరి. వారి పేరిట బిహార మేర్పడియుండును. గుంటూరు జిల్లాలోని చందవోలు (సనదవోలు) నకు పూర్వము ధనదుపురమని పేరుండెను. ఇవి కుబేరపురమునకు నకలని చెప్పవచ్చును. కుబేర రాజొకడు భట్టిప్రోలు స్తూపమునందు దొరికిన శాసనములందు పేర్కొనబడెను. ఈ రీతిగా మొదటి అలకాపురీ ప్రాంతీయులగు యక్షులు దక్షిణమునకు వ్యాపించిరి. మొదటి ప్రజాపతులు లేక బ్రహ్మల వంశీకులే నేటి బ్రాహ్మణ వంశము వారైరి. బ్రాహ్మణులు బ్రహ్మకుమారులమని చెప్పుటలో గల యర్థము బ్రహ్మలనువారి కుమార్లు అయినందుననే ఆదిబ్రహ్మ ముఖముననే బుట్టినట్లు క్రమముగా చెప్పుకొనుచు నట్లే వారి వేదములలో వ్రాసుకొనిరని గ్రహింపవలసి యుండును. ఈ బ్రహ్మలును, మనుసంతతివారగు మానవులును, రాజులును. కశ్యపప్రజాపతికి బుట్టిన దేవరాక్షసాది గణముల వారును, ఇంద్రవిష్ణు, శివనామములు ధరించిన యనేకులును, నాటి ప్రజలేననియు వీరందరి కన్యోన్య సంబంధబాంధవ్యములు గలవనియు క్రమముగా వారివారి తల్లి దండ్రుల పేర్లవలననో, స్థానమువలననో, మతములవలననో వేర్వేరు తెగలవారుగా నున్నను ఒకే హిందూజాతిగనే యున్నట్లు కనపడుచున్నది, సూర్యుడనువాని కుమారుడు యముడు, అతడు యింద్రుని రాజ్య సరిహద్దులలో నున్న యొకరాజు. నేరస్థుల శిక్షించుచుండువాడు. ఇతని పేరిటనే ఆ పదవి వరుసగా నుండెను.

## దేవతార్యులకు దేవతలు_దేవత లెందరు ? వారెవరు ?

ఋగ్వేదములో ననేకటచోట్ల “త్రిరేకాదశ దేవతాః” అని చెప్పబడినది. మూడుచోట్ల మూడువిధములైన దేవతలు మొత్తము 33 అని యితర చోట్ల వ్రాయబడెను. ఈ 33 గురు దేవతలనే క్రమముగా 33 కోట్ల మాది

రిగా పురాణములందు వర్ణించిరి. ద్యావాపృథువులు. సూర్య, సవిత, మిత్ర, పూష, విష్ణువులను పేర్లుగల సౌరదేవత లైదుగురు. సోమ, పర్జన్య (మేఘము) ఉపవస్సులు, రాత్రిదేవత యను వరుణుడు గలసి 11 గురు ఒక గణముగా నున్నట్లు కనబడును. సౌరదేవత తర్వాత 12 గా మారిరి. అగ్ని, (తేజస్సు) వాయువు, (మాతరిశ్వ) జలము, ఉరుము, మెరుపు, పిడుగు, (త్రిత) నీటిలోని బడబానలము, వనములలోని కార్చిచ్చు, మృత్యువు, నదీ దేవతలు మొదలైనవి 11 ను ఒక గణము దేవతలుగా నపుడు భావించిరి. వీనిలో చాలవాటిని అగ్నిగానే తలంచుచుండిరి. వీరుగాక వసువులు, అశ్విసులు, యింద్రుడు, అగ్ని, యముడు, వరుణుడు, అదితి, బృహస్పతి, ఋభువులు, మరుత్తులు, రుద్రులు కలిసి 11 గణములవారును (వీరానాటి ప్రజాగణములై యుండిరి) 11 దేవతలుగా భావించుకొనిరి. ఈ రీతిని 33 దేవతలని ఋగ్వేదమున పెక్కుచోట్ల వ్రాయబడినది. ఆనాటి ప్రజల కుపయోగించు గణము మొదటి దేవతలుగాను, ఆనాటి ప్రజలు వేనిని జూచి యాశ్చర్య పడుచు, భయమొందుచుండిరో యవి దర్వాత గణదేవతలుగాను, వీనిని నివారించు నాటి ప్రజానాయకులు మూడవ గణ దేవతలుగాను అప్పుడు తలంచుచున్నట్లు కనబడుచున్నది. ఇది యంతయు ప్రతివారికిని దేవత్వ మంటగట్టుటకు పూర్వము నిశ్చయించుకొనినది. ఆకాలమున నైదు ఋతువులే లెక్కింపబడుచుండెను. ఆ యైదు ఋతువులలోని సూర్యుడే యైదు పేర్లతో దేవతలుగా నాడు భావించుచుండిరి. క్రమముగా 12 మాసములకు 12 దేవతలైరి. పైన నుడివిన 33 గణముల దేవతల ప్రార్థనలు ఋగ్వేద ఆరంభకాలమున నున్నను క్రమముగా మారి వారి నాయకులే దేవతలైన కొలదిని పైన నుడివిన విధమున నితర నాయక మతములు సైతము ఆనాటి జనులలో వ్యాపించినట్లు కూర్మపురాణమునల్ల స్పష్టము. అనగా నప్పటికి సూర్య చంద్ర అగ్నుల ఆరాధనలు మాత్రమే నిలిచి తక్కినవి ఆకాలపు వీరపూజగా మారినట్లు గ్రహింపవచ్చును. ఈ వీరపూజా మతములలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వర మతములు ముఖ్యములు. ఆకాలపు నాయకవర్గమునుండి యేర్పడిన 11 గురు దేవగణములలో బ్రహ్మ, విష్ణు, మహేశ, యింద్ర, యమ, వరుణాది గుణములవారిని గురించి లోగడ చెప్పితిమి. తక్కినవారుగూడ నట్టివారేనని ముందు చెప్పెడి దృష్టాంతములనుబట్టి గ్రహిం



పగలరు. అశ్వినులు దేవవైద్యులనియు, విశ్వలా యను నొక కన్యకకు కాలు విరిగిపోగా లోహనిర్మితపు కాలును తయారుచేసి పెట్టిరనియు ఋగ్వేదమున నున్నది. ఋభువులు వడ్రంగిపని జేర్చి యొక రథమును జేసిన ట్లొక శ్రుతి యందు గలదు. వసువులలో చివరివాడే రాభోవు మనువగు సావర్ణి యని పురాణములం దున్నది. మరుత్తు లదితికి జనించినట్లును, వారి నింద్రుడు లోబరుచుకొనినట్లును భాగవతమునన్నది. అదితి దేవతలందరికి తల్లి. బృహస్పతి పురోహితుడు. ఇతడు అంగీరస పుత్రుడు. శ్రద్ధ తల్లి. ఈ రీతిగా 11 గురు దేవతలును ఆనాటి దేవ ప్రజానాయకులే. కాలక్రమమున వీరందరిని గొల్చుటయే వేదఋషుల మతమయ్యెను. ఇంద్రునియొక్క సేనాపతి పేరు గూడ అగ్నియే. ఇతడే యజ్ఞముల లోని హవిస్సులను దేవతలకు బంచి యిచ్చుచుండును, ఇంద్రాగ్నులను కలిసి వర్ణించుటలో వారు అశ్వములు, మంచి బాహుదండములు, హస్తములు కలవారని వృత్రసంహారమున నిద్దరును పాల్గొనిరని, వారు తరచుగా రాజులకు సహాయమునకై బోవువారని కొన్ని శ్రుతులు వచించుచున్నవి.

(ఋగ్వేదము 1-16-108, 109 సూక్తముల జదువుడు)

## అశ్వినులు

అశ్వినులు దేవవైద్యులగుటయేగాక రోగాదలవ్యాపాగము గలవారుగా గూడ గన్పడుచున్నారు. ఎందరో నాటిరాజులకు, ఋషులకు, ఇతరులకు వారు చికిత్సలజేసి యనేక మేళ్ళను చేకూర్చిరి. వారుగూడ శరీరధారులైన దేవవైద్యు లనుటకే కొన్ని దృష్టాంతములను చెప్పెదము. ఈనలేని గోవును శయుడను ఋషిదేగా దాని నీనునట్లుచేసిరి. రేభుడు, వందనుడను ఋషులను రాక్షసులు బావిలో బడద్రోయగా వారిని రక్షించిరి. ఇట్లే అంతకునిని తుభ్యుడు, కర్కంధుడు, వయ్యుడను వారలను రక్షించిరి. పరావృజాడను ఋషి కాళ్ళుబోగా వానిని నూతనముగ నిర్మించిరి. వశునకు నిత్యము సహస్ర ధనము వచ్చునట్లు చేసిరి. ఋజ్రాశ్వుడనువానికి యంధత్వమురాగా కన్నులను బాగుచేసిరి. ఖేలుని భార్యయగు విశ్వలకు యుద్ధములో కాళ్ళుబోగా లోహపుకాళ్ళ జేర్పరచిరి. కణ్వపుత్రుడగు త్రిశోకునిగోవులు రాక్షసులపహరింపగా గొనితెచ్చి యిచ్చిరి. వేనపుత్రుడగు పృథువునకు గుఱ్ఱముల నిచ్చి పేరందిరి. అత్రిఋషిని రక్కసులు గొంపోయి యొక యంత్రగృహ

మున బడవేసి వేధించుచుండగా నాతనిని విడిపించిరి. ప్రవృంజనునిచే బాధింపబడిన షుర్మని రక్షించిరి. పృశ్నిగుని, పురుకుత్సనిగూడ కాపాడిరి. శయుడను వానిని రక్షించిరి. శర్యాడు, శర్యాతుడనువారలకు గావలసిన సాయమిచ్చిరి. విమదునిభార్యను, భుజ్యుని, అద్రిగుని, ఋతస్తుప్పను, ఘుభరను, కుత్సుని, శ్రుతర్యుని,నర్యుని, వశుని, తుర్వీతి, దభీతి, ధ్వసంతి, పురుమంతి, చ్యవనుడు, అనువారలనుగూడ కాపాడిరట. వారల రోగబాధల బోగొట్టియుందురు. ఇంకను దీర్ఘశ్రవస్సు, మంధాత యనువారలనుగూడ రక్షించిరట. కక్షీవంతునికూతురు ఘోషయను నామె కుష్టురోగిగా నుండగా నారోగము కుదిర్చిరి. వృషదపుత్రునికి చెవుడు మాన్పిరి. కణ్వఋషికి కన్నులు బాగుచేసిరి. విష్ణాప్వుడనువానిని వెదకి తెచ్చి తండ్రి కిచ్చిరి. వేశుడనురాజునకు యుద్ధములో మంచి గుర్రమునిచ్చి రక్షించిరి. జాహుషుడను రాజును శత్రువులు బాధించునపుడు రక్షించిరి. ఇంకను హీ రవేక దానము లిచ్చుచుండిరి. పైన నుడివిన భుజ్యుడు ఓడలోనుండి శత్రువులవల్ల మునుగనున్నపుడు కాపాడబడెను. సింధునదికి మంచి నీరు వచ్చునట్లు చేసిరి. (ఋగ్వేదము 1–16 లోని 112 నుంచి 117 వరకు చదువుడు) ఈ కార్యములన్నియు మొదటి యిర్వురు అశ్వినులు చేసిరనజాలము. వారి వంశమువారు అందరును అశ్వినులుగానే పిలువబడుచు వచ్చుటచే వారందరు చేసినవియు నిందు గలిసియుండును. వీరు మొదట కంచరగాడిదలపై నెక్కి తిరుగువారు. క్రమముగా అశ్వములు, కంచరగాడిదలు, యెద్దులు, మొసళ్ళు సైతము బూన్చిన రథములతో నెచ్చటకైన బోవుచున్నట్లు కొన్నిరుక్కులు తెలుపుచున్నవి. ఈ యశ్వినులపేరిటగూడ ఖగోళమున నక్షత్రనామకరణమయ్యెను.

## మరి కొందరు దేవతలు

ఇళా, సరస్వతి, భారతులు, దేవపత్నులలోని వారుగా గన్పడుచున్నారు. వీరు దృఢగాత్రులని వర్ణింపబడిరి. ఇంద్రసేనాపతియగు నగ్నిపదవిలో వీరును నాంగీరసపుత్రుడును తనూనపాత్, నరాశంసమ్, దైవ్యహోత, త్వష్ట, వనస్పతి మొదలైనవా రున్నట్లు ఋగ్వేదమువల్ల దెలియుచున్నది. వీరంద రగ్నిగానే వర్ణింపబడినారు. వీరు దేవదూతయగు నగ్నిపదవిలోనుండి హవిస్సును, సోమమును హాజరుకానివారికి పంపుచువచ్చిరి. ఋభువులు, అంగీరసవంశములోని సుధన్వుని కుమారులనియు ఋభు, విభు,



వాజలనువారు ముర్వురనియు, వీరు రథనిర్మాణ కుశలురనియు నొక రథమును అశ్వినులకు వీరు చేసియిచ్చినట్లు కొన్ని రుక్కులందున్నది. ఈ ఋభువుల యనంతరము వీరి పేరిటగూడ నక్షత్ర నామకరణ మయ్యెను. అందుచే ఋగ్వేద స్తోత్రములతో వానినిగూడ వర్ణింపజొచ్చిరి. ఈ రీతిగా దేవతలు పెరిగిపోయిరి. మరుత్తులు, ధనుస్సు, అంబులపొది, బల్లెములు ధరించెడివారని, వీరిలో పదాతులు, అశ్వరథారూఢులుండేవారని,రథాలకు శేస్లు, గుర్రాలను కట్టేవారని, వీరు కత్తి, గద, తోమరం,ధూమాస్త్రాలు కూడాధరించే వారని మరుత్తు సూక్తములందున్నది. వీరు కేవలము గాలి కాదనుట కీ సూక్తములే నిదర్శనము.

---

# తృతీయ ప్రకరణము

## సప్తర్షులు

ప్రతిమనువు పరిపాలనకాలములోను సప్తర్షులుండిరి. వారు రాజ్యపాలనలో ధర్మములు నడుపుచు సలహా మంత్రివర్గమువలె నున్నట్లు కనబడుచున్నది. మన గ్రంథములనుబట్టి మొదటి స్వాయంభువమనువు కాలమున సుయమనాములు దేవతలుగా నుండిరి. కాని సప్తర్షులెవరో తెలియుటలేదు.

రెండవమనువగు స్వారోచిషునికాలములో ఊర్జస్తంభుడు మున్నగువారు సప్తర్షులుగా నుండిరి. ఉత్తమునికాలములో వసిష్టుని కుమాళ్లు సప్తర్షులైరి. * తామసుని పాలనయందు జ్యోతిర్వ్యోమ ముఖ్యులు సప్తర్షిస్థానమలంకరించిరి. రైవతమనువు పాలించుచుండగా హిరణ్యరోముడు, ఊర్ధ్వబాహుడు, వేదశిరుడు మున్నగువారు సప్తర్షులుగా నున్నట్లు కనబడును. ఇట్లే చాక్షుషమనువు పాలనలో ఆహవిష్మద్వీరకాదులు సప్తర్షులుగా పేర్వడసిరి. ఇక నేడవమనువగు వైవస్వతుడు పాలించుచున్న కాలములో కశ్యప, అత్రి, గౌతమ, విశ్వామిత్ర, జమదగ్ని, భరద్వాజ, వశిష్టులు సప్తర్షులుగా వ్యవహరించినట్లు పురాణములు హరివంశము నుడువుచున్నవి. మరీచి, పులహ, క్రతు, వశిష్టాంగీరస, అత్రిగౌతములని కొన్నింట గలదు. వీరందరు సరిగా నాయాకాలములలో వ్యవహరించినట్లు పురాణములు నుడువుచున్నను మనకు చారిత్రక దృష్టాంతములు కనబడవు. గాని వీరాకాలపు ఋషులే యనుటకు అభ్యంతరములేదు. ఇందలి చివరివా రేడుగురు పేర్లవనే ఖగోళమందలి సప్తర్షినక్షత్రములను యిప్పుడు మన దేశస్థులు పిలుచుచున్నారు. ఈ నక్షత్రములనే రాబోవు మన్వంతరమున పరశురామ, అశ్వత్థామ, కృప, బాదరాయణ, ఋష్యశృంగాది నామములతో బిలువబడెనని మన పురాణములు నుడువుచున్నవి. ఈ నక్షత్రముల కితర దేశములందు వేరువేరు పేర్లు గలవు.

* చిత్రకేత, సురోచి, విరజ, మిత్ర, ఉల్బణ, వసుభృద్యాన, ద్యుమంతులనువారు. ఊర్జయనునామె వీరి తల్లి.



ఈ సప్తర్షులకు పూర్వమునుండి వివాహకాలములలో నమస్కారము లాచరించుచుండిరి. ధృవునకుగూడ చేయుచుండిరి. రోమనులు ఈనక్షత్రములను (సప్తర్షులను) Septentriones యేడు దుక్కిటెద్దులు అనెదరు. అమెరికనులు వీనికే Big Dripper పెద్దగాకార్పుడిది అనెదరు. మనధృవనక్షత్రమును చిన్నగాకార్పుడి దందురు. ఈ సప్తర్షులను, ధృవుని యింగ్లాండులో Ursa Major, Ursa Minor అని వరుసగాపిలిచెదరు. వీనిలో సప్తర్షులను ఛార్లెసు వెయిన్ David's Chariot అనిగూడ నందురు. అరబ్బులిందలి మధ్యనక్షత్రమును Alcor అనగా గుఱ్ఱపురౌతు అందురు. ఇంగ్లీషువారు దీనిని Jack on the middle horse అనెదరు. జర్మనులుగూడ Hans on the middle horse అందురు. గ్రీకులుసప్తర్షులను Callisto అనియు, ధృవనక్షత్రమును Arcas అనియు బిలిచెదరు. ఆ రెండును తల్లిబిడ్డలని వారి కథలు తెలుపుచున్నవి. అమెరికాలోని యిండియనులు సప్తర్షులలో 4టిని Great Bear అందురు. మిగతవానిని Robin Chicadee, Mouse Bird అను పేరుగల పిట్టగాంద్రని పిలిచెదరు. వేదములలో యీ నక్షత్రములను ఎలుగుబంటి యాకారమువలె నున్నట్లు వర్ణించియున్నారు. అందువల్లనే యీ Great Bear అను పదమచ్చటచ్చట ప్రచారములోనికి వచ్చియుండును. ధృవనక్షత్రమును అమెరికాలోని వైవారు Little Bear అనుచున్నారు.

ఈ రీతిగా సప్తర్షులు ధృవుడు అనబడు మన నక్షత్రాలు యితర దేశములలో పలురీతులుగా పిలువబడుచుండుటచే నాయాదేశస్తులకు తోచిన రీతిని ఖగోళనక్షత్రాదులు నామకరణము గావించుకొన్నట్లుకన్పడుచున్నది. సూర్యచంద్రు లిద్దరుమాత్ర మన్ని దేశములలోను ఆ యర్థములనే వాడుచున్నారు. సప్తగ్రహములు యేడ్వుర పేరిటనే వారములు అన్ని దేశములలో సమానముగా నేర్పడినవి. అంతవరకు యిప్పటి ప్రపంచములోని జనుల మూలపురుషులందరొకేచోట ప్రాతఃకాల మనదేశమునందే నివసించి యీ పేర్లు వాడుచుండినట్లు కన్పడును. తర్వాత కొందరు ఇరాను, పర్షియా మున్నగు దేశములకు వెడలి వేరైపోయినకొలదిని వారి వారి యిచ్చవచ్చిన

చేసి ఖగోళమందలి నక్షత్రాదులకు ఆయా దేశస్థులు పెట్టుకొనిరి. అందు వల్లనే మన పూర్వులు మన ఋష్యాదుల పేర్లవనే సప్తర్షినక్షత్రములను బిలువ నారంభించిరి. ఈ కశ్యపత్రి భరద్వాజాదులు పుట్టి గిట్టినపిమ్మటనే యీ నక్షత్ర నామకరణము జరిగినట్లు కనబడుచున్నది. భారతయుద్ధము పిమ్మట యేర్పరచిన నూతన దేవయుగ, మన్వంతర ప్రణాళికలో యీ సప్తర్షులను రాబోవు మన్వంతరమునకు తొలగించి పైన నుడివిన భారత కాలపు ఋషులను నామకరణము గావించినట్లు పురాణములు నుడువుచున్నవి. ఒక్క సప్తర్షులనేగాక పూర్వకాలమందు క్రమముగ ననేక నక్షత్రములకు మన పూర్వుల పేరిట నామకరణము గావించినట్లు కన్పడుచున్నది. అశ్వినీదేవతలు, మరుద్గణము, అష్టవసువులు, శివుడు, బ్రహ్మ, ఇంద్ర వరుణులు, వృత్రుడు, అనంతపద్మనాభుడు మున్నగు పేర్లెన్నియో నక్షత్ర సమూహములకు కిత్పూర్వమే పెట్టబడినట్లు కన్పడుచున్నది. అశ్వినీదేవతలు నిజముగా దేవవైద్యులు, కంటివైద్యము మొదలు కుంటివారికి అయోనిర్మిత చరణము లమర్చువరకు వీరు నానావిధ వైద్యము లొనర్చుచుండిరి. తుదకు వీరి పేరిటగూడ నక్షత్రము లేర్పడెను.

## యమ వరుణాది పట్టణములు

నచికేతుడను బ్రాహ్మణుడు యమపట్టణమునకు వెళ్ళి చాల దినములు వేచియుండి యమదర్శనము గావించుకొని, యాతనికడ వేదాంతసారమును తెలుసుకొనియుండెను. * శ్రీకృష్ణకాలమున నాతడుగూడ నచ్చటికేగి తన గురుపుత్రులను వానికడనుండి తెచ్చెను. వరుణభటులు తన పెంపుడు తండ్రియగు నందు నొకసారి బంధించుకొనిపోగా నచటికిబోయి శ్రీకృష్ణుడు విడిపించి తెచ్చెను. అర్జును డొకసారి యమపట్టణమునకేగి వచ్చెను. కుబేరుడు అలకాపురి పట్టణాధీశ్వరుడై యుండెను. ఆతడు నేటి వైశ్యులకు మూలపురుషుడని శాసనములు వచించుచున్నట్లు లోగడ వ్రాసితిమి. ఇట్లే యింద్ర రాజ్యమునకు సరిహద్దులలో తప్పొప్పులు చేసియు సరిహద్దుల నాక్రమించి యనుమతిలేకుండ రాజ్యమున బ్రవేశించిన వారలను యముడు శిక్షించుచుండెను. అగ్ని వరుణుడు మున్నగువారుగూడ వారి హద్దులలో నట్టిజాగ్రతలు

* వేదములందట్లు గలదు.



గైకొనుచుండిరి. అంతేగాని యమవరుణాదులెచ్చటనో వేరే లోకమునుండి ప్రాణులను తమ తమ జన్మకర్మలనుబట్టి నరకములలో బడవైచి శిక్షింతురను పురాణవాక్యము లతిశయోక్తులేగాని యన్యముగాదు. మామూలు అగ్ని పేరిటనే అగ్నియనువాడు తన యుద్యోగధర్మములు గావించుచుండెను. వారు జీవించియుండిన నరులపైనే శిక్షణాదికార్యములు జరుపుచు వచ్చిరి. గాని చనిపోయిన జీవులపైగాదు. కాని ఖగోళనక్షత్రముల నామకరణములలో వారి జ్ఞాపకార్థముగా యమ, వరుణ నక్షత్రములనిగూడ చెప్పబడియున్నవి. వీనినిబట్టి యవియే జీవులను బాధపెట్టు లోకములని మనవారు తలంచుచున్నారు గాని దానికి జ్యోతిశ్శాస్త్రరీత్యా దృష్టాంతములు లేవు. జీవులు తమతమ మంచిచెడ్డ కర్మలనుబట్టి వారి కనువగు పునర్జన్మములంది వారి పాపపుణ్యముల కనువగురీతిగా నాయాజన్మములలో కష్టసుఖముల బొందుటయు లేక ముక్తులై జన్మరాహిత్యమును బొంది పరమాత్మలో జేరుటయునే మన పవిత్ర గ్రంథములలో దెల్పబడు సారమైయున్నది. ఛాందోగ్య, ఆరణ్యకములలో ఋషులు దీనిని సాంగోపాంగముగ జనక మహారాజువద్ద తర్కించి చెప్పిన దింతే. మొదటియముడు తన సోదరికిచ్చిన వరము మేరకు ప్రతి సంవత్సర మొకదిన మామెయింటి కేగుచుండెను. అదియే నేడు యమవిదియగా పేరొంది పండుగలలో నున్నది. బ్రహ్మ, విష్ణు, యముడు మున్నగు దేవతలను ప్రార్థించిన వారి కా కాలములో ప్రత్యక్షమై వరము లిచ్చుచున్నట్లు చెప్పబడుచున్నది. వీరందరు స్వయముగా వెళ్ళి యోగ్యులైన ప్రజలకు కావలసిన అవసర సహాయము చేయువారేగాని యన్యులుగారని తలంపవలెను. ఇట్టి దేవతలందరును చనిపోయినపిమ్మట వారి పేరిట, నక్షత్రనామకరణమైన పిమ్మట వారిని ధ్యానించి పూజించుచు విగ్రహరూపముననో, మానసికముగనో ఆరాధించిన వారికి, దేవతలకు, మానవులకు సర్వప్రపంచ జీవజాలమునకు ఆధారమైన పరమాత్మయే వారి వారి కోరికలను నెరవేర్చునను ప్రమాణమునుబట్టి దేవతలే తమ కోర్కెల దీర్చుచున్నారను నమ్మక మొకటి యట్టి విశ్వాసులలో ప్రబలిపోయెను. తర్వాత జన్మించిన శ్రీరామ, శ్రీకృష్ణాది మహాత్ముల విషయముగూడ నట్టిదే. వారెప్పుడో పుట్టి గిట్టినవారైనను వారినే భగవంతునిగా నమ్మి ప్రార్థించువారి కా పరమాత్మ యా పూజాపురస్కార బహుమానము లందికొని తగినరీతిని

ఫలములనిచ్చుట భక్తులకు విశ్వసనీయమైన దృష్టాంతముగా నున్నది. యముడు సరిహద్దులలో హద్దుమీరి ప్రవర్తించినవారిని శిక్షించు పద్ధతినిబట్టి చనిపోయిన వారినిగూడ నతడట్లే శిక్షించునను విషయము దర్వాత ప్రచారమయ్యెను. ఇట్టి యూహలే ప్రేతలను గురించి చెప్పుచు వేదములలో జేర్కొనబడెను. జీవులు పితృలోకమునకు వెళ్లునపుడు ముందుగా బలికై యర్పించిన జంతువొకటి వెడలి జీవునిరాకను పితరులకు తెలుపునని అథర్వ వేదమున గలదు. (అ 1-5, 1-8 చూడుడు) ఇది పూర్వకాలపు మూఢ విశ్వాసమును, నాటి ప్రజ లితరచోట్లకు ముఖ్యముగా గొప్పవారికడకు వెళ్లునపు డిచ్చు కానుకల పద్ధతిని పితృలోకవిషయమున దెలుపుచున్నది గాని యితరలోక ప్రసక్తి లేదు. నక్షత్రప్రదేశమే పితృలోకముగను, దాని యధిపతియే యముడుగను ఋగ్వేదాదులలో చమత్కరించిరి.

## మార్కండేయ కథారహస్యము

మార్కండేయుడను ఋషికి 16 సం॥ల యాయుర్దాయము సరిపోగా యముడు తన లోకమునకు గొనిపోవుచుండెననియు భక్తుడగు నా ఋషిని శివుడు రక్షించి, యముని శిక్షించి భక్తునకు పూర్ణాయుర్దాయ మొసగినట్లును పురాణములందు గలదు. ఈ మార్కండేయుడు శివాశ్రమమందు గాని, చేరువలోగాని యున్న శైవుడు. ఇతడు సరిహద్దునిబంధనల నుల్లంఘించి యమునివద్ద కురిశిక్షకొరకై పంపబడియుండగా నా సంగతి దెలిసి శివుడు తన పరివారముతో వెడలి, దానిని ప్రతిఘటించి యాతని మరణమును దప్పించి యుండును. అందువల్లనే అతనికి పూర్ణాయుర్దాయ మిచ్చినట్లు వర్ణింపబడినది. శివుడు హిమాలయములపైని నివసించువాడును, యముడు యింద్రరాజ్య దక్షిణహద్దు పాలకుడును అయినందున నీసంఘర్షణ మీభరత భూమిలో జరిగినదేగాని వేరెలోకమున గాదని తెలుసుకొవదగినది.

## సావిత్రీ సత్యవంతుల కథనము

మార్కండేయుని కథవంటిదే పురాణములందు సత్యవంతుని గూర్చిన దొకటి కలదు. ఇతడరణ్యములందు తన పత్నియగు సావిత్రితో గలిసి సంచరించుచుండగనే ఆయుఃకాలము సరిపోయినందున యముడు స్వయముగా వచ్చి యాతని ప్రాణములను హరించెననియు, సావిత్రి యాతనిని వెంటాడి పతివ్రతా మహత్త్వమున నాతనిని మెప్పించి తిరిగి భర్త జీవములను బొందినట్లును జెప్పబడినది. సరిహద్దులందలి యముని యాధిపత్యములో నున్న యరణ్యములలో సత్యవంతుడు ఆక్రమించి నివసించుచున్నాడను నెపముమీద యముడాతనిని నిర్బంధించి తన పురివరకు గొంపోవగా సావిత్రి యాతని ననుసరించి, ప్రార్థించి, తిరిగి భర్తను విడిపించుకొని వచ్చిన కథయే చమత్కారముగా నట్లు పురాణములందు వర్ణింపబడినది. యముడు సత్యవంతుని జీవములను తీసుకొని మరల వదలియుండుటగాదు. ఖైదీగా గొంపోవబడుచున్న నాతని నిజస్థితిం దెలిసికొని విడిపించెనని యర్థము. ఈ రీతిగా యమున కనేక మహత్తులను, లోకాంతర నివాసమును మనవారు కొన్ని కథలను కల్పించినను అతడుగూడ యింద్రరాజ్య దక్షిణదిక్కు పాలకుడనియు, నచటిపాలకు లనేకులు క్రమముగా నుండియున్నను వారందరిని యములనియే సాధారణముగా పదవినిబట్టి పిలుచువారనియు గ్రహింపదగినది. ఈ యమపదవి మిక్కిలి యోర్పుతోను, ధర్మవిచక్షణతోను నిర్వహింపవలసినదై యుండుటవల్ల నా పదవిలోనివారు యమధర్మరాజులని గూడ పిలువబడుచుండినట్లు స్పష్టము. ఇట్టి యములలో నొకరితో భోగించియే కుంతీదేవి ధర్మసంతానముగా ధర్మరాజును గన్నదను విషయము దలంచుకొన్నచో నిది యర్థమగును. అనగా యముడీలోకవాసియే యని తెలియును. ఇంతియేగాక ధర్మరాజు తన యవసానకాలమున సశరీరముగ మాత్రమేగాక తనను వెంబడించుచున్న నొక కుక్కతోగూడ యముని పట్టణమున కేగినట్లు మహాభారతమున నున్నది. అందుచేగూడ యమ పట్టణము హిమాలయ దక్షిణ ప్రాంతమున నుండగా నచటికి ధర్మరాజు వెళ్ళి చూచినట్లు కనబడుచున్నది. చనిపోయిన జీవుల నత డచట జూచినట్లు వ్రాయబడిన వ్రాతలు కల్పనలుగా దోచుచున్నవి. బ్రదికియుండి యాతనలు బొందువారే యచట నుండియుందురు. ఇహపరలోకాల విషయము దెలుపునపు డీవిషయ మింకను జర్చించెదము. యమ రచితమైన పెక్కు మంత్రములు అథర్వణ వేదముననున్నవి.

## పున్నామ నరకము

ఇది పుత్రులు లేనివారి కేర్పడినదని పురాణములందు వర్ణితము. దీని రహస్యమేమన— ఇంద్రరాజ్యములో నాకాలమున జనులు విశేషించి లేరు. ప్రజావృద్ధి యత్యవసర కార్యమై యుండెను. సంతతిలేనివారి యాస్తిపాస్తులు వారి యనంతరము రాజ్యాధికారికే చెందుచుండెను. అందుచేత సుతులులేని వారికి ముందు గతులు లేవనువాక్యము రూఢియయ్యెను. ఈ బాధ లేకుండ నా కాలపు జనులందరును సంతతికొరకై పెక్కుయత్నము లొనరించువారు. చివరి కేబాపతు పుత్రుడైన నొక్కని గని యాస్తికి వారసుని జేసువారు. ఏ పుత్రుకును లేనివారు యముడు దండ్యులను దండించు నరకములతో తుల్యమైన పున్నామ నరకబాధ ననుభవింతురని గోప్యముగ చెప్పబడినది. ఇట్లే స్త్రీల ప్రసవబాధగూడ గర్భనరకముగా వర్ణించి చెప్పబడినది. ఇతర నరకములన్నియు నా పూర్వకాలములో దండ్యులకొరకై యింద్రరాజ్యములో యేర్పరుపబడిన శిక్షావిధానములేగాని వేరుగాదు.

## దేవతల మొదటి వాసస్థానములు

దేవ, రాక్షస, మానవజాతు లందరును మానవులేననియు, వారివారి గుణములనుబట్టి యట్టి నామము లేర్పడెననియు, దేవతలు సాత్వికసంపన్నులనియు, మానవులు అనగా మనుసంతతివారు రజోగుణులనియు, రాక్షసులు కేవలము తమోగుణవంతులనియు స్పష్టముగా నాయుర్వేదమందు చెప్పబడియున్నది. ఈ విషయ మిదివరలో చెప్పిన చరిత్రలే ఋజువుపరచు చున్నవి. ఇక దేవతార్యులు మొదట నెచట నివసించిరను విషయమై కూర్మపురాణమునుండి యీ క్రింది సంగతులు తెలియుచున్నవి.

హిమాలయపర్వతములలోని నానాశృంగములవద్దను వీరు నివసించుచుండిరి. అందు కైలాసగిరిని శివుడును, ఆయన పరిగణమును, మందాకినీ యనబడు దేవనదియును, శితాంతశృంగమున మధుసూధనాలయమును, విష్ణువును, వసుధారమనుచోట అష్టవసువులును, రత్నసారాగమనుచోట సప్తర్షులును, అచటనే సిద్ధులును, శారదాసహితుడగు బ్రహ్మయు, ఏకశృంగ మనుచోట జైగీషవ్యుడను ఋష్యాశ్రమము, అందనేక బ్రహ్మవేత్తలును, మేఘాచల



మున నింద్రుడును, గజశైలమున దుర్గాదేవియు, సునీలాద్రిని గరుడుడును, త్రిశృంగమున విష్ణు భార్యయగు లక్ష్మియు, సహస్రశిఖరమున విద్యాధరుల యొక్క 8 పురములును, పాండరగిరిపై చిత్రద్రుమ కానన మందు గంధర్వుల యొక్క నూరు పురములును, అందే రంభాది కామినులను, కాముకపర్వతంబున రుద్రభక్తులగు రుద్రుల యనేక నగరములును, పింజగగిరి శృంగమున గణేశులతాలూకు పురత్రయమును, కపిలాచలమున నందీశ్వరపురమును, హంస మహీధరమున సావిత్రీసహితుడైన మరియొక బ్రహ్మాశ్రమమును, దానికి దక్షిణమున సనందనాది సిద్ధులపురమును, పంచశైల శిఖరమున దానవుల పురములు మూడును, వీని సమీపమునందే శుక్రాచార్యుని పురమును, సుగంధ శిలోచ్ఛశిఖరమున ననేక నదులుగల కర్దముని యాశ్రమమును, దానికి దక్షిణ పూర్వభాగమున సనత్కుమార భవనము నున్నట్లును చెప్పబడుచున్నది.

వీనిలో జాలవర కిప్పటికిని నిలిచి హిమవన్నగ పరిసరయాత్ర జేసినవారికి స్పష్టముగా గన్పడునవి విశ్వసింతును. (*) ఆ కాలపు పురములనునవి చిన్న చిన్న గూడెములై యుండునుగాన నవి యిప్పటికి గుర్తుగా నున్నవో లేవో గాని యివియన్నియు పరిశీలించి భూగర్భశాస్త్ర చారిత్రక నిపుణులు వీనిని ధృవపరుపదగినవై యున్నవి. కూర్మ పురాణములోని పైయంశముల వల్ల బ్రహ్మ విష్ణు మహేశ్వర యింద్రాదుల లోకములు వేరుగా లేవనియు, హిమాలయమందలివే నియు స్పష్టము. త్రివిష్టపమున నున్నదని చెప్పబడెడి మందాకినీ యనబడు దేవనదిగూడ హిమాలయమునుండి యుత్పత్తియై కైలాసగిరికి చేరువగానున్నట్లు పురాణములందు వర్ణితమైయున్నదేగాని కొన్నింట వర్ణింపబడినట్లది ఆకాశమునుండి యూడిపడలేదు. అది చాలా యెత్తునుండి అనగా కొండ శిఖరములనుండి ప్రవహించుటచే దానిని వియద్గంగ యనిరి. సనకసనందనాది ఋషులు విష్ణ్వాశ్రమమగు వైకుంఠమున కేగి యచటి ద్వారపాలకుల యభ్యంతరమువలన నిరోధింపబడి, వారిని దూషించి తుదకు అప్పటి విష్ణువుచే మన్ననలందిన కథగూడ విష్ణ్వాశ్రమము వారి స్థావరములకు దగ్గరలోనున్నట్లు ఋజువుపరచుచున్నది. దేవరాష్ట్రములో నేటి యలమంచిలి, పిఠాపురము ప్రాంతములు

(*) కైలాసగిరి, మానససరోవరములు నేటి నేపాలు, టిబెట్టులలో నున్నవి. టిబెట్టు అనునది త్రివిష్టపమే.

గూడ నున్నట్లు పూర్వశాసనములలో చెప్పబడియున్నది. (సముద్రగుప్తుని అలహాబాదు శాసనము మొదలైనవి) దేవతలపేరిట నీ రాష్ట్రమెప్పుడో యేర్పడియుండును.

## దేవత లెచ్చటివారు ?

ఇటీవల పెక్కండ్రు పండితులు దేవతార్య లెచ్చట మొదటి నుండిరను విషయమై యనేక పరిశోధనలు సలిపి నూతనవిషయము లనేకము వెలిబుచ్చి యున్నారు. (See Astrological Magazines of 1948) ఇరాను దేశములో మొదట నివసించిన పర్షియనులు పూర్వీకులకు వీరికి సన్నిహితత్వము గన్పడుచున్నది. వారి యెవెస్తాయను మతగ్రంథములో మన వేదములందలి విషయములు, నామములు కన్పడుచున్నవి. మన యింద్రులలో నొకరితో వైరము వహించిన జరతుష్ట్రియనునతడే యీ మతమునకు మూలపురుషుడు. అతడు మన వేదపురాణములలో నుదాహరింప బడిన అధర్వ వంశీకుడుగా గన్పడుచున్నాడు. అతనికి మన యింద్రునివలెనే మఘవ నామమున్నది. అధర్వనామముగూడ గలదు. అతనితర్వాత 7, 8 మంది జరతుష్ట్రి లాదేశమున జనించినట్లు వారి ప్రాచీన గ్రంథములు తెలుపుచున్నవి. త్వష్టప్రజాపతి పేరొకటి మన పురాణములందు యింద్ర విరోధిగా చెప్పబడినది. సుప్రసిద్ధ పండితుడగు రవీంద్రనాథటాగూరు మహాకవి ఇండో-యిరాను ప్రజలు తండోపతండాలుగా నా ప్రాంతమునుండి మన దేశమునకును, పడమరకును వలస రానారంభించినట్లును పడమరకు వెళ్ళినవారు తమవలెనేయున్న ఏషియా పడమటిజాతులతో క్రమముగా నైక్యమైరనియు వ్రాసియున్నాడు. (✱) లోకమాన్యతిలక్ మహాశయుడు గూడ వైదికవాఙ్మయముకన్న అవెస్తాగ్రంథమున పూర్వకాలపు Advant of the alacical Epoch కు సంబంధించిన ఆధారములు వివరముగా నుండి దానితో సరిపోవుచున్నట్లు వ్రాసెను. అవెస్తాగ్రంథమున గన్పడుచున్న హివస్వంత, హస్తహిందు, మఘవ, ఇంద్ర, అధర్వ, వరుణ, మిత్ర,

(✱) Arctic background of the Aryan religion.



యని మున్నగు ననేక శబ్దములు మన వివస్వంత, సప్తసింధు, మఘవ, ఇంద్ర, అధర్వ, వరుణ, మిత్ర, యను శబ్దములకు సరిపోవుచున్నవి. అందుచే అవెస్తావాఙ్మయమును వేదవాఙ్మయమును సమకాలికములుగా గనబడుచున్నవి. ఒకేజాతి యనుటకు గూడ చాలియున్నవి. మరియొక విశేషము అవెస్తాలో గన్పడుచున్నది. వలసకు బయలుదేరిన ఆర్యులు మొదట 16 శాఖలుగా నుండిరనియు, నందులో పదునైదవశాఖయే హస్తహిందు లేక సప్తసింధు ప్రాంతమునకు వచ్చెననియు వ్రాయబడినది. సుగ్ద, గవ శాఖలు మధ్యఏషియాలోని అక్సను, జక్సార్టెస్ నదులమధ్యకు వెడలినట్లు గూడ వచింపబడినవి. అందుచే సప్తసింధు ప్రాంతమున నివసించిన యార్యులు హిమాలయములమీదుగా వచ్చి కొంతకాలమట నివసించి క్రమముగా సప్తసింధుస్థానమునకు వచ్చినట్లు చెప్పబడుచున్నది. కాని కొందరు పండితులు దీని నామోదించుటలేదు. ఋగ్వేదములోగూడ నొకచోట వీరు ధ్రువస్థానమునుండి వచ్చినట్లు చెప్పబడినది. (ఋ 7-87-7) జరతుష్ట్రి మతస్థులుగూడ మన వేదకాలపు టార్యులవలెనే ప్రకృతిలోని పంచభూతాదులను(Elements) మొదట ప్రార్థించుచుండినట్లు అవెస్తావ్రాతలు ఋజువు పరచుచున్నవి.

ఆర్యులు త్రాగుచుండిన సోమరసలత ముంజవత్పర్వత సన్నిధి నుండినట్లు ఋగ్వేదమున నున్నందునను, భారతముప్రకారము యీ పర్వతము హిమాలయము దాటినతర్వాత నుండినదగుటవల్లను, వీరు మొదట హిమాలయములకు పైన నివసించినట్లుగూడ ఋజువగుచున్నది. (ఋ 10-34-1) ఇదిగాక వీరు చలిదేశస్థులగుటవల్లనే అవసరముకొలది నిత్యాగ్నిహోత్రమును యింట్లలో నుంచి పూజించు వాడుకయు, సోమపానమును కల్గినవని యనేక పండితాభిప్రాయములున్నవి. పురోడాసుడను యింద్రుడొక్కడే 300 కప్పులు లేక గ్లాసుల సోమ మొక్కసారి త్రాగినట్లుగూడ వేదములందున్నది. ఇది నాటి వారికి సోమపానముపైగల యాసక్తియు శరీరస్థితియు దెలుపుచున్నది. (ఋ 8-77-4) దేవతలకు మన సంవత్సరమున కొకరోజు అగునను విషయము గూడ అవెస్తాగ్రంథమున నున్నది. అందుచే వారు మొదట ధ్రువప్రాంతము నుండి వచ్చినట్లూహించుట సమంజసముగనే యున్నది. అధర్వుడు మొదట

మతమునకు బునాదివేసినట్లు ఋగ్వేదమున నున్నది. "యజ్ఞైరథర్వా ప్రథమః పథస్తతే తత" (1-83-5) ఈ అథర్వయే జరతుష్ట్రయని పరిశోధకులు కొందరు నిర్ణయించుచున్నారు. ఈ జరతుష్ట్ర యింద్రప్రార్థనమును నిరసించి కవవంశీకులలో ప్రచారమొనర్చి, యా రాజవంశీకులను వేదమత విముఖులనుగా జేసినట్లుగూడ కనబడుచున్నది. ఋగ్వేదమున దేవతలు కవవంశీకులను అనుసరించరనియు, వారి యనుసర వర్గమునకు దేవతల గొనియాడువారి తృప్తికొరకేర్పడ్డ దక్షిణలు ఒసగబడవనియు గూడ నందున్నది. (ఋ 7-28-9 మరియు 10-107-3) ఇంద్రుని శత్రువులను కవసఖ యని యింద్రులను కవఘ్ని, కవారి, మఘవ యని గూడ ఋగ్వేదమున చెప్పబడినది. ఈ కవవంశీకుల పేర్లనేకముగూడ నందున్నవి. అసురులను దేవతలు ద్వేషించుచుండగా నిక యిరేనియనులు వారిని పూజించుచున్నట్లు కనబడుచున్నది. పైవిషయము లన్నిటినిబట్టియు దేవతార్యులు మనదేశమునకు వచ్చినపిమ్మట గాని పూర్వమేగాని, కొందరు ఇరానులోగూడ నున్నట్లును, తత్పూర్వము ధృవప్రదేశమునుండి క్రమముగా యుత్పత్తియై వచ్చినట్లును తెలుచున్నది. వారిలో వారికి గల మతభేదములచే చీలిపోయిరి. మనదేశమున నుండినతిర్వాతనే కొంతకాలమునకు మతభేదములవల్ల (*) చీలిపోయి యుండురని కొందరు పండితు లభిప్రాయ పడుచున్నారు. ఈ వలసలనుగురించి ముందు నుడివెదము.

## ఇంద్రుడు వర్షముల కధిపతియన నేమి ?

ఇంద్రుడు వర్షముల గురిపించుట కధిపతియనియు, వరుణుడుగూడ జలాధిదేవతయనియు, వారిని ప్రార్థించినగాని వర్షములు రావనియు విశ్వాసమొకటి పురాణములందు చెప్పబడియున్నది. వేదములలోగూడ నిట్లే యున్నది. దాని నిజస్థితి యేమన— బ్రహ్మావర్త దేశమునుండియే నాటి మానవ (మనుసంతతి) రాజ్యములకు నీటిప్రవాహములు రావలెను. హిమాలయమునుండి పారెడి నదీప్రాంతములన్నియు ఇంద్రరాజ్యములో నుండెను. అందుచే యింద్రుని ప్రార్థించిననేగాని అనగా నాతని యనుమతిని పడసిననే గాని యాకాలపువారికి నీటిసౌకర్యములు గల్గకుండెను. ఇంద్రుడు హిమాలయముపై నుండి యచట మేఘములను ఛేదించి వర్షము పడజేయుచుండెను.

(*) అనేక యుద్ధములు జరిగి



యజ్ఞాదులొనర్చి, యింద్రాదులను సత్కరించి వారి యాజ్ఞచేతనే సూర్యచంద్ర రాజులు తమ దేశములలోనికి నదీప్రవాహములను భగీరథ ప్రయత్నమువలె దెచ్చుకొనవలసి యుండెను. ఇంద్రరాజ్యములో నీటిపై యధిపతి వరుణుడను హోదా గలవాడు. ఆతని మెప్పించి యింద్రుని ప్రార్థించి వారికి హవిస్సు లర్పించి నీటి వసతులు గల్పించుకొనుచు నాటి మనుసంతతి మానవులు జీవించుచుండిరి. అందువలననే ఋగ్వేదములో నొకచోట యట్టి కార్యము నడ్డగించుటవలన వృత్రాసురుని వజ్రముతో సంహరించి మనుజులకై యింద్రుడు నీటిని విడిపించెనని వ్రాయబడినది. (ఋగ్వే 1-31 సూక్తం) ఈ యింద్రులలో నొకడు 50 వేల కృష్ణగాత్రులను సంహరించి యార్యవర్ణుల సుద్ధరించిన ట్లొక సూక్తమున నున్నది. వీరు ఆనాటి యాదిమ ద్రావిడులై యుందురు. వారి దుర్గముల నన్నిటిని భగ్నపరచినట్లు గూడ గలదు. ఇతడు తన తండ్రినిగూడ సంహరించినట్లు కలదు. వాల్మీకి రామాయణములో నొకచోట సరయూనది యుత్పత్తిని గురించి చెప్పుచు నది మానస సరోవరమునందలి యొక్క జాలువల్ల నేర్పడినదని చెప్పుచున్నది. ఇట్లే మరికొన్ని గలవు. (*) అయోధ్య రాజధానిగా పాలించిన మనుసంతతి యిక్ష్వాకు రాజుల కిది చాల కీలకస్థానమని చెప్పవచ్చును. దేవతభాగమగు రాజ్యమునుండియే యీ నీటిజాలు అయోధ్యకు రావలసివచ్చుటచేతనే యింద్రప్రార్థనము నొనర్చి యాతని యనుమతి బొంది యాకాలములో రాజులు సరయూనదికి నీటిని తెచ్చుకొనెడివారని మనము గ్రహింపవలెను. ఇదిగాక దేవతలనబడువారు మనువులయొక్క ఆడపిల్లల సంప్రదాయమును. మనువుల మగసంతతివారు సూర్యచంద్రవంశ రాజులును అయియుండి యన్యోన్య బంధువులగుటవల్ల యజ్ఞాదికార్యములలో వారిని (దేవతలను) ఆహ్వానించి సత్కరించుటయు, వారు మానవులకు తమ దేశమున నున్న నీటిని పంపుటయు తన్మూలమున అయోధ్యాదిప్రాంతములలో పంటలు పండించి దేవతలకు హవిర్భాగముగా నీ యిక్ష్వాకువంశము మొదలుగాగల రాజు

(*) ఆ కాలములో హిమవత్పాదని స్రుతలుగా శతద్రూ, చంద్రభాగా, సరయూ, యమునా, రావతీ, వితస్తా, విపాశా, దేవికాకుహూ, గోమతీ, ధూతపాపా, బహుదా, దృషద్వతీ, కౌశికీ, లోహితా నదు లున్నట్లు కూర్మపురాణము నుడువుచున్నవి.

లిచ్చుటయు నాచారమైపోయెను. ఇది పరస్పర సహకారపద్ధతి (Mutual Benifit) గా నేర్పడెను. రాక్షసులు యింద్రరాజ్యము జయించి తీసుకొన్నపుడు వారిట్టి యేర్పాటులను రద్దుపరచుటచే మానవులకు గూడ యిబ్బంది కల్గుచుండెను. అందువలనే దేవతలేగాక, రాక్షసులపైకి కయ్యములు వచ్చినపుడు యిక్ష్వాకురాజులుగూడ తరచుగా పోవుచుండిరి. రాక్షసులకు, యీ రాజులకు నిట్టి పరస్పర సహకారపద్ధతి కుదురకపోవుటవల్లనే హవిర్భాగములు వారికి లేవు. అందుచే రాక్షసరాజ్యము లేకుండుటకే యిరుశాఖలు (దేవమానవులు) ప్రయత్నము చేయుచుండిరి.

ఇంద్రాదిరాజ్యములు క్రమముగా నశించి వారు నీరును సప్లయిచేయు ఆవశ్యకత తగ్గిపోయినను, విశాల భారతిభూమిలో నదివరకే వారిపేరిట (ఇంద్ర వరుణాదుల పేరిట) నక్షత్రనామకరణము ప్రచారములోనికి వచ్చియుండుటలో ఖగోళములోని ఇంద్ర వరుణ నక్షత్రములే నీటిసప్లయికి అనగా వర్షమున కాధారము గాబోలునను విశ్వాసము ప్రబలెను. ఇట్టి విశ్వాసముగల పండితులవల్లనే మన పూర్వపురాణములు సంస్కరింపబడి యిటీవల వ్రాయబడుటవల్ల నట్లే యందందు లిఖింపబడియున్నను, నిజమునకు మాత్రము ఋగ్వేదములో నుడివినట్లు సరయూ మున్నగు నదులకు నీటి సప్లయి చేయుటవల్లనే యింద్రులకే వర్షాధిపతియను బిరుదము గల్గెనని నమ్మవలెను. తర్వాత చాలకాలమునకు తయారైన ఋక్కులలో యింద్రుడే వర్షాధిపతి యని వ్రాయ నారంభించినట్లు తోచును. సూర్యవంశములోని భగీరథుడు గంగను హిమాలయములోని కైలాసమునుండి కొనితెచ్చినట్లు పురాణములందు వర్ణితమైనది. సరయూనదికి జాలువలె నీతడుగూడ మరియొక జాలునుగాని, యా జాలునేగాని గంగకొరకై నిర్మించి దేవతారాజ్యముగుండా దానిని తెచ్చి ఇంద్రునితో తన వంశమువారి కుండవలసిన సఖ్యతను పూర్వమే నిరూపించెను. ఇట్లే సగరచక్రవర్తి కుమాళ్ళు సముద్రమును త్రవ్వి కపిలాశ్రమమువరకు బోయిరని కలదు. ప్రాచీనశాసనములలో గొప్ప చెరువులకు సముద్రములనియే పేళ్లు పెట్టబడియున్నవి. అట్లే సగర కుమాళ్ళు చాల పొడవుగల గొప్పజాళ్ళు త్రవ్వించియుందు రనుటలో నసత్యముండదు. వీరు కపిలాశ్రమము సమీపముగా త్రవ్వినపు డతని కోపాగ్నికి భస్మీభూతులైరని చెప్పబడినది. కపిలాశ్రమము అనగా విష్ణ్వాశ్రమమేకాని



వేరుగాదు. ఇది బదరీనారాయణమందలిది. అచటివరకు వీరు జాళ్ళను త్రవ్వి హిమాలయములనుండి వరుసగా తమ దేశములోని నీటిజాళ్లు వృద్ధిజేయ ప్రయత్నించినట్లు కనబడును. గంగానది విష్ణుని పాదములయం దుత్పత్తియైనట్లును, శివుని నెత్తిమీదనుండి వచ్చుచున్నట్లును చెప్పబడినది. దాని కర్థమేమన— కైలాసగిరినుండి యుత్పత్తియైన యూటలు బదరీనారాయణమందలి విష్ణ్వాశ్రమము ప్రక్కగా ప్రవహించి క్రమముగా దక్షిణభూములకు పారును. భగీరథుడుగూడ శివుని మెప్పించి యీ గంగను తెచ్చినట్లే వ్రాయబడినది. అతడే శివ విష్ణువుల యాశ్రమములలో వారి యనుమతిపొంది వానిప్రక్కగా త్రవ్వించి యింద్రుని సమ్మతిపై యీ జాలును దెచ్చియుండును. ఈ భగీరథుని తండ్రియగు దిలీపుని కాలములో గూడ నీ ప్రయత్నము జరిగెననియు నది పూర్తికాకుండనే యతడు మరణము నొందెననియు చెప్పబడియెను. అతని తండ్రియగు నంశుమంతుని కాలములో గూడ నట్లేయయ్యెను. ఇట్టి ప్రయాసలతో గంగా, సరయూ ప్రవాహములు పూర్వ మేర్పడెను. ఇట్లు నీటిని గురించిన సంబంధమువలన ముఖ్యముగా దేవమానవ సఖ్యము వృద్ధియయ్యెను. అప్పుడప్పుడు వీరిలో వీరికి బంధుత్వములుగూడ నుండెను. అనేకరాజులు బ్రాహ్మణులైపోయిరి. క్షత్రియవంశముల కనేక బ్రాహ్మణులు మూలపురుషులైరి, పురాణములలో నున్న యిక్ష్వాకు మున్నగు రాజుల చరిత్రలుగూడ కొందరు అర్థవాదములను వ్యాజమున నమ్మకపోవచ్చును. ఇక్ష్వాకువంశీకుల యొక్కయు, చంద్రవంశములో ననేకులయొక్కయు పూర్వశాసనము లనేక మిటీవల వెలువడి యున్నందున నా వంశ చరిత్రలన్నియు పురాణములలో గూర్చబడినవి నిజమైన చరిత్రలేయని ఋజువగుచున్నవి. కథలలోని విషయములే అంతరార్థ ప్రతిపాదనలుగా గొన్నిటి విషయమున గనబడుచున్నవి గాని దక్కినవి చారిత్రక విషయములే.

ఇంద్రుడు మొట్టమొదట హిమాలయముపై మేఘాచలమున నివసించుచున్నట్లు కూర్మపురాణమున నున్నది. అచటనుండి త్రివిష్టపమును పాలించు కాలములో హిమవత్పర్వతమున నందుబాటులోనున్న మేఘములను చెదరగొట్టి వర్షము కురియునట్లుగా నితడు చేయుచుండెను. అందువల్లనే యితడు మేఘాధిపతి యనబడెను. క్రమముగా నదులు త్రవ్వబడిన పిమ్మట నీ పని యావశ్యకత తగ్గెను. ఈతని రాజ్యములో 7 నదులు ప్రవహించుచున్నట్లును,

మేఘములను ఛేదించి యితడు వర్షము కురిపించుచున్నట్లును ఋగ్వేద ఋక్కులందు గలదు. ఇప్పుడు మన ప్రభుత్వమువారు గూడ మేఘములను హిమాలయ ప్రాంతమున చెదరగొట్టి కొన్నిచోట్ల అవసరమైనపుడు వర్షము కురిపించుటకు నిపుణులగు శాస్త్రజ్ఞులతో ఆలోచించుచున్నారు. ఇట్టి కార్యము పూర్వకాలములోనే జరిగియుండెనని యిచట మనము విశ్వసింపవచ్చును.

## ఇంద్రుల బ్రహ్మహత్యాదోష పరిహార రహస్యము

మహాభాగవతము ప్రకారము సముద్ర మథనకాలమున వచ్చిన విరోధమున దేవరాక్షస జాతులవారు చాలకాలము యుద్ధములు సల్పుచుండిరి. ఇవి 7 వ మనువు కాలమునరకు కృతయుగమునందు నర్మదాతీరమున వరుసగా జరుగుచు వచ్చెనట. అప్పుడు వృత్రాసురుడు ఆ కాలపు యింద్రునిచే సంహరింపబడెను. ఈ యుద్ధములో ననేకమారులు ఇంద్రుని చేతినుండి వజ్రాయుధము జారిపోగా నా కాలమున మన్నించి వృత్రుడు తనధర్మ యుద్ధనీతిని జక్కగా ప్రకటించెను. ఈ యింద్రుడు తన తండ్రిని జంపినాడని వృత్రుడాక్షేపించెను. దధీచి వెన్నెముకతో తయారుచేయబడిన వజ్రముచే నా ఘోరయుద్ధమున చివరకట్లో వృత్రుని యింద్రుడు చంపెనుగాని యాతనికి బ్రహ్మహత్య జుట్టుకొనెనట. వృత్రుని జంపుట కా కాలమున నసంతృప్తిచే ప్రజలుద్రేకులై యింద్రుని పదభ్రష్టుని గావించినట్లు కనబడును. అందువల్లనే యింద్రుడు మానస సరోవరమునకు బరుగెత్తి యచట కొలనుల మధ్యనున్న పుష్పసమూహములందు కొంతకాలము దాగెను. ఈ కాలముననే యీ రాజ్యమును సూర్యవంశీకుడగు నహుషుడు పాలించెను. ఆతనిని కొంతకాలమునకు సప్తర్షులు రాజ్యభ్రష్టునిచేసి తిరిగి యింద్రునిదెచ్చి రాజ్యమున నిల్పిరి.

బృహస్పతి తనవద్దకు వచ్చినపుడొకసారి యింద్రుడు తగినట్లు గౌరవపూర్వకముగా జూడలేదని యాతడాచార్యపదవిని త్యజించి వెడలిపోయెను. అప్పుడీ యింద్రుడు రాక్షసవంశమునందలి త్వష్టబ్రహ్మ కుమారుడు విశ్వరూపు నాచార్యునిగా గైకొనెను. కాని కొన్నాళ్ళకు అతనిని యోగ్యులగు రాక్షసులకుకూడ హవిస్సుల నిప్పించుచున్నట్లు అనుమానించి కృత్రిమమున రహస్యముగా జంపించెను. దానిని విని యాతని తండ్రియగు



త్వష్ట మిక్కిలి కోపించి యింద్రుని జయింపగల కుమారుడు గావలెనని తపోయజ్ఞము లొనర్చి పైన సుడివిన వృత్రుని గాంచెను. ఈ యింద్రుడు పురందరుడనువాడుగా పురాణములందు జెప్పబడెను. విశ్వరూపు నన్యాయముగా జంపించినందులకు గూడ నాటి ప్రజ లతనిపై గొంత యపరాధము విధించినట్లూహించవలసి యున్నది. ఈతడు తన బ్రహ్మహత్యాపాపమును భూ, జల, వృక్ష స్త్రీజనములయందు పంచినట్లు చెప్పబడినది. ఇది చూడగా నాతడు గొంత యపరాధమిచ్చి దానితో నా కాలములోని భూములను బాగుచేయించుటకును. గొన్ని సరోవరములు నిర్మించుటకు, శుభ్రము చేయుటకును గొన్ని ఫలవృక్షాదులు వృద్ధిచేయుటకును, స్త్రీల యభివృద్ధికై ఖర్చు చేయుటకును, ఒప్పుకొని తన పదవిలోనే యున్నట్లు కనబడును. దీనినే మన పురాణములలో బ్రహ్మహత్యాదోషము పైన సుడివినవారికి పంచినట్లు నిగూఢముగా వ్రాసిరనవచ్చును. ఈ పురందరుడే రెండవసారి జేసిన తప్పువకనగా వృత్రాసురుని జంపిన దోషమునకు పదభ్రష్టుడుగా జేయబడెను. ఈతడాస్థిని రాకుండుటకై మొదటగా అశ్వమేధయాగ మొనర్చి యందరిని సంప్రీతులుగా జేయజూచినను, యతనికి పదభ్రష్టత తప్పక పోయెను. అందుచేతనే యతడు మానససరోవరప్రాంతమున దాగుకొనుట సంభవించెను.

త్వష్టబ్రహ్మ కుమారుడగు వృత్రుడు దత్తపుత్రుడుగా గన్పడుచున్నాడు. ఈతడు పూర్వము చిత్రకేతుడనువాడనియు, శూరసేన దేశపాలకుడనియు త్వష్టయొనర్చిన యజ్ఞమునందు దక్షిణాగ్ని నిదానవయోనిలో బుట్టెనని చెప్పబడియెను. అనగా శూరసేనపాలకుని కుమారు నీత్వష్ట దత్తునిగా స్వీకరించి యింద్రాదులతో వైరమున బగదీర్చుకొన దలంచెనుగాని యా యుద్ధములలో నీ వృత్రుడే చివరకు చనిపోవుట సంభవించెను. ధర్మయుద్ధ మొనర్చి కీర్తిశేషుడైన యీ వృత్రుని పేరిటగూడ నాతడు మరణించిన పిమ్మట నక్షత్రములలో నొకదానికి నామకరణ మొనర్చిరి. చిత్రకేతు మొదటిదేశమగు శూరసేనమున విద్యాధరులు హెచ్చుగా నుండెడివారట. ఆతడుగూడ నా వంశీకుడే యైనట్లు కనబడుచున్నది.

ఈ యింద్రపదవి నందినవా రనేక దుష్కార్యములనుగూడ జేయుచుండిరి. గౌతమఋషికాలపు యింద్రుడు ఆతనిపత్నియగు అహల్య సౌంద

ణమునందు కలదు. ఇచటనే యంధకాసురుని శివుడు సంహరించెను. హిమాలయము చుట్టుప్రదేశములనే మన పూర్వులు ద్వీపములుగా వర్ణించినట్లు కనబడుచున్నది. అందువల్లనే మందరగిరి కుశద్వీపములోనిదనిరి. పంచ నదులలోని జాంబూనదియున్న ప్రాంతమే జంబూద్వీపముగా వర్ణింపబడినది. ఇట్లే తక్కినవియు.

## వే ద ము లు

స్వాయంభువమనువు కాలమునకే కొన్ని ఋగ్వేదఋక్కు లున్నట్లు మనము భావింపవచ్చును. సోమకాసురుడు దొంగిలిన వీ ఋక్కులే. అయినను, ఋగ్వేదములో చాలభాగము తర్వాత చాల కాలమునకు తయారైనది. దీనిలో ఇక్ష్వాకు, పురూరవుడు, పూరువులు, తుర్వసులు, యదువులు, ద్రుహ్యులు, అనువులు, సుదాసుడు, తృత్సువులు మున్నగు యయాతి వంశీకుల విషయములు వ్రాయబడి, వారొనర్చిన యుద్ధప్రస్తావనలం దుండుటవల్ల నా యుద్ధములు జరిగిన తర్వాతనే యా భాగములు తయారైనట్లు స్పష్టము. అప్పటికి ఆంగిరసులు, భృగువంశీకులు, కణ్వులు మున్నగు బ్రాహ్మణవంశములుగూడ యేర్పడినట్లు వానినిబట్టి తెలియుచున్నది. ఈవేదమున పంచనదీ ప్రస్తావము గలదు. పంచనది యనునది మన దేశమునకు నైరుతీదిశలో సరిహద్దు ప్రాంతమున నున్నది. జటోదక, త్రిస్రోతస, వృషధ్వని, సువర్ణ, జాంబూనదులు కలిసి పంచనద మయ్యెను. అచ్చటనుండియే దేవతార్యులు మనదేశములోనికి వచ్చుట నారంభించినట్లు కన్పడును. దేవికానదీప్రాంతమున మొదట మానవుల యుత్పత్తియని భారతమున నున్నది. అది హిమాలయమునుండి వచ్చుచున్న నదులలో నొకటియని పురాణములందు గలదు. దానినుండి యీ పంచనదీతీరమునకు మొదట దేవతలనబడు ఆర్యులు వచ్చినట్లు కనబడుచున్నది. ఈ నదియేగాక ఋగ్వేదమునందు కొన్ని యితరనదులు సరస్వతి, విపాట్ శుతుద్ర మున్నగు సప్తసింధు నదులుమున్నగు నవిగూడ స్తుతింపబడినవి. ఋగ్వేదమందలి చాలభాగము క్రీస్తుపూర్వము 6000 దాదాపు కాలమున రచింపబడి యుండవచ్చును. అప్పటికి మనదేశపువారు అనేక దేవతల నారాధించుచు వచ్చినట్లు కన్పడును. నక్షత్రముల కప్పటికి తమ పూర్వులపేరిట కొంతవరకు నామకరణములు గావించియుండిరి. చనిపోయినవారు యమలోకమునకు వెళ్లుటమున్నగునవి క్రమముగా యూహింపబడినవి గాని యింద్రునివద్ద దక్షిణ దిక్కు పాలకుని యముడని పిలుచుచుండిరి. అతడిచ్చు శిక్షలవంటివే యమలోకమున నుండునట్లు తర్వాత వ్రాసిరిగాని వానికి తగిన ప్రమాణములు కనపడవు.



ఋగ్వేద సూక్తులలో నగ్నిష్టోమములలోను, సోమయాగము లందును గావించెడి ప్రార్థనలు హెచ్చుగా నున్నవి. వీనిలో పరోక్షదేవతలు 22 ను ప్రత్యక్షదేవతలు 11 ను కలిపి నుతించు చుండిరి. వారివందరిని ఆ నాటి యాగకర్తలు ద్రవ్యము, గోవులు, పశువులు, అశ్వములు, సంతానము, వర్షము, అన్నములను కలుగజేయు మనియు, ప్రత్యక్షముగా వాని నిమ్మనియు యింద్రాదులను, సోమము ప్రత్యక్షముగావచ్చి పానముజేసి పొమ్మనియు నా ప్రార్థనలవల్ల గోచరించును. గాని యుపనిషత్తుల కాలమువరకు యజ్ఞయాగాదులొనర్చు పూర్వజను లీ ప్రపంచసౌఖ్యములకొరకై కావలసిన వస్తుసముదాయములను గోరుచువచ్చిరేగాని యమృతత్వమును అనగా ముక్తినిగాని, పరలోక వాసత్వమునుగాని యడుగుచున్నట్లు కనబడదు. అగ్నిమూలమున వ్రేల్చిననేయి, పాలు మున్నగు వస్తువులవల్ల మేఘములకు బలము హెచ్చి, సూర్య, చంద్రాదుల మూలమున వర్షములు పడి, సస్యములు పండి తాము సుఖింపగలమను భావమే ఆ ప్రార్థనలవల్ల గోచరించును. ఐహిక సంపదలను అశ్వినీదేవతలు, ఇంద్ర వరుణాదు లిచ్చుటకై వారికిగూడ హవిస్సులు, సోమములను ప్రత్యక్షముగా నిచ్చుచున్నట్లు వానిలో గలదు. ఆ పనికై యగ్ని యను నొక పురోహితునిగూడ ప్రత్యక్షదేవతల కొఱకు నియమించు చుండిరి పరోక్షదేవతల కిచ్చు ద్రవ్యములు అగ్నియందు ఐడవేయు చుండిరి.

ఈ ఋగ్వేదాది మంత్రములన్నియు యజ్ఞములు చేయించు బ్రహ్మలచే రచింపబడి, యజ్ఞయాగాదులలో పఠించుచుండుటవల్లనే యవి బ్రహ్మముఖముగా వచ్చినవని క్రమముగా ప్రకటితమయ్యెను. ఈ విషయమునే తర్వాత వచ్చిన వేదములందు చెప్పబడెను. ఈ మూలవేదముల కనుబంధములుగా నేర్పడిన ఉపనిషత్తులు, బ్రాహ్మణములు మున్నగునవి చాలకాలము తర్వాత వ్రాయబడినవి. జనకమహారాజు కాలములో ననగాదాదాపు క్రీస్తుపూర్వము 3200 సం॥ల క్రిందట నట్టివి కొన్ని రచింపబడి యుండెను. ఐతరేయ, శత

పథ బ్రాహ్మణాదులు పరీక్షిత్తు జనమేజయాదుల తర్వాత ననగా క్రీస్తు పూర్వము 1850 ప్రాంతమున వ్రాయబడియుండును. వానిలోవట్టి వారిపేర్లు ఉదాహరింపబడి యున్నవి. ఈ వేదములలో నేయే ఋక్కు లేయేఋషులు తయారుచేసి ప్రకటించిరో యట్టివారి వివరములన్నియు వ్రాయబడియున్నవి. అయినను గ్రుడ్డినమ్మిక ముంచువారు మాత్రము అట్టివి వారిచే ప్రకటింపబడె ననియు, మొదట బ్రహ్మనుండి యుత్పత్తియైనట్లును వాకొనెదరు. ఆ ఋష్యాదులుగూడ నాటి బ్రహ్మలలోనివారేయగుట నా మాటల యర్థమును సరిగా నన్వయించుకొనినయెడల సరిపోవునుగాని మూలబ్రహ్మయే రాబోవు వారి చరిత్రయంతయు వేదములలో నిరికించెనని తలంచుట హాస్యాస్పదము. సామవేదములో చాలభాగము ఋగ్వేదములోనిదే. కొన్ని ప్రత్యేక గీతలున్నను మొత్తముమీద నందలి ఋక్కులు ఋగ్వేదాంతర్గతములే. యజుర్వేదము వివిధ యజ్ఞాదులలో జదువబడు మంత్రాదులతో నిండియున్నది. అథర్వణవేదము మనకు కావలసిన వైద్యాదులు, దైవప్రార్థనలవల్ల రోగాదులు బోగొట్టుకొనుట, శత్రునిర్మూలనకై ప్రార్థనలు, అభిచార కర్మలు మున్నగునవి చెప్పుచున్నవి. ఈ వేదములో కొంతభాగము భారతయుద్ధమైన పిమ్మటనే వెలసినట్లు కనబడును. అప్పటివరకు మూడు వేదములనియే యొక్కువ ప్రచారము గ్రంథములలో నున్నది, భారతమున నట్లే కలదు. అయినను అథర్వయను నొక ఋషి వైవస్వతమన్వంతర కాలీనుడని చెప్పబడుచున్నందున నిందలి కొన్ని మంత్రములు క్రీ.పూ. 6650 సం॥ల క్రిందట రచింపబడియుండును. అతని పేరిటనే వేదము వెలసియుండును. అథర్వనామమునకు మనదేశస్థులేగాక యిరానులోని పర్షియా మతస్థులగు జరతుష్ట్రమతస్థులుగూడ గౌరవమునిచ్చి యీ మతగురువునకు అథర్వనామమును వారి మతగ్రంథమగు అవెస్తాలో చెప్పుట జూడగా అథర్వయను ఆదిపురుషుడొకడీ యిరుతెగలవారికి పెద్దయైయుండి గౌరవనీయుడుగా నున్నట్లు కనబడుచున్నది. ఋగ్వేదములో నీ యథర్వను నుతించుచున్న యొక ఋక్కు కనబడుచున్నది. (ఋ 1-88-5) జరతుష్ట్ర కథర్వనామ ముండుటవల్ల నతడే మొదటియార్యుల మతకర్తయని కొందరు పండితులు నిర్వచించుచున్నారు. ఎంతమంది యథర్వనాములు గలరో వారిలో నెవడు మొదటికర్తయో మన మిపుడు చెప్పజాలము. అట్లే యే యథర్వపేరిట నాల్గవవేదము ఆరంభింప



బడినదోగూడ సరిగా నిశ్చయింపలేము. ఋగ్వేదఋక్కులలో గొన్ని పరశురాముని తండ్రి జమదగ్ని వ్రాసినవికలవు. ఋగ్వేదాంతమున శ్రీరామునికథ యున్నది. అందుచే నా భాగములు క్రీస్తుపూర్వము 8100 ప్రాంతమున రచింపబడినట్లు కనబడుచున్నది. ఛాందోగ్యోపనిషత్తులో ఘోర అంగీరసునివద్ద శ్రీకృష్ణుడు పురుషవిద్య నుపదేశము బొందుట గలదు. అందుచే నా బ్రాహ్మణములు క్రీ.పూ. 1900 ప్రాంతమున వ్రాయబడినట్లు స్పష్టము. ఈ రీతిగా ఋగ్వేదమును, దాని శాఖలగు బ్రాహ్మణములు, ఉపనిషత్తులును క్రీ పూ. 7850 ప్రాంతమునుండి క్రీ. పూ. 1900 వరకు రచింపబడినవి. ఇవి యొక్కరివల్లగాక యనేకులగు ఋషులవల్ల నల్లబడిన మంత్రములనియు, వానిలో నుదహరింపబడిన ఋషులే యా మంత్రములు జెప్పిన వారనియు నెరుంగనగును. ఈ రీతిగనే దక్కిన వేదముల విషయమునని తెలియవచ్చును గాన విస్తరించుట లేదు. క్రీ. పూ. 7700 — 6650 సంవత్సరముల మధ్య దాదాపుగా నివసించిన కర్దమకుమారి చిత్తికిని అథర్వయను నాతనికిని జనించిన దధీచియే ఆశ్వినీ కుమారులకు బృహదారణ్యకమును బోధించెను. వైవస్వతమన్వంతరమందున్న యొక బ్రహ్మ కుమారుడగు అథర్వ ముండకోపనిషత్తును బోధించెను. అందుచే నీ బోధ క్రీ పూ. 6650 కాలమునాడు పుట్టియుండును. బృహదారణ్యకము బుట్టినకాలములోనే యీ దధ్యఙ్ ఙ్ ఋషి పిప్పలాదునకు జెప్పిన బోధయే యీశావాస్యఉపనిషత్తు ఈ పిప్పలాదుడు జెప్పినదే ప్రశ్నోపనిషత్తు. ఇది దానితర్వాత 50 సం॥ల లోపుననే రచింపబడియుండును. ఇక బ్రాహ్మణములలోని యైతరేయమునందు హరిశ్చంద్రుని కథ వర్ణితమగుటవల్ల నది తర్వాత వ్రాయబడినట్లు స్పష్టము. అది భారతయుద్ధమైన పిమ్మట రచింపబడెనని లోగడ తెలిపితిమి. ఈ కథలలో కొన్ని యితర ఋషులు వ్రాసి, అవి పూర్వపురుషుల బోధలని తెలియుటకే వారిపేర్లతో జెప్పి యుందురు. అందుచే నవి వాస్తవమున నెప్పుడు రచింపబడినవో నిర్ణయింపవలెనన్నచో భాషాపరిశోధనమునగాని చేయుటకు వీలుగాదు, గాని వేదములలో క్రీ.పూ. 7800 సం॥ల క్రిందట మొదలు భారతయుద్ధమువరకు గల కథలు చేరియున్నవనుటలో నసత్యములేదు.

## వేదకాలపు ప్రాచీనకవులు

క్రీ. పూ. దాదాపు 7888 సం॥ల క్రిందట స్వాయంభువమను వుండెనని లోగడ కనుగొంటిమి. అప్పటికే కొన్ని ఋగ్వేదఋక్కులున్నట్లు తెలియుచున్నది. ఈ ఋక్కులు కేవలము దేవతలను స్తోత్రముజేయుటకై యావాటి ఋషులు రచించుచుండెడివారు. ఋగ్వేదములో ననేకఋషులీ ఋక్కులను రచించుచున్నట్లు చెప్పబడియున్నది. క్రీ. పూ. 6850 ప్రాంతీయులగు శుక్రుడును, బృహస్పతియు కవులని లోగడ కనుగొంటిమి. క్రమముగా వారు దేవతలై గ్రహముల నామములకు కారకులైరి. వీరుగాక విశ్వామిత్ర పుత్రుడగు మధుచ్ఛందసుడు, వానికొడుకు జేత, కణ్వపుత్రుడగు మేధాతిథి అజీగర్త పుత్రుడగు శునశ్శేపుడు, ఆంగీరస పుత్రుడగు హిరణ్యస్తూపుడు, ఘోరపుత్రుడగు కణ్వుడు, కణ్వపుత్రుడగు ప్రస్కణ్వుడు, ఆంగిరసుని కొడుకగు సవ్యుడు, నోధస్సు లేక నోధసుడు, పరాశరుడు, (శక్తిపుత్రుడు) రహూగణపుత్రుడగు గోతముడు, అంగీరసపుత్రుడగు కుత్సుడు, మరీచి పుత్రుడగు కశ్యపుడు, వృషాగిరుని పుత్రులగు ఋజ్రాశ్వాదు లైదుగురు, దీర్ఘతముడు, అతని పుత్రుడగు కక్షీవంతుడు మొదలగువారు ఋగ్వేద ప్రథమ మండలమందలి ఋక్కులనేకము రచించినట్లు కనబడుచున్నది. దీర్ఘతముని కొడుకు ధన్వంతరి. వీరిలో కొందరు క్రీస్తుపూర్వము 5000 — 2000 సంవత్సరముల మధ్యవారైనట్లు, మరికొందరింకను పూర్వీకులైనట్లు మన కాలనిర్ణయమునుబట్టి చెప్పవచ్చును. ఆ కాలమునకే వైదికభాషలో వారారితేరి గీతములల్లు నేర్పుసంపాదించి ఋషులనబడుచుండిరి. ఈ గీతములన్నియు దేవతాస్తోత్రములే నని లోగడ చెప్పితిమి. గాని యందులో ప్రత్యక్షనాయకులగు యింద్రుడు, అశ్వినులు మున్నగువారిని గురించిగూడ యనేక ప్రార్థనములున్నవి. నాల్గు వేదములందును ఋక్కులల్లుచుండిన యీ కవుల పేర్లనేకము గలవుగాని వాని నన్నిటినిందు జెప్పుటలేదు. వీరు ఆ కాలపు వేదభాషలో అనుష్టుప్పు, జగతి, గాయత్రి, అసురి మున్నగు చందస్సులను తమ గీతములందు వాడుచువచ్చిరి. వేదార్థములను చక్కగా తెలియని కొందరా ఋక్కులన్నియు బ్రహ్మముఖము నుండి యూడిపడ్డట్టు భావించుచు, నీ కవుల నామములందు స్పష్టముగానున్న విషయము నేడు



మరచుచున్నారు. కొందరు వారు చేయు అగ్నికార్యములలో ఆహుతులవల్ల కలిగే యగ్నినుండి యీ వేదశబ్దము లేర్పడెనని భావించెదరు. ఇవియన్నియు భ్రాంతిమూలములే గాని నిజముగాదు.

## దక్షయజ్ఞ ధ్వంసము - శివపూజా రహస్యము

మనము సూక్ష్మముగా విచారించిన నీ దక్షయజ్ఞ రహస్యము బైటబడును. దక్షుడు మొదటి ప్రజాపతులలోనివాడు. శివుని కీతడు మామ. శివుడు ఈతని కుమార్తె సతీదేవినేగాక మరీచి కుమార్తె పూర్ణిమకు జనించిన గంగనుగూడ చేసుకొని యుండెను. అందుచే దక్షునకీ యల్లునిపై నంత ప్రేమలేదు. దక్షుని యజ్ఞమే మొట్టమొదటి క్రతువులలోనిది. దక్షుడు పెద్దవాడైన పిమ్మట నాతని కుమారుడగు ప్రాచీన బర్హి రాజుగనుండు కాలములో నిది జరిగెనట. ఆ కాలములో రాక్షసవర్గమువారు శివు నారాధించుచుండిరి. ఇది దేవతలకు బ్రహ్మలకు కష్టముగ నుండెను. ఏలన రాక్షసులను వారు కలుపుకొన దలచలేదు. హిరణ్యకశ్యపుడు, జలంధర, అంధకాదులు చివరకు రావణుడు మొదలగు రాక్షసులుగూడ శివునే కొల్చుచుండినట్లు పురాణములందున్నది. ఋగ్వేదమున = మం 7–21–5 సూక్తమునందు (శివలింగమును గురించియే యనవచ్చును.) శిశ్నదేవుని గొల్చు ఆర్యులు కొందరుండినట్లును, వారిని మిగత దేవతార్యులు దూషింతురనియు జెప్పబడినది. ఈ లింగపూజ మొదట ద్రావిడజాతులలో నేర్పడి క్రమముగా దేవతార్యులకుగూడ ప్రాకినదని యొక యభిప్రాయమున్నది. ఈ శివుని భార్య గంగ పేరిటనే గంగానది త్రవ్వబడినది. లింగపూజను శివునారాధించువారు శివునకంటగట్టి శివలింగపూజగా మార్చిరి. ఇట్లు శివుడు ఆ గణమునకు నాయకుడగుటవల్ల దక్షాదులకు యిష్టము లేకుండెను. దక్షుడీ ఆరాధకులను త్రోసివేయుమని చెప్పుటకే శివునికడ కేగగా నాతడీ, సంగతి గ్రహించియే మౌనము వహించె ననవచ్చును. అందులకు కినిసి దక్షుడు తిరిగివచ్చి తన యజ్ఞమునకు శివుని బిలువక పోయెను. సతీదేవి యీ యజ్ఞమునకు పిలువబడకుండగనే యేగి యవమానమొంది యచటనే యసువులబాసెను. ఈ సంగతి విన్న శివగణము (ప్రమథులు) వారందరును వీరభద్రుని యాధిపత్యమున బయలుదేరి దక్షయజ్ఞ ధ్వంసము గావించి, దక్షుని, ఆతని యనుచరు

లగు యితర దేవతాద్యులను శిక్షించి, ముమ్ముందు తమ గురువగు శివునికి ప్రతి యజ్ఞమునందు భాగార్హత యుండునట్లు శాసించి తిరిగి వచ్చిరి. ఈ శివుడు పిమ్మట హిమవంతునికి మేనకయందు జనించిన దుర్గాదేవిని పెండ్లాడెను. అప్పటినుండి శివారాధనగూడ యజ్ఞములందు జరుగుచుండెను. రాజులు మున్నగువారు స్వయముగా నీ దేవతలను బిలుచుచున్నను, రాను రాను, యిట్టి యజ్ఞాములలో ప్రత్యక్షముగా శివ, విష్ణు యింద్రాదులను స్వయముగా పిలువలేనివారు వారి ప్రతిమలను పూజించుచు, వారి కర్పించిన ద్రవ్యములను అచట వేదబుక్కులు పఠించు బ్రహ్మల కొసంగుచు వచ్చిరి.

ఈ యాచారమే మనమిప్పుడు అన్ని కర్మకార్యములందును చేయుచున్నాము. పూర్వము పితృకార్యములలో ఆహ్వానింపబడిన దేవతలు స్వయముగానే వచ్చెడివారనియు, దర్వాత కొంతకాలమునకు వచ్చుట మాని వేసిరనియు, మనవారు పరంపరా జెప్పుకొనెడి దీకారణమువల్లనేనని గ్రహింపవచ్చును. చనిపోయినవారు సూర్యచంద్రాదిలోకముల దాపున నొక లోకములో నుందురను విశ్వాసమును, వారికి అగ్నిముఖముగా మన ద్రవ్యము లియ్యవచ్చునను విశ్వాసమును మన పూర్వులలో ప్రబలినపిమ్మట నీ కర్మకాండ లన్నిటియందును, వారికి జెందు పదార్థములును, అగ్నికి ప్రీతియగు నేయి లేక నూనెలును, కట్టెలు, పాలు, ధాన్యాదులు, మరికొన్ని సుగంధ ద్రవ్యాదులును వ్రేల్చు నాచారమేర్పడినట్లు కనబడుచున్నది. అశ్వినులకు మొదట యజ్ఞయాగములందు భాగార్హతలేకుండగా చ్యవనఋషి యిప్పించెను. రుద్రుడు వైద్యుడని తైత్తిరీయమున నున్నది.

## బ్రహ్మ, విష్ణు, మహేశ్వరాదుల పరీక్ష

భృగుమహర్షి యితర దేవతారుషి సంఘములచే ప్రేరితుడై బ్రహ్మ, విష్ణు, రుద్రులలో నెవడుత్తమదేవుడను విషయము నిర్ణయించుటకై వెడలి వారల బరీక్షించెననియు, ఆ పరీక్షలో బ్రహ్మ, రుద్రులు సంపూర్ణ సాత్వికులుగా గన్పడలేదనియు, నప్పటి విష్ణువుమాత్రము భృగువుచే దన్నబడినను కోపముజెందక తన ప్రశాంతతకు క్షమార్పణ జెప్పుకొని సాత్విక సంపన్నుడని ఋజువుపరచుకొనినట్లును ఒక కథ పురాణములందు గలదు. ఈ కథ బ్రాహ్మణప్రభావమును బోధించుటకుగాను కల్పింపబడక నిజమైన కథయే



యగునెడల, నాటి ఋషుల పలుకుబడిని, త్రిమతకర్తల నెట్టి పరీక్షలతో నాడు చూచుచుండినదియు మనకు స్పష్టపడుచున్నది. సూక్ష్మముగా విచారించినచో నీ మర్మము దెలియుచున్నది. ఇందలి విష్ణుభార్య శ్రీదేవి యీ భృగుని కుమార్తెయే. అందువల్లనే విష్ణువు తన మామయైన భృగువు కోపమునకు కారణ మెరుంగజాలక శాంతత్వము వహించినట్లు గన్పడును. ఆ శాంతమే యాతని కుత్కృష్టత గల్గించెను.

మరియొకసారి యీ మతకర్తలలో మొదటి యిర్వురిలో నొకరికన్న నొకరధికులమని ప్రచారము జేసుకొనుచు వైరములు పెంచుకొన్నట్లొక కథ గలదు. లింగరూపుడగు శివుని యంతు కనుగొనజాలక బ్రహ్మ, విష్ణువులు ఉండగా శివుడువచ్చి యిర్వురు సమానులేయని తగవు దీర్చినట్లు లింగపురాణమున గలదు. యజ్ఞుడను విష్ణువు హిరణ్యాక్షుని సంహరించి రుధిరము ద్రావి మత్తుడై జగముల గలంచుచుండగా శివుడొకసారి నీతి గరపెనట. మరియొకసారి నృసింహుడగు విష్ణువునకు వీరభద్రుడు నీతి గరపవలసి వచ్చెను. ఆతడు దానిని దిరస్కరించగా నాతడు నృసింహోగ్రమును శరభరూపమున నణగగొట్టెనట.

ఒకసారి యింద్రుడు శివుని దర్శనమునకు వచ్చెను. అప్పుడు వాకిట నుండిన ప్రమథగణేశుడు వెంటనే పోనీయలేదు. ఇంద్రుడు తొందరించెను. వాడు లోనికి పోనీయనందున యింద్రు డాతనిని వజ్రముతో గొట్టెనుగాని యా వజ్రము విరిగిపోయెను. ఇంతలో శివుడు వచ్చి చూచి యింద్రుని మిక్కిలిగా కోపించెను. అంతట యింద్రుడు క్షమార్పణ జెప్పుకొని వెడలి పోయెను.

జలంధరాసురుడు దిగ్విజయ మొనరించి దేవరాజ్యము హరింపగా విష్ణువు జలంధరాసురునితో బోరి జయింపలేక యతనిభార్య బృందను ఆమె భర్తవేషమున వెళ్ళి చెరచివచ్చెను. ఇది తర్వాత తెలుసుకొని బృంద శపించెను. అనగా హెచ్చుగా తిట్టెను. తర్వాత జలంధరుడు యీ మతస్థానము లుండ రాదని శివాశ్రమమునకు గూడ దండెత్తెను. ఆతనికి శివుడు పరీక్షార్థమై యిచ్చిన చక్రముచేతనే యతడంతట మరణించెను. ఈ రీతిగా శివ, కేశవుల చరిత్రలనేకము పురాణములందు వర్ణితమైనవి. వానిని జదివినవారి కాయా

కాలములలో గల మతకర్తలగు శివ కేశవు లనేక యకార్యము లొనర్చినట్లు తేటబడును.

ఇట్టివానిలో బ్రహ్మ విష్ణు మహేశ్వరు లొకనాటివారు, అత్రిఋషి భార్య అనసూయవద్దకేగి చేసిన కృత్రిమపరీక్ష యొకటి. వీరు ముగ్గురును ఆమె రూపమునకు ముగ్ధులై కామించి అతిథులవలె చూడబోయిరి. ఆమెను చూచినదానికి తృప్తిపడక సర్వాంగములనుగూడ చూడవలెనని తలంచి, యతిథులైన తమకు వివస్త్రగా వడ్డింపుమని కోరిరి. మర్మమెరుగని యిల్లాలది వారి పద్ధతి గాబోలని తలంచి యట్లే చేసెను. చివరకామెను జూచి లజ్జించి వారిగుట్టును వెలిబుచ్చిరి. అంతట నామె వారిని శిక్షింపనెంచగా, వారి పత్ను లదివిని వచ్చి తమకు పతిభిక్ష పెట్టుమని ప్రార్థించి, వారి భర్తలను విడిపించుకొనిపోయిరట. నేటి కుహనా వేదాంతయోగపరులు చేయు యకృత్యములే పూర్వకాలమున గొందరు చేయుచుండిరనుట కిది యొక నిదర్శనము. కాని బ్రహ్మ, విష్ణు, మహేశ్వర హోదాలలో నుండిన వారందరు పూర్వ మట్టివారు కాదనియు, సాధారణముగా వారు ప్రజా శ్రేయోభిలాషు లగుటవల్లనే వారి కీనాటివరకు నున్న గౌరవము కల్గెననియు విశ్వసింపవలయును. భాగవతమునందు అత్రిమహాముని తపమునకు మెచ్చి వరము లిచ్చినందున త్రిమూర్తుల అంశలవల్ల యనసూయకు చంద్ర, దత్తాత్రేయ. దూర్వాసులు ముగ్గురు జనించినటు చెప్పబడినది. దీనినిబట్టి వీ రనసూయను బొంది ధర్మసంతాన మిచ్చిరనుటకు గూడ అవకాశముగలదు. వీ రనసూయను కామించి చూడబోయిన కథగూడ దీని కనుగుణ్యముగనే యున్నది. అత్రిఋషి రాక్షసులచే బంధింపబడిన కాలమున నిది జరిగియుండవచ్చును. రుద్రులు వైద్యవృత్తిచే జనుల మన్నన లందుచుండిరి.

## మరికొందరు యింద్ర, విష్ణువుల పాలనలు

ఇంద్రులయొక్కయు, విష్ణువవతారములుగా భావింపబడిన కొందరి వృత్తాంతమును లోగడ తెల్పితిమి. మొదటి స్వాయంభువుమనువు కాలములో యింద్రుడుగా నుండినట్టియు, ఆతని కూతురగు ఆకూతిరికి జన్మించినట్టియు సుయజ్ఞుడు అప్పటి లోకముల నార్తిని హరించినందున మను వాతనని హరి



యని శ్లాఘించగా నతడుగూడ నొక విష్ణువవతార మయ్యెనని భాగవతము పలుకు చున్నది. అట్లే యీయన మరియొక కూతురు దేవహూతికి జనించిన కపిలు డొక విష్ణువయ్యెనని లోగడ వ్రాసితిమి. ఇట్లే అత్రికుమారుడగు దత్తాత్రేయుడు గూడ విష్ణ్వవతారముగా భావింపబడెను. సనకసనందనాదులు నల్వురు గలిసి విష్ణుస్థాన మాక్రమించి విష్ణువులైరి. ధర్మునకు దాక్షాయణియైన మూర్తి వలన జనించిన నరనారాయణులను తపసులుగూడ విష్ణువులైరి. ఈ రీతిగనే ధృవుడు, పృథుడు, ఋషభుడు, పరశురామ, శ్రీరామ, ధన్వంతరి. శ్రీకృష్ణ, బలరామ, వ్యాస, బుద్ధులు, కల్కి మున్నగువారు విష్ణ్వవతారములుగా నెన్నబడిరి కాని వీరందరును వైకుంఠములోని వైష్ణవస్థాన మాక్రమించినట్లు కనబడదు. వీరుగాక, రాబోవు మనువులను జెప్పుచు వారిక్రింద నున్న యింద్ర, విష్ణువులను పురాణములలో జేర్కొని యున్నారు. ఈ మనువుల జన్మాదులను బట్టి వారుగూడ పూర్వము జనించి నశించినవారే ననియు, వారిపేరిట మన్వంతరా లేర్పడెనని లోగడ వ్రాసితిమి. వారి కాలములో నుండిన రాజులు, దేవతలు, సప్తర్షులు, ఇంద్ర, విష్ణువులు నట్టివారుగానే మనము భావింప వలసి యుండును. ఆ ప్రకారముగా చూచినచో నీ క్రింది పట్టికలోని వారు ఆ యా కాలములలో ఇంద్ర, విష్ణు సప్తర్షి స్థానములలో (రాజ్య సలహాసంఘము) నున్నట్లు మనము విశ్వసింపవలెను. ఇంద్రుడన మేఘములు మాత్రమే కాదనుటకు ఆధారము లున్నవి. అత డార్యులకు సప్తసింధులో నివసించుటకు భూము లిచ్చెనని చెప్పెడి ఋగ్వేదసూక్త మొకటి కలదు. (ఋగ్వే. మండ iv-26-2) ఈతని పురోహితుడగు బృహస్పతి ఆంగీరసుల సాయముతో బలాసురుని సంహరించినట్లును ఆంగీరసులు 10 మాసముల సత్రయాగ మొనర్చుచున్నట్లు గూడ ఒక ఋక్కులో నున్నది. (iv-50-5) వరుణుడు వసిష్ఠుడు కలసి సముద్రప్రయాణ మొనర్చినట్లు ఒకదానిలో నున్నది. (ఋగ్వే మం॥ 7-88-3) ఇవియన్నియు బరిశీలించినపుడు వేదార్థములను జెప్పువారిలో చాలమంది ఇంద్రుడన మేఘములకు లేక సూర్యున కర్థముజెప్పి యట్లే వరుణాదులనుగురించి చెప్పుటు నిజచరిత్రను తారుమారొనర్చుచున్నారని తెలియగలదు. ఇట్టి దృష్టాంతము లనేకము లోగడ వ్రాసితిమి. దేవరాజ్యము సరయూ, సింధు, సరస్వతీ నదులమధ్య సప్తసింధు అనే ప్రదేశముః వృద్ధి

| మనువులు | రాజులు | ఇంద్రుడు | విష్ణు | సప్తర్షులు |
| --- | --- | --- | --- | --- |
| సూర్యసావర్ణి కాలమున | నిర్మోహ విరజాదులు | బలి | సార్వభౌముడు (వేదగుహ సరస్వతులకుతుడు) | పరశురామ, అశ్వత్థామ, కృష్ణ, బాదరాయణ ఋష్యశృంగాదులు |
| దక్షసావర్ణి కాలమున (వరుణుని కొడుకు) | ధృష్టకేతు, దీప్తకేతు మొదలగువారు | అద్భుతుడు | అద్భుతుడు (ఆయుష్మంతునకు అంబుధారకు జనించెను) | ద్యుతిమంతుడు మొదలగువారు |
| బ్రహ్మసావర్ణి కాలమున (ఉపశ్లోకుని కొడుకు) | భూరిషేణాదులు | శంభుడు | విభుడు లేక విష్వక్సేనుడు (విశ్వసృజునికివిషూచికి జనించెను) | హవిష్మతాదులు |
| ధర్మ సావర్ణి కాలమున | సత్యధర్మాదులు | వైధృతుడు | ధర్మసేతువు (సూర్యకుమారుడు) | అరుణాదులు |
| భద్రసావర్ణి కాలమున | దేవవదుపదేవదేవ శ్రేష్టాదులు | ఋతు ధాముడు | స్వధాముడు (సత్య తపస్సూనృతుల కొడుకు) | తపోమూర్తి తపాగ్నిధ్రుకాదులు |
| దేవ సావర్ణి కాలమున | చిత్రసేన, విచిత్రాదులు | దివస్పతి | యోగవిభుడు (బృహతికి దేవహోత్రకు జనించెను) | నిర్మోహ, తత్వదర్శి మొదలగువారు |
| ఇంద్రసావర్ణి కాలమున | గంభీరవస్యాదులు | శుచి | బృహద్భానుడు (సత్రాయణునకు వితానకు జనించినవాడు) | అగ్నిబాహు, శుచి, శుక్ర, మాగధాదులు |



జెందినట్లు ఋగ్వేదఋక్కులనుబట్టి గ్రహింపవచ్చును. (మం 6. 8 మరియు 10 చూడుడు) పురోదాసుడను నొక యింద్రుని గురించి లోగడ వ్రాసితిమి. ఇంకను శృంగవృషుని కొడుకొక యింద్రుడున్నట్లు సామవేదమనుచున్నది. (2-2) ఇందు 9డీ బ్రహ్మాండమునకంతటికి, నసేక సూర్యగ్రహములకు గూడ కారణ భూతుడని కొందరు ఋషులు పరమేశ్వరునిగా, సృష్టికర్తగా స్తోత్రము జేసిరి.

ఈ పట్టికను జూచినచో భావికాల పాలకులు రక్షకులనుపేరిట పూర్వపు యింద్రులను, విష్ణువులను మన పురాణములలో కొందరిని చెప్పినట్లు స్పష్టము. ఈ భావికల్పనము గ్రంథముల కపూర్వత గల్గించుటకేనని తెలియు వలయును. ఇందు చెప్పబడిన బలి, అద్భుతుడు, శంభుడు, వైధృతుడు, ఋతుధాముడు, దివస్పతి, శుచి యను యింద్రులు వరుసగా 7 వ మనువు కాలములోని పురందరుని తర్వాత దేవరాజ్యపాలన గావించినవారై యుందురు. భాగవతాది పురాణములనుబట్టి వామనుని కాలమునుండి విష్ణువు యీ యింద్రులపై క్రమముగా సంపూర్ణ ఆధిపత్యమును వహించి అవసరమైనపుడు యింద్రపదవి కర్తలను నియమించుచు, వారిపై యధికారము చలాయించుచున్నట్లు కన్పడును. ఈ యింద్రులు తల్లిదండ్రుల వారసత్వముగా యిక్ష్వాకు వంశీకులవలె బొందక అర్హతగలవారే వచ్చుచున్నట్లు కనబడుచున్నది. ఇట్లే విష్ణువులుగూడ నసేకమంది వచ్చుచున్నట్లు పై పట్టిక తెలుపును. విష్ణుస్థానమును, ఇంద్రస్థానమును ఒక్కడే యొక కాలమున పాలించుచున్నట్లు అద్భుతుని యుదాహరణ వలన గోచరించుచున్నవి. పీరేగాక సరికొందరు యింద్రులపేర్లు మనకు నిఘంటువులందు కానవచ్చుచున్నవి. అమరకోశములో యింద్ర నామములను చేర్కొను శ్లోకమిట్లున్నది—

"ఇంద్రో మరుత్వాన్ మఘవాన్ బిడౌజః పాకశాసనః
వృద్ధశ్రవాః సునాశీరః పురుహూతః పురందరః
జిష్ణుః లేకర్షభః శక్రః శతమన్యుః దివస్పతిః
సుత్రామా గోత్రభిద్వజ్రీ వాసవో వృత్రహావృషః॥"

ఇందలి బిడౌజ, వృద్ధశ్రవ, సునాశీర, పురుహూత, లేకర్షభ, శుక్ర, వాసవ, వృత్రహా, వృష నామములు కొన్ని కాలములలో పాలించిన ఇంద్రుల

నిజనామములైనట్లు కనబడుచున్నది. శక్రాది నామములు కొన్ని ఋగ్వేదమున చాలచోట్ల నున్నవి ఇట్లే భారతయుద్ధమువరకు ననేక యింద్రులు పాలించినను, వారి యందరిపేర్లు కాలగర్భమున బడిపోయినవి. ఇక బలివద్ద విష్ణువు మూడుపాదముల భూదానము గ్రహించెననుటకు భూమ్యాకాశ, వాయుప్రదేశములను ఆక్రమించుటయే విష్ణువు 3 పాదములతో నాక్రమించెనను అర్థముగా భావింపవలయును. విష్ణువులలో వామనుని తర్వాత సార్వభౌముడు, అద్భుతుడు, విభుడు లేక విష్వక్సేనుడు, ధర్మసేతువు, స్వధాముడు, యోగవిభుడు, బృహద్భానుడు అనువారు వచ్చి యా స్థానపదవి నలంకరించి దేవరాజ్య రక్షణ కార్యమున నప్రమత్తులై మెలంగుచు నింద్రులను రాజులను నియమించుచు, వారిని దమ చేతిక్రింద నుంచుకొని దేవతలకందరికిని పూజనీయులైపోయినట్లు కనబడును. అందువలనే నేటికిని మన దేశములో యింద్రపూజకన్న విష్ణుపూజ ప్రాముఖ్యత నందియుండుటకు హేతువు. బలిచక్రవర్తికి కొంతకాలము తర్వాత నింద్రపదవిని తాత్కాలికముగ నిచ్చి గౌరవించినట్లు కనబడుచున్నది. అంతవరకతడు సుతలమున నున్నట్లు భాగవతమున జెప్పబడినది. ఇక రుద్రులు, వారి సంతతి మరుత్తులు యింద్రునకు ముఖ్యాంగులుగా నుండి రనవచ్చును.

## దేవాసురుల యుద్ధములు

దేవరాజ్యమునందు అసురులకు దేవతార్యులకు ననేక యుద్ధములు క్రీ పూ. 7800 ప్రాంతము నుండియు జరిగెను. ఇవి క్రమముగా మనుసంతతి రాజులలోని సూర్య చంద్ర రాజులకు గూడ వ్యాపించెను. సూర్య చంద్ర వంశ రాజులు కొందరీ యుద్ధములందు దేవతార్యులకే సాయపడుచుండిరి. దేవతార్యులలో వారిలోవారుగూడ కొన్ని వేళల పోరాడి విడివడిపోవుచున్నట్లు ఋగ్వేదములోని 5, 6 మరియు 10 మండలములు జదివినవారికి తెలియగలదు. ఫణులు కవివంశీకులు మున్నగువారిట్లు విడివడినవారే. ఈ దేవాసురుల యుద్ధములందు ముఖ్యమైనవానిని గొన్నింటి నిచట నుదాహరింతును.

1. మందరగిరి మథనకాలమున జరిగినది. దేవతలీ యుద్ధమున చెట్లనుండి తీయబడిన సుధను సేవించి రాక్షసులను జయించిరి. చాక్షుషమన్వంతరమున నిది జరిగెనట. అందుచే నిది దాదాపు క్రీ. పూ. 6950 ప్రాంతములో



జరిగినట్లు చెప్పవచ్చును. అజితుడను విష్ణువు కూర్మమువలె నటించి మొదట దేవ రాక్షస సఖ్యత చేకూర్చిన దీగాలమే. ఈ విష్ణువు మోసపుచ్చెనని తర్వాత రాక్షసులు విడిపోయి యుద్ధము సల్పియుండిరి.

2. వృత్రాసురయుద్ధము— దీని విషయము ఋగ్వేదమం దనేక ఋక్కులలో నున్నది. ఇంద్రు డితనిని జంపి సప్తసింధు ప్రాంతమునకు వచ్చు 7 నదుల ద్వారములను తెరచి నీరు పంపెను. (ఋగ్ 1-32) ఇవి హిమాలయముపై నుండును. ఈ కాలమున పర్వతములు చలించుచు, భూమి కంపించుచు నుండెడిదట. (ఋ 2) ఈ వృత్రుడు సర్పముగా వేదములందు వర్ణింపబడినాడు.

3. సోమకాసురయుద్ధము— ఇతడు వేదములను మాయోపాయమున హరించి సముద్రమున దాగుకొనగా విష్ణువు మత్స్యమువలె నీటిలోనికి బోయి యాతని జంపెను.

4. హిరణ్యాక్షయుద్ధము— ఈతనిని వరాహమువలె బురదలోదిగి విష్ణువు సంహరించెను. హిరణ్యాక్ష తంత్రమను వైద్యగ్రంథము గూడ నితని పేరున కలదు.

5. హిరణ్యకశ్యప యుద్ధము— ఉగ్రనారసింహుడై విష్ణువితని జంపెను. ఈ యసురుడు వైకుంఠమునుగూడ లూటీ చేసియుండెను.

6. త్రిపురాసురుల యుద్ధము— విద్యున్మాలి, తారకాక్షుడు, కమలనాభుడను మువ్వురి పురములను దహించి, శివుడు వీరలను జంపెను. వీరు కైలాసగిరికి కూడ దండెత్తి యా మతస్థానమును నశింపుజేయుటకు ప్రయత్నించిరి. వీరి నగరము లిప్పటికి ఉత్తర హిందూస్థానమున నున్నవి.

7. అంధకాసురయుద్ధము } వీరినిగూడ శివుడే సంహరించెను. జలంధ
8. జలంధరాసురయుద్ధము } రుని పేరిట నిప్పటికిని జలంధర నగర

మున్నది. ఇట్లే అంధకాసురుని పేరిటగూడ కలదు. ఈ యుద్ధములన్నియు క్రీ. పూ. 7800—6750 సం॥ల మధ్య జరిగియుండును.

9. ఋషభుని కుమారుడగు భరతుని కాలమున జరిగిన యుద్ధము— ఇందలి రాక్షసులపేర్లు తెలియవు. ఈ యుద్ధములో భరతుడు దేవతలకు సాయపడెను. ఇదిగూడ క్రీ. పూ. 6650 లోపున జరిగినదే.

10. చంద్రవంశమునందలి రజికాలమున జరిగిన యుద్ధము— ఈ యుద్ధమునందు రజియు, ఆతని కుమాళ్ళును యింద్రునికి సాయపడిరి. రజికాలమంతయు యింద్రునికి, రజికి స్నేహముగా జరిగెను. కాని రజి కుమాళ్ళు యింద్రరాజ్యముగూడ తమకే కావలెనని చెప్పి యింద్రుని తొలగించి పాలించనారంభింపగా, నాతడు చివరకొక యుపాయమున మారణహోమ మొనర్చి వారిని జంపి రాజ్యమేలెను. చంద్రవంశావళిని బట్టి ఇది దాదాపు క్రీ. పూ. 6000 సం॥ల నాటిదని చెప్పవచ్చును.

11. ఖట్వాంగుని కాలమున జరిగిన యుద్ధము — ఈ యుద్ధములో ఖట్వాంగుడు దేవతలకు సాయపడినందులకు మెచ్చి, యాతనికి జ్యోతిష శాస్త్రప్రకార మాయుర్దాయమును గురించి దేవతలు చెప్పిరి. ఆ యుద్ధములలో ప్రాయశః చాల గాయములు తగిలియుండినందున అతనికి 7 రోజులలోనే మరణమున్నదని చెప్పగా, నాతడా కాలములోనే భక్తిగల్గి తరించెను. వంశావళినిబట్టి ఈ యుద్ధము క్రీ. పూ. 8600 సం॥ల నాటిదిగా కనబడుచున్నది. ఇతడా యుద్ధములో దెబ్బలవల్ల మరణించియుండును.

12. కకుత్స్థుని కాలమున జరిగిన యుద్ధము— ఇందు కకుత్స్థ డింద్రునిపై నెక్కి రాక్షసులను జయించెను. ఇది క్రీస్తుపూర్వము 6550 ప్రాంతమునాటిదనవచ్చును.

18. బలిచక్రవర్తితో జరిగిన యుద్ధము— దీనిలో నింద్రాదు లోడిపోయిరి. బలికానాడు భృగువంశీకులు సాయపడియుండిరి, వామనుడు తర్వాత బలివద్ద యుక్తిచే రాజ్యమును దానముగాగొని యింద్రుని కొసగి బలిని పాతాళదేశమునకు బంపివైచెను. ఇది వైవస్వతమను కాలములో జరిగినందున క్రీ. పూ. 6700 నాటిదగును.

14. కువలయాశ్వుని కాలపు యుద్ధము— దీనిలో ధుందుడను రాక్షస సంహారము జరిగెను. ఇది క్రీస్తుపూర్వము 6100 నాటి దనవచ్చును.

15. భరతుని కాలపు యుద్ధము— ఇది దుష్యంతి కుమారుడగు భరతుని కాలములో జరిగినది. త్రిపురనగరమున కొందరు రాక్షసులు వసించుచు నచట దేవతలను ఖైదీలుగ నొనరించగా భరతుడు వెడలి వారి నోడించి, వారిని రసాతలమునకు బంపి, వారిచే చెరయం దుంచబడిన దేవకన్యల నెక్కాండ్రను విడిపించెను. ఇది దాదాపు క్రీ. పూ. 5000 ప్రాంతమగును.



16. శంబరాసురయుద్ధము— దివోదాసునికొరకు యింద్రు డీతనితో యుద్ధమొనర్చి 99 నగరములు నాశనమొనర్చెనని ఋగ్వేదము 2 వ మండలమున గలదు. ముద్గలుని కుమారుడు దివోదాసుడు. అతని సోదరియే యహల్య. ఈమెకు యింద్రునికి సంబంధమున్నది. దీనినిబట్టియు, ముద్గలుని వంశావళినిబట్టియు నీ కాలము క్రీ పూ. 3150 నాటిదిగా గనబడుచున్నది. ఈ ముద్గలుని కాలమున నీ రాక్షసులు గోవులను దొంగిలించుచుండగా నాతడును భార్యయు గలిసి వారిని తరిమివైచినట్లు ఋగ్వేద 8 వ మండలమున నున్నది. ఈ శంబరుడును, ఆతని సహచరుడగు తిమిధ్వజాసురుడును పోరాడుచుండిన కాలములోనే శ్రీరాముని తండ్రియగు దశరథు డింద్రునకు సాయముగా వెడలినట్లు వాల్మీకిరామాయణమున గలదు. అహల్య శ్రీరాముని కాలమునాటిదనియు నామెకు భర్తకు నెడబాటుగా నుండగా శ్రీరాము డరణ్యవాసములో సఖ్యత కూర్చినట్లుగూడ నందున్నది. వీనినిబట్టి యీ యుద్ధకాలము క్రీ. పూ. 3150 నాటిదని ధృవపడుచున్నది. ఋగ్వేదములోని యా ఋక్కులా కాలము తర్వాతనే వ్రాయబడినట్లు ధృవపడుచున్నది.

17. కృష్ణదస్యుని యుద్ధము— అంశుమతి యనబడు యమునా తీరమున నీ దస్యుడు 10 వేల మందితో నుండగా నాతనిని గర్భవతులగు భార్యలతో గూడ నింద్రుడు జంపెనని ఋగ్వేదము 8 వ మండలమున గలదు. ఇది ఋజ్రాశ్వునికి సాయముగా నొనర్చినది. ఇదియు, పిప్ర, శుష్ణ, వంగృద కరంజ, పర్ణయ, అంహోరక్కసుల పోరాటములును దాదాపు పైకాలము నాటివే ననవచ్చును. వీనినన్నిటిని ఒకే ఋషి వర్ణించినాడు. వంగృదుని కోలూరు 100 నగరములు గూడ నింద్రుడు స్వాధీనము జేసుకొనెను. (ఋ 1-10-58 మం. 8)

18. శ్రీరాముని కాలపు యుద్ధము— తాటకిసంహారము మొదలుగొని శ్రీరాముడు కబంధ, ఖరదూషణ, రావణ, కుంభకర్ణాదులను సంహారించెను. వీనిలోగూడ యింద్రాదులు లోపాయకారీగా రామునికి సహాయపడుచు వచ్చిరి. వీరు రావణసంహారకాలమున నచటికి వచ్చియుండిరి. ఇది క్రీ. పూ. 8100 ప్రాంతమున జరిగెను.

19. శ్రీకృష్ణకాలపు యుద్ధములు— శ్రీకృష్ణుడు బాణ, నరకాసుర, జరాసంధ, శిశుపాల, దంతవక్త్రాదులతో జరిపినవి. దేవతాపక్షము వహించియే శ్రీకృష్ణుడు వీనిని జరపియుండెననవచ్చును. అప్పటి మతప్రవక్తలలోని శివుడొకడు బాణునికి సాయపడి శ్రీకృష్ణునితో తారసిల్లి యుండెను. ఇంద్రప్రేరితుడై కృష్ణుడు నరకుని జంపినట్లు విష్ణుపురాణమున నున్నది.

20. కాలకేయ నివాత కవచాదుల యుద్ధము— ఇంద్రుడు వీరిని జయింపలేక నర్జునుని సాయమును గోరగా నాతడు వారలను సంహరించెను. ఈ యుద్ధములు క్రీ. పూ. 1950 ప్రాంతమున జరిగినవి.

ఇట్టివింక ననేక ముండవచ్చునుగాని గ్రంథవిస్తరణభీతిని భావి పరిశోధకులకు వదలుచున్నాను. ఇంద్రుడు జంపిన మరికొందరు రాక్షసుల నామములను లోగడ తెలిపితిని. కవి వంశీకులు మున్నగువారింద్రునితో మొదట సఖ్యముగానుండి క్రమముగా విడిపోయినట్లు ఋగ్వేదము 10 వ మండలమున నున్నది. అట్టివారితో నెన్ని యుద్ధములు జరిగియుండెనో చెప్పజాలము, సుశ్రవసుడను రాజుతో 20 రాజులు 60 వేల సైన్యముతో పోరునకు రాగా నింద్రుడు సాయపడి యాతని గాపాడెను.

## త్రిశంకు స్వర్గము – విశ్వామిత్ర సృష్టి

లోగడ స్వర్గమన్న నెచటనో ఆకసమున లేదనియు, భూమిపైగల దేవతా రాజధానియే యనియు దెలుసుకొంటిమి. దీనిలోని సౌఖ్యమునుబట్టి యానాటి కవులు ఖగోళమందలి సూర్యాదిస్థానములకుగూడ దానిని పోల్చి యుండిరి. ఇక విశ్వామిత్ర సృష్టిలో తల్లక్రిందుగా స్వర్గమున త్రిశంకు వ్రేలాడుచున్నట్లు వ్రాయబడిన పురాణగాథ యంతరార్థము గ్రహింతము. త్రిశంకు బొందితో స్వర్గమునకేగు యాగము జేయింపగోరగా వశిష్టు డంగీకరింపక కోపించి శపించగా, నపుడా త్రిశంకు బహిష్కృతుడైనట్లును, అప్పుడాతని యాగమును విశ్వామిత్రుడు చేయించుచుండెననియు, వశిష్ట శాపమునకు వెరచి దేవత లెవ్వరును దానికి రాకపోయిరనియు, అయినను విశ్వామిత్రుడు యాగము చేయించి స్వర్గద్వారముపరకు బంపగా నచటివారు వసిష్ట శాప భయముచే లోనికి రానీయక నెట్టివేసిరనియు, నందుచే విశ్వామిత్రుడు వేరుగా స్వర్గమును, దిక్పాలురను, సప్తఋషులు మున్నగువారి నందరి నేర్ప



రచుచుండగా బ్రహ్మాదులు వచ్చి యా పని మాన్పించిరని యా కథలో నున్నది. త్రిశంకునకును వశిష్టునకును వచ్చిన తగాదాలో యింద్రాది దేవతలు వశిష్టపక్షము వహించి త్రిశంకును, అతని రాజ్యములోనివారిని దేవతా రాజ్యములోనికి రాకుండ కట్టడజేసిరి. దానిపై నా యజ్ఞమును ధిక్కరించి విశ్వామిత్ర సహాయుడై త్రిశంకు స్వర్గరాజ్యమున బ్రవేశింపబోగా నాటంకపెట్టబడెను. అందువల్ల విశ్వామిత్రుడు కక్షబూని ఇంద్రరాజ్యమునకు ప్రతిగా నా రాజ్యములోనే మరియొక పోటీరాజ్యమును నెలకొల్పుటకై యన్ని యేర్పాటులును చేయగానే బ్రహ్మాదులు భయపడి రాజీకి వచ్చి యా పని మాన్పించి, ఆక్రమించినంతవరకా దేవరాజ్య భాగమును త్రిశంకున కిచ్చి యింకను ఆక్రమించకుండా పోరు మాన్పిరి. దేవరాజ్యములోని వస్తువులను త్రిశంకురాజ్యమునకు దిగుమతి కాకుండా వారు మొదట చేసినందులకు విశ్వామిత్రుడు నూతనవస్తువులను త్రిశంకుదేశమున బండించుచు, ఇతరరాజ్యములనుండి తెప్పించుచు, వానిని దేవరాజ్యమునకు బంపకుండ జేసెను. అందువల్లనే నేడు ధాన్యాదులలో గన్పడు కందులు, వేరుశనగలు మొదలైనవన్నియు విశ్వామిత్రసృష్టి యనెదరు. విశ్వామిత్రుడు దక్షిణదేశవాసియు, మొదట ద్రావిడులలోని వాడుగా కన్పడినను, పురాణములందాతడు చంద్రవంశీకుడుగనే చెప్పబడినాడు. ఈతనిని బ్రహ్మలలో గలుపుకొనుటకు ఋష్యాదు లనేక తంత్రములుపన్ని యడ్డుపెట్టుచు వచ్చిరి గాని తుదకీతని సమర్థతయే నితని కాపదవి నిచ్చినది. ఈతడు నిర్మించిన త్రిశంకు స్వర్గముగూడ అమరావతికి చేరువనే యిప్పటికిని నుండవచ్చునని మా విశ్వాసము. ఈ త్రిశంకు చనిపోయినపిమ్మట నాతని పేరిట యొక నక్షత్రము పేరుబెట్టి దానిని వ్రేలాడుచున్న త్రిశంకుస్వర్గ మనుచున్నారు.

## వైతరణీనదీ యుత్తరణము

చనిపోయిన జీవులు స్వర్గమునకు బోవు మార్గమున వైతరణీనదిని గోవు తోకను బట్టుకొని దాని సహాయమున దాటవలెననియు, దాని [illegible]కర్మల కాలములో వారి వారసులు గోదానమొసంగి స్వర్గపాథేయమును దానమిచ్చిన యెడల జీవులు స్వర్గము జేరుదురనియు జెప్పబడుచున్నది. ఈ రహస్యమును దెలుసుకొందము.

వైతరణీనది యుత్కలరాష్ట్రమునందు ప్రవహించుచున్నది. నేటికి నచట నాభీగయాళీలనువారు వసించుచు నా యేటియొడ్డున చనిపోయిన జీవులందరును పడియుందురనియు, దమకచట గోదానము సువర్ణసహితముగా నిచ్చినయెడల నా గోవును నదిలో దాటించునపుడు జీవులు దానితోకయందలి వెంట్రుక కొకరుచొప్పున దానమిచ్చు వారి పూర్వీకులందరును స్వర్గమునకు జేరుదురనియు నమ్మించి యమాయక ప్రజల ధనమును విరివిగా దోచుకొనుచున్నారు. పూర్వము దేవరాజ్యమునకును, మనుసంతతి రాజ్యములకును నీ నది సరిహద్దుగా నుండెను. దేవరాజ్యములో పౌరసత్వ హక్కులు గల్గి, యచటి స్వర్గమున నివసించి, యచటి సుందరకన్యల పొందు (ఇదియే రంభాసంభోగము) గోరువారు యజ్ఞయాగాదు లొనర్చి యీ దేశపువారిని తృప్తిపరచవలసి యుండెను. * మహారాజులగు వారిట్లు చేయుచున్నను, సామాన్యజనులకు వైతరణీనదిని దాటునప్పు డొక గోవును స్వర్గరాజ్యమువారి కిచ్చువారి కట్టి పౌరస్వత్వ హక్కులు నొసగబడుచుండెను. నేటి పిఠాపురము, యలమంచిలి ప్రాంతములుగూడ దేవ రాష్ట్రములోనివని శాసనములందు గలదు. స్వర్గరాజ్యమున గోవులు తక్కువగా నుండుటవల్లను, మానవరాజ్యములలో దండకారణ్యమునుండి సంపాదించిన గోవులు హెచ్చుగానుండుటవల్లను,యీ నియమ మేర్పరచబడినట్లు కనబడుచున్నది. స్వర్గరాజ్య మచ్ఛస్థితిలో నున్న కాలమున నిట్లు బ్రదికిన వారికి వైతరణీనది దాటి స్వర్గమున నివసించు హక్కు యీయబడుచున్నను క్రమముగా దాని ప్రతిభ తగ్గి నశించినను, దాని ప్రచారకులుగా నున్న గయాళీలుమాత్ర మా పనియం దారితేరియున్నందున నేటికి నా పని సాగించుచున్నారు. చనిపోయిన జీవులుగూడ నా వైతరణీ నదియొడ్డున బడియుందురనియు, నచట గోదానమిచ్చినచో నది వారిని స్వర్గమునకు జేర్చుననియు క్రమముగా కల్పించి బ్రదికినవారికి ప్రత్యక్షముగా రంభాసంభోగములు గల్గు నవకాశము తగ్గినకొలదిని దానిని విరమింపజేసినట్లు కనబడును. స్వర్గ రాజ్యము ఇంద్రుని పాలననుండి తప్పిపోయి యనేక రాజ్యములుగా చీలి

* కక్షీవంతుడనువాని కింద్రుడు వృచయ యను కన్య నొసంగినట్లు ఋగ్వేదమున గలదు. (మం. 1–10)



పోయిన పిమ్మట ననగా క్రీ. పూ. 1800 తర్వాత నిచటి కుతంత్రకోవిదులగు గయాళీలు చనిపోయినవారి కట్టి హక్కులు గల్పించి, పురాణాదులలో నిరికించిరి. గయా మాహాత్మ్యమంతయు నిట్టివానితో నిండి, దక్షిణమునుండి యచటి కేగినవారిని పూర్తిగా దోచుటకై యేర్పడిన తంతుగా గనబడుచున్నది. అచటి తంత్రములన్నియు నిచట విస్తరింపజాలము. (కాశీయాత్ర చరిత్ర — ఏనుగుల వీరాస్వామిగారి రచితము చూడుడు)

ఈ గయాళీల తంత్రములను దెలుసుకొన్న మిగతదేశపు వైదిక బ్రాహ్మణులుగూడ వాని నాధారము జేసుకొని వారుగూడ చనిపోయిన జీవులే కోరికతో నుందురో దాని కనువగుచోటులనే బునర్జన్మ నొందుదురను దానిని బట్టి తామే స్వర్గమునకు బంపెదమని కొన్ని మంత్రములు కల్పించుకొని యపరకర్మల కాలములో వైతరణీనది యచట లేకపోయినను మంత్రములతోనే వైతరణీనదిని దాటుటకై గోదానమును బరిగ్రహించుచు, స్వర్గమునకు బంపు స్వర్గపాథేయమను దానముగూడ స్వీకరించి, యమాయక ప్రజలను నమ్మించి మోసపుచ్చుచున్నారు. నిజమునకీ స్వర్గ మెచటగాని యిప్పుడు లేదనియు, పూర్వము ప్రత్యక్షఫల మాసించియే మన పూర్వులిట్టి దానము లిచ్చుచుండిరనియు దమ పూర్వులకీ ఫలము లేకపోయెనే యని చింతించువారి కొరకదిగూడ నేర్పరచి యుందురనియు విశ్వసింపవలసి యున్నది.

## శిబిచక్రవర్తి కథారహస్యము

పైన నుడివిన విషయములే గాక దేవ, మానవ రాజ్యములకు సంబంధములైన కథలు కొన్ని నిగూఢముగా పురాణములందు చెప్పబడినవి. అట్టివానిలో శిబిచక్రవర్తి కథ యొకటి. ఈతడు నేటి బెలూచిస్థానములో గొంత దేశము నేలుచుండెడివాడు. ఇతని పేరిట శిబినగరము కట్టబడెను. ఇది సరిహద్దు రాష్ట్ర మగుటచే నింద్రరాజ్యమున కాయువుపట్టయ్యెను. ఈతడు దీనికి స్నేహితుడుగా నుండినదియు లేనిదియు నిర్ణయించుటకై యింద్రు డొకసారి పరీక్షార్థమై యతని కడకు దన సరిహద్దు పాలకుడగు అగ్నితో నరుదెంచెనట. వీరిద్దరును డేగ, పావురము యాకారములతో నాతనికి గన్పడి నట్లును అందలి పావురమును డేగ తన యాహారమునకై జంప నుద్య

మింపగా, దానిని వారించి, శిబి తన మాంసమే కోసి యొసంగగా దేగరూపమున నున్న యింద్రుడు మెచ్చి యాతని కోర్కెలనిచ్చి వెడలిపోయినట్లును ఆ కథ తెలుపుచున్నది. దీని యంతరార్థము గ్రహింపదగియున్నది. బెలూచిస్థానములో ముఖ్యమైన స్థానమును శిబి పాలించు కాలములో నింద్రుడు వచ్చి ప్రార్థించిన మీదట కొన్ని కీలకస్థానములను ఇంద్రునికి శిబి యొసంగగా, నాతడు తృప్తుడై, యాతనితో సఖ్యము నెరపుచు, తన రాజ్యమును విదేశవాదుల భయము లేకుండ గాపాడుకొనుచు వచ్చినట్లు కనబడుచున్నది. ఈ కథ చారిత్రకముగను, నైతికమును, ధార్మికముగను ఉండునటుల పురాణములలో నిగూఢముగ జిత్రింపబడినది. శిబి యొసంగిన కీలకస్థానములను మరల నాతని స్వాధీనములోనే యుంచి యింద్రుడు వెడలిపోయిన కథనే మార్చి, శిబి తన మేని కండలనే డేగయగు యింద్రునకు కోసి యిచ్చినట్లు చమత్కారముగా నుడువబడినది. పురాణములలో నెట్టి నిగూఢ కథనము లుండునో దీనిని బట్టి తెలిసికొన వచ్చును.

## దధీచి కథా రహస్యము

ఇంద్రుడు వృత్రాసురుని సంహరించుటకై దధీచి వెన్నెముక వడుగగా యొసంగినట్లు గల కథయొకటి పురాణములందున్నది. దీని నిజమైన గుట్టు ఋగ్వేదమున గానవచ్చుచున్నది. ఈ దధీచి చనిపోయిన పిమ్మట నితని యెముకలు కురుక్షేత్రము చివరనున్న శర్యణావతి సరస్సు యొద్దున బూడ్చి పెట్టబడెనని సామవేదమున నున్నది. ఆ యెముకలతో నాటి ఇంద్రుడు తన యాయుధమును చేయించుకొని 810 మందిని చంపినట్లు చెప్పబడినది. వజ్రాయుధము విరిగిపోయినప్పుడెల్లను, ఆ యెముకలు దానికి తగినవని తలంచి తెప్పించి చేయించుకొనుచు వచ్చినట్లు కనబడును. అంతేగాని బ్రదికి యుండగానే దధీచి యెముకల నిచ్చెనన్న కథ యతిశయోక్తిగా పురాణములందు జెప్పబడెననవచ్చును. ఈ దధీచి అశ్వినీదేవతలకు గొన్ని యుపదేశము లొనర్చినట్లు చెప్పబడుటవల్ల నీ కాలము క్రీ. పూ. 6650 నాటిదగును. ఆ కాలము తర్వాతనే వృత్రాసురవధ జరిగియుండును. కాలనిర్ణయమును బట్టి అప్పటి యింద్రుడు పురందర నాముడే యైనని తోచుచున్నది.



## దేవ మానవ బంధుత్వములు

మను సంతతిలో నాడపిల్లల సంతతివారు దేవతలైరనియు, మగపిల్లల సంతతివారు మానవులనబడి రనియు వీరి కన్యోన్య స్నేహసంబంధ మున్నట్లును లోగడ తెలుసుకొంటిమి. దేవరాక్షస యుద్ధములందు మానవరాజులు సాయపడుచు వచ్చిన వివరములు గూడ తెలుసుకొంటిమి. ఇక వారిలో గల్గిన బంధుత్వముల గొన్నింటి నిట నుదాహరింతును.

(1) ఋషభుడు ఇంద్రకుమార్తె జయంతిని పెండ్లాడెను.
(2) చంద్రవంశజుడగు పురూరవుడు దేవకన్య ఊర్వశిని పెండ్లాడెను.
(3) పురుకుత్స మహారాజు నాగకన్య నర్మదను వివాహమయ్యెను.
(4) విశ్వామిత్రుని తాత బ్రహ్మదత్తుడు – ఈతని తండ్రి చూళి యనువాడు గంధర్వకన్య ఊర్మిళను పరిణయ మయ్యెను.
(5) బ్రహ్మదత్తుడు కుశనాభరాజు కన్యలను పెండ్లాడెను.
(6) తృణబిందుడను రాజు అలంబుసయను దేవకన్యను వివాహమయ్యెను.
(7) వీరికి జనించిన యిలబిలకు విశ్రవసుని వలన కలిగిన కుబేరుడు యక్షుడనబడి యక్షులకు రాజయ్యెను.
(8) వత్సుడను చంద్రవంశీకుడు మిశ్రకేశియను అప్సరసను పెండ్లి గావించుకొనెను.
(9) ఇంద్ర, యమ, వాయు మున్నగు దేవతలు భారతయుద్ధకాలపు కుంతీదేవితో సఖ్యము నెరపి ధర్మసంతానముగా ధర్మజ భీమార్జునాదులను గనిరి.
(10) అర్జునుడు నాగకన్య ఉలూపిని పెండ్లాడెను.

ఈ విధముగా దేవ మానవ సఖ్యము పెంపొందెనని నుడువవచ్చును.

## ఇంద్ర రాజ్య విస్తీర్ణము

టిబెట్టు ప్రాంతము మొదలు సప్తసింధు, గయా ప్రాంతముల వరకును, చివరకు దేవరాష్ట్రముగా శాసనములందు నైతము పేర్కొంటిన పిఠాపుర ప్రాంతము వరకును యీ యింద్రరాజ్యము ఆ యా కాలములలో వ్యాపించినట్లు ప్రాచీన పురాణ వేదవాఙ్మయములను బట్టి నిర్ణయింపబడు చున్నది.

వీనిలోగల శౌరసత్వాది రహస్యములు, రంభాసంభోగాదులు, యజ్ఞయాగాది క్రతువుల రహస్యము, మత కర్తలే రాజ్యరక్షకులుగా గూడ వ్యవహరించుట, స్వర్గభోగాదులు మున్నైనవి లోగడ తెలుపబడినవి. ఈ రీతిగా మహాభోగ మనుభవించిన యింద్రరాజ్య ప్రభ క్రమముగా తగ్గిపోయి భారతయుద్ధానంతరము వరకు నామమాత్రముగా నుండెను.

## కొందరు దేవతార్యుల నామములు

దేవాసురుల మొదటి యుద్ధములందు పేర్కొన్న వారి నామములు కొన్ని మనకు పురాణములందు గలవు. వారిలో సమదీటులగు వారి పేర్లు చెప్పబడినవి. మొదటి యుద్ధమునందు అనగా మందరగిరి మథనకార్యమున యింద్రుడు బలితోను, గుహుడు తారకునితోను, వరుణుడు హేతితోను, మిత్రుడు ప్రహేతితోను, యముడు కాలనాభునితోను, విశ్వకర్మ మయునితోను, త్వష్ట శంబరునితోను, సవిత విరోచనునితోను, పరాజితుడు నముచితోను, అశ్వినీదేవతలు వృషపర్వునితోను, సూర్యుడు లేక వివస్వంతుడు బలిసుతులగు బాణాది పుత్రశతముతోను, సోముడు లేక చంద్రుడు రాహువుతోను, అనిలుడు పులోమునితోను, భద్రకాళి శుంభ నిశుంభులతోను, వృషాకపి జంబునితోను, విభావసుడు మహిషునితోను, బ్రహ్మపుత్రులు ఇల్వల వాతాపులతోను, కాముడు దుర్మర్షణునితోను, మాతృకాగణము ఉత్కలునితోను, బృహస్పతితో శుక్రుడును, శనైశ్చరుడు నరకునితోను, మరుత్తులు నివాతకవచులతోను, వసువులు, అమరులు కాలేయులతోను, విశ్వేదేవతలు పౌలోములతోను, రుద్రులు క్రోధులతోను పోరాడుచుండినట్లుగా భాగవతాది గ్రంథములందున్నది. వీరి కాలమునకే నక్షత్ర నామకరణమయ్యెనో లేదో తెలియకున్నను, వీరిలో కొందరి పేర్లనుబట్టి యీ యుద్ధము, క్రీ. పూ. 6850 పూర్వము జరిగిన దనవచ్చును. ప్రాయశః ఈ వీరులలోని కొందరి పేర్లతోనే నక్షత్ర నామకరణమై యుండును. ఈ దేవతల ననుసరింపక, వారు చేయు కర్మలను విశ్వసించక, కోమ్యంతులు, అరుపఘులు, జరతుష్ట్రి యనుచరులు మున్నగువారు వేరు మతమును ఆ కాలమున పెట్టుకొనిరి. ఇదియే నేటి పార్శీల మూలమతము. పైవారందరొకే కాలమువారనుట సంశయాస్పదమే అయినను వారు చారిత్రక పురుషులె యనవచ్చును.



## దేవతార్యుల వలసలు

ఈ దేవతార్యులాదిలో నగా ధ్రువప్రాంతమునుండి వచ్చిన తర్వాత నీ క్రింది ప్రదేశములందు నివసించుచుండినట్లు అవెస్తాగ్రంథమున వ్రాయబడి యున్నది. (1) Airyana Vaejo (2) Sughdha or Sogdiana (3) Mouru or Margiana (4) Bakhdid (5) Nisaya (6) Harovu or Arcia (7) Vaekareta (8) Urva (9) Khnenta in Venhrkena (10) Harahvaiti or Arachosia (11) Haetumant (12) Ragha (13) Chakhra (14) Varena (15) Hapta Hendu (16) Rangha.

ఈ ప్రదేశములలో మొదటిది పర్షియనుల పూర్వస్థానమనియు (ఇరాను) 2 వది సమరఖండ్ అనియు, 3 వది మేరువనియు, 4 వది బాక్ట్రియా యనియు, 6 వది పరయు లేక హీరత్ ప్రాంతమనియు, 7,8 లు కాబూలు లోనివనియు, 9 వది కంధహారనియు, 10 వది సరస్వతి లేక ఇరావతి ప్రాంతమనియు లేక హరత్ అనియు, 11 వది హెల్మండనియు, 12వది రాఘయనియు, 15 వది సప్తసింధు ప్రదేశమనియు పరిశోధకులు తలచియున్నారు. ఇందలి 8, 6, 9, 10, 15 ప్రదేశములలోని వారల విషయములు మన పురాణములందు గోచరించుచున్నవి. ఇంద్రప్రార్థనము గావింపనివారిలో పణులు లేక పణికులు మెసపొటోమియాకు దక్షిణదేశమునకు వెడలిపోయినట్లు కనబడుచున్నది. (Rigvedic India)

(మనుస్మృతి, ఋగ్వే, మం. 8 చూడుడు.)

ఇంద్రుడు తన సప్తసింధుదేశమున దైవము లేదనువారిని, దేవప్రార్థనలు, క్రతువులు కావించనివారి నందరిని హింసించి దేశమునుండి వెడలగొట్టుచుండినట్లు ఋగ్వేదమునందున్నది. (ఋగ్వే. మం. 1. 2. 3) బ్రహ్మణస్పతి యనబడు బృహస్పతి యజ్ఞకార్యముల నొనర్చుటకై నియమింపబడెను. ఆతనిని ప్రార్థించు కొన్ని ఋక్కులు గలవు. (ఋ 5-42-49) పిల్లలున్న వారినైనను, వారి స్వంతలాభమే చూచుకొనుచు, దేవతల నారాధించని వారి ద్రవ్యము హరించి, వారి నంధకూపమున బడద్రోయవలసినదిగా గూడ నీ ప్రార్థనలందున్నది. అందుచే మన దేశమునుండిగూడ కొందరితర స్థలములకు బోయినట్లు తేలుచున్నది. బేబిలోనియా, సుమేరియా మున్నగుచోట్ల

యార్యుల యాచారసంప్రదాయ ముండుటవల్ల నట్టివారచటికి వెడలిపోయిరనుట కవకాశము గలదు. ఆర్యనాగరికత లభించిన ద్రావిడాదులే యచటికేగిరని మరియొక యభిప్రాయ మున్నది.(Rigvedic India)పర్షియనులచే స్వర్గతుల్యముగా భావింపబడెడి పవిత్రమైన ఇరాను(Airyana Vaejo) అను స్థానములోని ప్రజలకు జరతుష్ట్రియను నతడు మతకర్తగా నుండెను. ఆతనికే మఘవ, అధర్వాది బిరుదు నామము లుండెను. ఆతని మతములో పంచభూతాది ప్రార్థనలు మున్నగు కొన్ని విషయములు మన వైదిక యార్యుల మతమునకు సరిపోవును, ఇంద్రాదులను ప్రార్థించు విషయ మీ మతమునలేదు. అందుచే నింద్రవిరోధులు కొందరీ ప్రాంతమునకుగూడ జేరినట్లు కనబడుచున్నది. ప్రాచీనమైన యీజిప్టు దేశమునకుగూడ ఆర్యులు వెడలి రాజ్యములు స్థాపించినట్లు, అనట వైదికమత ముండినట్లు కొన్ని పరిశోధనలు తెలుపును. క్రీస్తుపూర్వము పదివేల సం॥లకు ముందే యట్టి వలస లుండెనట.

## దేవతార్యులకు విరోధములు

క్రమముగా జరతుష్ట్రి యనుచరులకు మిగత దేవతలకు విరోధములు ప్రబలి, మొదటివారు ఇరానుకు వలసపోయిరి. వారి మతగ్రంథములలో దేవతార్యులను దుర్మార్గులనియు, మోసకారులనియు, త్రాగుబోతులనియు, నాశనము జేయువారనియు నందుచేతనే వారి మతమునువీడి వేరే మతమును యేర్పరచుకొంటిమనియు వ్రాసుకొనిరి. సోమపానమును మత్తుద్రవ్యముగా వారు గర్హించిరి. మనుజులను మోసపుచ్చి, వారి నాశనమునకు కారణమగు వృత్తుల నేర్పరచువారని ఆరోపించిరి. ఈ జరతుష్ట్రి మతస్థులు మొదట ఇరానులో కొంతకాలముండి యచట మంచు ప్రళయము రానున్నపు డుత్తర ధృవప్రాంతమగు "వారి" ప్రాంతమునకు తాత్కాలికముగా వెడలి నివసించిరట. ఈ రీతిగా ఇంద్రుడు పెక్కెంద్రను సప్తసింధు దేశమునుండి అనగా సరస్వతీ తీరప్రాంతములనుండి వెడలగొట్టినట్లు కనబడు చున్నది. వీరే రాక్షసవర్గమువా రనవచ్చును. వీరు మిక్కిలి దుర్మార్గులని వైదికగ్రంథము లందు చెప్పబడినది, ఇట్లు పరస్పర దూషణములందున్నను, వీరంద రాదిలో నొకే జాతివారైయున్నారు.

# పంచమ ప్రకరణము

## ఇహపరలోకములు

ఈ ప్రకరణమునందు లోకము లెన్ని యను విషయము విచారింతము. త్రిమూర్తులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల పేరిటను, ఇంద్ర, యమ, వరుణాదుల పేరిటను చెప్పబడిన లోకములు మన దేశములోనివే ననియు, వారిపేర నా యా నక్షత్రమండలములుగూడ వారి యనంతరము బిలువబడినవనియు లోగడ తెలిపితిని. ఇక జీవులు మరణానంతర మెచటికి లేక యే లోకమునకు బోదురను విషయమై కల్పనలు వదలి చూచినచో మన పూర్వుల శృతి, స్మృతి, పురాణములలో నాలుగు విధములుగా నిర్ణయించినట్లు కన్పడును. ఈ విషయము లెంతవరకు ప్రామాణ్యములో యింకను (సైన్సు) ప్రకృతి శాస్త్రములరీత్యా ధృవపడకున్నను వాని నిచట చెప్పెదను

1 పుణ్యపురుషులు పగలు ఉత్తరాయనమున చనిపోయినవారు అర్చిరాది మార్గమున సూర్యమండలములోని కేగుదురనుట.

2. కామ్యజీవులు రాత్రి చనిపోయినవారు ధూమ్రమాది మార్గమున చంద్రమండలమునకు బోయి యచటినుండి పుణ్యము క్షీణించినపుడు వర్షరూపమున భూమికివచ్చి సస్యములందలి ధాన్యములోజేరి క్రమముగా నానేక శరీరములందు పునర్జన్మనొందుట.

3. దక్షిణాయనమున చనిపోయిన కొందరు పితృలోకమని పేరుగాంచిన నక్షత్రమండలములోనికి బోయి నక్షత్రములుగా జేరొంది విలసిల్లుట. ఇది మనవారు నక్షత్రములకు పూర్వులపేర్లు పెట్టినందున ఏర్పడిన నామకరణము.

4. సామాన్యజీవులు తృణజలూక న్యాయమున ననగా ఒక గడ్డిపోచ మీద నున్న పురుగు మరియొక గడ్డిపోచ నందుకొన్నపుడు మొదటిదాని యాధారమును వదలినట్లుగా నొక శరీరమునుండి మరియొక దానిలోని కంత్యకాలమున ప్రవేశించుట.

బ్రహ్మాండము మొత్తములోని గ్రహ, నక్షత్రాది లోకము లనేకముల సంగతి వదలి చూచినచో పైన యేడులోకములు, క్రింద నేడు లోకములు గలవను పురాణోక్తులు ప్రమాణములుగా గన్పడవు. ఈ 14 లోకములనునవి మన దేశమును ఉత్తరమునుండి దక్షిణ సముద్రమువరకు విభజించిన యొక కాలపు భాగములుగా గన్పడుచున్నవి. ఉపనిషత్తులలో ఆకాశ, వాయు, భూలోకములును, భూమి క్రిందభాగ మొక లోకముగను మాత్రమే వర్ణిత మైనది. ఈ భూమిక్రింద యంధకార భాగములో చనిపోయిన జీవు లుందురను గాథ యొకటి అథర్వ ఋగ్వేదములందున్నది. ఇది యానాటి విశ్వాస మనవచ్చును.

మన యుపనిషత్తులు భారతయుద్ధ కాలమునాటికే యుండుటవల్ల నప్పటి వరకనగా క్రీస్తుపూర్వము 1900 సం॥ దాదాపు వరకు లోకముల విషయమై మన పూర్వుల నిశ్చితాభిప్రాయ మింతేయైనట్లు గ్రహింపవచ్చును.

ఇక పితృలోకమనబడు నక్షత్రమండలములో భూమియందు చనిపోయిన వారందరుందురను విశ్వాసమును బట్టిగాని వారిపేరట నక్షత్ర నామకరణము చేసినదానిని బట్టిగాని వారు మనము చేయు కార్యములుచూచి సంతసింతురను నభిప్రాయముతో వారిపై శ్రద్ధగనపరచెడి శ్రాద్ధాదులు క్రమముగా గల్పించిరి. ఈ లోకమునకు యముని అధినాథునిగా పేర్కొనినట్లు ఋగ్వేదము 1-326 లో గలదు. ఈ కార్యములందు చేపలకూరతో గలిసిన భోజనము (దీనినే కవ్యమందురు) ప్రధానము. క్రమముగా నది మాంసముతో బెట్టు నియమము లోనికి వచ్చెను. మాంసము తిననచో 21 న జన్మమున పశువుగా బుట్టునని చెప్పిరి. ఈ ఆచారము క్రీ. పూ. 4 వ శతాబ్దివరకు నుండెను. బౌద్ధమతము మన దేశమున బాగుగా ప్రబలిన పిమ్మట కొన్ని చోట్ల నహింసాత్మకముగ వీనిని వర్జించి మాంసమునకు బదులు మాషములతో గారెలు చేసి వినియోగించు నాచార మనుసరింపు చున్నారు. ఈ శ్రాద్ధములందు గూడ విష్ణువు, విశ్వదేవతలుగూడ ముఖ్యులై పితృదేవతల పక్షమున భోక్తలుగా నేర్పడుట జూడగా, మొట్టమొదటి కాలములోని విష్ణువులును, దేవతలును స్వయముగా ఆహ్వానింపబడి, యిట్టి కార్యములందు కవ్యమును గైకొనుచుండినట్లు కనబడును. యజ్ఞయాగాదులలో మాత్రము దేవతలందరును వారి భాగముల ప్రకారము బిలువబడుచు యందర్పింపబడు హవ్య



మును అనగా నేతితోగూడిన యన్నమును భుజించి తృప్తులగుచుండిరి. హవి యన నేయి. దీని సంబంధమైనదే హవ్యము. ఇక్లే కవి యన జలపక్షి. దీని సంబంధమైనదే కవ్యము. హవ్యకవ్యములలో పాకీనరోహితము లనబడు చేపలకూర బెట్టవలెనని మనుస్మృతి నుడువుచున్నది. ఇక పితృలోకము సంగతి వదలి యితరలోక విషయములను గమనింతము. నక్షత్రములు, నవగ్రహములు గూడ ప్రత్యేకలోకములుగా నున్నట్లు మన కిప్పటి పరిశోధనలు ఋజువుపరచుచున్నవిగాని వానికిని పదునాలుగు లోకములకును సంబంధము లేదు. లోకశబ్దము ప్రదేశమను నర్థముననే మన గ్రంథాలలో గన్పడును. స్వర్గ, మర్త్య, పాతాళములుగా మొదట విభజించిన మన దేశమునే మరల 14 లోకములుగా నొక కాలమున విభజించిరి. ఈ రెండు విభజనములందును పాతాళముమాత్ర మున్నది ఈ పాతాళము బలిచక్రవర్తి వంశీయులు వసించిన దనియు నది దక్షిణ హిందూదేశమందలి చిత్తూరుజిల్లా ప్రాంతమనియు లోగడ చెప్పితిమి గదా! ఇక నీ యూర్ధ్వ, అధోలోకము లెట్లు విభజింపబడినవో తెలుసుకొందము. దేవరాజ్యము అమరావతిలో స్థిరపడినపిమ్మట ననగా నేటి పంజాబులోకి (సప్తసింధు ప్రాంతమువరకు) హిమాలయమునుండి మార్చినపిమ్మట దానికి ఉత్తరభాగమున నున్న ప్రదేశములు 7 లోకములనియు, దక్షిణమున నున్నవి 7 లోకములనియు మనవారు విభజించి యుండిరి. వాని వివరము లీ క్రిందివిధముగ నున్నవి.

అతలము — అనగా స్థలము లేనిది. హిమాద్రి లేక యితర కొండలపై గాని గల శిఖరములు. వీనినే మొదట యింద్రుడు ఛేదించి వాసయోగ్యము చేసెను. ఇచటనే మొదట బలి వసించినట్లు పురాణములందున్నది. ఇది తెల్లని స్థలముగా చెప్పబడినది.

వితలము— హెచ్చుతగ్గులు గల స్థలము. వింధ్యాద్రి లేక యితర కొండల యేటవాలు ప్రదేశములు, ఇందే హాటకీనది ప్రవహించుచున్నట్లు పురాణములలో గలదు. తారకాది రాక్షసు లిందుండిరి. విద్రుమము వలె యెర్ర నేల యని వర్ణింపబడినది. అగ్నిముఖ, మహాంతకాది రాక్షసులుగూడ నిందు వసించిరని లింగపురాణము, ప్రహ్లాదుడు గూడ నుండినట్లు కూర్మ పురాణములందు గలవు

సుతలము— సమప్రదేశము. ఇందు మొదట సురలు వసించి సుపర్వులనబడినట్లు కనబడును. బలి, నముచి, కాలనేమి మున్నగువారు యిందు

వసించినట్లు కొన్ని గ్రంథములందున్నది. ఇది శీతల ప్రదేశముగా చెప్పబడినది. కుంభకర్ణ, మహాకుంభ, హయగ్రీవాదులు గూడ నివసించినది.

తలాతలము— కొంత సమస్థలమును, కొంత కొండప్రదేశమును కల్గినది. ఇచటనే పూర్వము మయుడు నివసించినట్లు పురాణప్రసిద్ధము. ఢిల్లీ చేరువలో నుండును. మయుడొకడు యింద్రప్రస్థపురి నిర్మించి ధర్మరాజున కిచ్చెను. విరోచన, హిరణ్యాక్ష, తక్షక, నరకాదులుండినట్లు లింగ, కూర్మ పురాణములందు గలదు.

మహాతలము—గొప్ప భూప్రదేశము. ఇది దక్కను కావచ్చును. తక్షకాదు లిందున్నట్లు కొన్నింట గలదు. మహాజనులనగా గొప్ప వర్తకులున్నందున గూడ నీ ప్రదేశమిట్లు పేర్పడనియుండవచ్చును. ముచికుందుడు మున్నగు వారుండినదని పురాణములందు వర్ణితము.

రసాతలము— ఇది సారవంతమైన ప్రదేశము. ఇచటనే వామనునిచే పారద్రోలబడిన పిమ్మట బలి నివసించినది. చిత్తూరుజిల్లా ప్రాంతమగు దక్షిణదేశము. నివాత, కవచ, కాలకేయులను రాక్షసులకుగూడ భారత యుద్ధ కాలమున వాసస్థానము. ఇది శైల మయమని చెప్పబడినది. ఈ రాక్షసులు అర్జునునిచే వధింపబడిరి. సువర్ణ, వాసుకిలు వసించినట్లు కూర్మ పురాణమునందు గలదు.

పాతాళము— అనగా పాదుతలము. హిందూదేశము మొత్తమున కిది పాదువంటిది. ఆదిశేషుడు మున్నగు అష్టనాగములు మొదట వసించినది. ఇదిగూడ బలిచక్రవర్తికి లోబడియున్నట్లు కనబడుచున్నది. అందుననే కొన్ని గ్రంథములలో బలి రసాతలమునను, కొన్నింట పాతాళమునను ఉన్నట్లు వ్రాయబడియున్నది. కన్యాకుమారివరకు గల దక్షిణ భూఖండ మంతయు నిందుండెను. ఇక ఊర్ధ్వలోక వివరములను తెలుసుకొందము.

భూలోకము భువర్లోకము— ఇవి రెండును సూర్య చంద్రాది రాజులు పాలించిన ప్రదేశములుగా గన్పడుచున్నవి. ఇందయోధ్య, ప్రతిష్ఠానపురము, విదర్భ, మిథిల మున్నగురాజ్యము లనేకము పూర్వముండెను.

సువర్లోకము— ఇది దేవతలు పాలించిన ప్రదేశము కావచ్చును.

మహాలోకము— మహాత్ములగు పెద్దలు నివసించిన ప్రదేశము లేదా మహాజనులగు గొప్పవర్తకుల చోటు అగును.



జనోలోకము— ఇది ప్రజలుండిన ప్రదేశము. దేవతారాజ్యమందలి పల్లెభాగమంతయు నిది.

తపోలోకము— తపసులు తపస్సు చేయుచుండిన చోటులు గలది.

సత్యలోకము— బ్రహ్మలు నివసించుచు ఆశ్రమములను స్థాపించిన చోట్లు గలది. హిమాలయముమీద ఆశ్రమములన్నియు నిందులోనివే.

ఈ పదునాలుగు యేర్పడకపూర్వము మనదేశము 3 భాగములుగా విభజించిరి— స్వర్గ, మర్త్య, పాతాళములనిరి. వీనినిగురించి లోగడ నుడివితిమి. ఈ రెండురకములైన విభజన లోకములుగాక మన పురాణములలో కైలాస, వైకుంఠము లున్నట్లుగూడ గలదు. అవి హిమాలయమందును, పరిసగమునను ఉన్న శైవ, వైష్ణవ ఆశ్రమములేగాని వేరుగాదని లోగడ తెలిపితిమి. కొన్ని పురాణములలో గోలోకమొకటి సృష్టింపబడి యందు గోపికాలోలుడగు శ్రీకృష్ణు డచట నుండునని వర్ణించిరి. ఇవి యన్నియు శ్రీకృష్ణుని దేవునిగా భావించినపిమ్మట సృష్టించిన కల్పిత విషయములే గాని యన్యము గాదనవచ్చును.

ఇక బ్రహ్మాండమువంటి బ్రహ్మాండము లనేక ముండునని గూడ మన పూర్వు లూహించిరి. కాని నక్షత్రములతో గూడిన యీ బ్రహ్మాండ మావల నేమియున్నదో నిజముగా నెవ్వరును సరిగా పరిశోధించినవారు లేరనవచ్చును. ఈ బ్రహ్మాండమే యింకను విస్తరించుచు క్రమముగా నూతన నక్షత్రము లుద్భవించుచున్నట్లు యిప్పటి పరిశోధకులు కనుగొనిరి. వైష్ణవ భక్తులు విష్ణులోకమును, శివభక్తులు కైలాసమును మరణానంతరము జేరుదురను కథలను ఉపనిషత్తులు ధృవపరచుటలేదు. వానిలో పైన నుడివిన 4 లోకములే వర్ణింపబడినవి. అందుచే కేవలము భక్తులను వృద్ధిపరచుటకై యీలోకములు గూడ నాటి మత ప్రవక్తలు కల్పించినట్లు స్పష్టము. బృహదారణ్యకోపనిషత్తులో చనిపోయిన జీవులలో కపాలమోక్షమై పోవువారు బ్రహ్మలోకమునకు పోదురనియు, కండ్లగుండా జీవము పోయినవారు సూర్యలోకమునకు పోదురనియు, జీవాత్మలు తృణజలూక న్యాయమున బయటికి పోయినపుడు దానికి వలయు పంచభూత భాగములను గైకొని తన నూతన శరీరము ధరించి గంధర్వ, పితృ, దేవ, బ్రహ్మలోకముల కేగునని యు జెప్ప

బడినదిగాని లోగడ గంధర్వ దేవ, బ్రహ్మవంశజు లందరును మానవులే యని రుజువగుటను, వారి చోటులన్నియు మన దేశములోనివే యగుటను యట్టివారిలో జనించెదరను నర్థమే యిచట గైకొనదగియున్నది. పితృలోకమన్న నక్షత్రయుక్త ఖగోళమని లోగడ తెలిసికొంటిమి.

యమలోకమున 28 విధములగు నరకములున్నట్లు కొన్ని పురాణములందు గలదు. అవి నాటి యింద్రరాజ్యములో తప్పులొనరించువారి కిచ్చు నానావిధ శిక్షాస్థానములేనని గ్రహింపవచ్చును. ఇంద్రరాజ్యమున యముని పరిశీలన క్రింద నట్టి క్రూరవిధములైన శిక్ష లమలులోనున్నట్లు కనబడుచున్నది. అంతేగాని చనిపోయినవారి కట్టి శిక్షలు కలుగుననుట ఆయా పురాణకర్తల యూహాకల్పితములు మాత్రమే. అధోలోకములందు మానవులలో నొక శాఖయగు రాక్షసులుగూడ నున్నటు పైన నుడివియుంటిమిగదా. దానినిబట్టిగూడ పదునాల్గులోకాలు మన దేశమునందలివే యనుట స్పష్టము. రాజులు ప్రజలకిచ్చు శిక్షణలనుబట్టి మరణానంతర పాపజీవులకు గూడ నట్టి శిక్షణలు సృష్టికి కర్తయగు వాడిచ్చునను విశ్వాసముగల పూర్వఋషులు, అట్టి యూహాజనిత శిక్షాస్థానమునే యీ దేశపు (దేవరాజ్యపు) శిక్షణకర్తయగు యముని పేరిటనే కల్పించి దాని కనుగుణ్యమగు ఋక్కులు, గాథలు వేద పురాణములలో గొన్నిచోట్ల నిరికించినట్లు కనబడుచున్నది. కాని పునర్జన్మ కర్మసిద్ధాంతములు మాత్రమే హెచ్చుగా నీ గ్రంథములందు జెప్పబడినవి. వానిప్రకారము తక్కిన లోకములవలెనే యమలోకపు టునికిగూడ బూటకమని రుజువగుచున్నది. ఋగ్వేదము ప్రథమ మండలమున 1-32 సూక్తమున ఆకాశమున (ద్యావా) 8 మండలములు లేక లోకము లున్నవనియు, అందు రెండు సూర్యునికి దగ్గరనున్నవనియు, ఒకటి యమనివాసముకడ నున్నదనియు నచటనే దివ్యకాంతి బ్రహ్మానంద సుఖము లున్నవనియు, నచటికి పోవు మార్గముమాత్ర మంధకారయుతమనియు జెప్పబడినది. దీనిని బట్టిగూడ నక్షత్రములున్న స్థానములనే మనవారు పితృలోకముగా భావించి దానికి యముని అధిపతిగా నుత్ప్రేక్షించినట్లు స్పష్టము. కఠోపనిషత్తులో అగ్నివిద్య నెరింగినవారు స్వర్గాది యనంతలోకములను బొందుదురని చెప్పబడినదిగాని యీ లోకాలుగూడ ఖగోళసంబంధముగనే కనబడుచున్నవి. గ్రహనక్షత్రములే యివి యనవచ్చును.



## పార్సీల యముడు

ఇరానులో నుండిన పార్సీలమతమున నొక యిముడు గనబడుచున్నాడు. ఈతడు జరతుష్ట్రి మతములోనివాడు. పార్సీల ప్రధానస్థానమైన (Airyan Vajeo) ఇరానులో నొకకాలమున మంచుప్రళయము సంభవింప నున్నతరి యీ యిముడా మతగురువును ముందు కర్తవ్య మడుగగా నతడు (అహురమజ్దా) వారి ప్రాంతమునకు పశువులను, నానావిధములగు చెట్లు మొక్కలను, విత్తనములను తీసుకొని వలసపొమ్మని చెప్పెను. లేనిచో నా ప్రళయమున సర్వనాశన మగు ననెను. మరియు నావలసచోటున సూర్య చంద్ర నక్షత్రములన్నియు సంవత్సరమున కొకసారి యుదయించుననెను. ఈ యిమునివద్ద ననేక గొర్రె లాకాలమున నుండెను. ఆతడు తన పరివారముతో నచటికేగి నివసించెను. తర్వాత Airyan Vajeo నాశనమై పోయినట్లు గలదు. ఈ యిముడు వలసవెళ్ళిన ప్రదేశ ముత్తరధ్రువప్రాంతమై యుండునని కొందరు పండితు లభిప్రాయపడుచున్నారు. ఈ యిముడుగూడ మనదేశపు యముని శాఖలోనివాడే యనియు, నా ప్రదేశమున యిముడుగా వ్యవహరించి యుండుననియు నూహింపదగియున్నది. ఈ యమ ప్రదేశమునే మనవారు యమలోకముగాగూడ వర్ణించియున్నను ఆశ్చర్యముండదు. కాని యీతడుగూడ ఆనాటి యార్యులలోనివాడేగాని యన్యుడు గాడని మనము భావించుట యుక్తము. ఇతడా ప్రాంతీయులకు రాజుగా నుండెను.

## గ్రహముల నామకరణ కాలము

### (దేవతల యాధిపత్య వివరములు)

అత్రికుమారుడగు చంద్రునికి తారవలన బుధుడు జనించెను. రాక్షసగురువగు శుక్రునికుమార్తె దేవయానిని చంద్రవంశరాజగు యయాతి పరిణయమయ్యెను. ఈ శుక్రునికి సమకాలికుడే బృహస్పతి. యయాతి లోగడ నుడివిన వంశావళుల ప్రకారము క్రీ. పూ. 6850 సం॥ల నాటివాడని నిర్ణయింపబడినది. కాన శుక్రుడును, గురువును ఆకాలమువారే యగుచున్నారు.

బృహస్పతిభార్య తారను కామించి, దానివలన బుధునిగన్న చంద్రునుగూడ నా కాలపువాడే యని నుడువవచ్చును. వీరందరును పుట్టి గిట్టినతర్వాతనే యీ గ్రహములకు నామకరణమయ్యెను. ఇట్లే సూర్యునికి సవిత, పూష, మిత్ర, సూర్య, విష్ణు నామములను, చంద్రునికి తాము ప్రీతితో త్రాగెడి "సోమ" నామమును ఆ కాలపు టార్యులు పెట్టిరి. ఇట్లే సప్తఋషులకు వారి పేరిట కొన్ని నక్షత్రములకు పేరిడినట్లు లోగడ తెలిపితిమి. ఈ రీతిగనే వారి భార్యలలో వసిష్టునిభార్య యరుంధతికి దప్ప తక్కినవారికి కృత్తికా నక్షత్రగణమందు పేర్లు నుంచిరి. ఆమెపేరిట వసిష్ట నక్షత్ర సన్నిధినున్న యొక చుక్కను గుర్తించిరి. దేవతలకు సోము డాహారమని పురాణములందు చెప్పబడుట నాతనికి మొదటునుంచిన పేరునుబట్టియే.

దేవతార్యులు మొదట ధృవమండల ప్రాంతమున నున్న కాలమున నీ సప్తగ్రహములను నక్షత్రములను ఒకేసారి చూచుచున్నను, అప్పుడు వానికి పేర్లుబెట్టినట్లు కనబడదు. సూర్యుడు మన దేశమునందు వివిధ ఋతువులలో వివిధములుగా బ్రకాశించుట జూచిన పిమ్మటనే వారాయనకు 5 పేర్లను మొదట నుంచినట్లు కనబడుచున్నది. తక్కిన గ్రహములకు నక్షత్రములకు తర్వాతనే పేర్లుంచియుందురు. ఇపు డన్ని దేశములందును సప్తగ్రహములును, వారివలన నేర్పడిన వారములును ప్రచారములో నున్నవిగాని వారి కథలను, పేర్లును వేర్వేరుగా నున్నవి. గ్రంథవిస్తరణ భీతి వాని నన్నిటి నిట దెలుపుటలేదు. దేవతార్యు లనేకుల పేరిట నక్షత్ర నామకరణ మైనట్లు లోగడ తెలిపితిమి. గరుడునికి శ్రవణానక్షత్రమును, దేవ వైద్యు లందరికి శతభిషమును, వరుణునికి కుంభరాసియు, అశ్వినులకు యశ్వినియు, భరణికి యముడును, ప్రజాపతులకు రోహిణియు, బ్రహ్మకు అభిజిత్తును, సోమునకు మృగశిరయు, అదితికి పునర్వసును, రుద్రునకు ఆర్ద్రయు, నాగులకు ఆశ్లేషయు, పితరులకు మఘయు, త్వష్ట్రికు చిత్తయు, నింద్రునకు జ్యేష్టయు, నింద్రాగ్నులకు విశాఖయు, వసువులకు ధనిష్టయు, ఆపోవిశ్వేదేవతలకు పూర్వాషాఢ, ఉత్తరాషాఢలును, విష్ణునకు స్వాతియు, సవిత, మిత్ర, భగ, అర్యమాన, పూషులను సూర్యునకు హస్త, అనూరాధ, పుబ్బ, ఉత్తర, రేవతులును, అజఏకపాద, అహిర్బుధ్న్యులకు పూర్వాభాద్ర ఉత్తరాభాద్రలును, నైరుతికి మూలయు, అదితికి పునర్వసును, బృహస్పతికి



పుష్యమియు, నాధిపత్యస్థానములుగా బెట్టినట్లు సంహితలలో దెలుపబడుచున్నది. అంగీరసులపేరిటనే అంగారకగ్రహమొకటి నామకరణమయ్యెను. క్రీస్తుపూర్వము 6650 ప్రాంతమున నుండిన వైవస్వతనామ మనువునకు జనించిన అశ్వినులే దేవవైద్యులుగా బేరంది వారి యనంతరము వారిపేరట గూడ నక్షత్రనామకరణమయ్యెను. ఈ మనువునకే యముడు, యమున, సుయమ, శని, తపతి, మనువులు జనించినట్లు విష్ణుపురాణమున నున్నది. ఈ శని పేరిటను, యముని పేరిటను, క్రమముగా గ్రహనక్షత్రములు వెలసెను. ఋగ్వేదమున నశ్వినులపేరిటి ఋక్కులన్నియు క్రీ. పూ. 6650 ప్రాంతము పిమ్మటనే రచింపబడినట్లు తేలుచున్నది. ఇట్లే ఏకాదశ రుద్రులపేరిటగూడ నక్షత్రములు వెలసెను. ఈ రుద్రులు మరుత్తులుగూడ యింద్రుని అంగరక్షకులుగా గన్పడుచున్నారు. లోగడ చెప్పబడిన రుద్రులుగాక లింగపురాణమునందు అజఏకపాద, అహిర్బుధ్న్య, విరూపాక్ష, రైవతి, హర, బహురూప, త్ర్యంబక, సురేశ్వర, సావిత్ర్య, జయంత పినాకినామములు రుద్రులుగా చెప్పబడినారు. ఇందలి మొదటి యిర్వురును పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రముల కధిపతులుగా చెప్పబడిరి. హిరణ్యకశ్యపుని పుత్రియు ప్రహ్లాదుని సోదరియు నగు సింహికకు జనించిన రాహువు దేవతలతో బోరి విష్ణువల్ల దెగటారెనని పురాణములం దున్నది. ఈ రాహువు పేరిట సూర్యుని ఛాయకు పేరుపెట్టబడెను. ఈ రాహు పుత్రికను పురూరవుని కుమారుడగు ఆయువు పెండ్లాడియుండెను. అందుచే రాహువుగూడ రాక్షసవర్గములోని వాడే యైనను ఆ కాలపు మనుసంతతి రాజులతో బంధుత్వము గల్గియుండిన వాడనియు, కేవల ఖగోళ ఛాయాగ్రహము మాత్రమే కాదనియు స్పష్టము. కేతుగ్రహముగూడ నట్టిదే. శ్వేతకేతు నచికేతాది నామములు దీనిని ఋజువు పరచును.

## మిథ్యాపురుషులను వాదము

ముఖ్యముగా ఋగ్వేదములో నుదాహరింపబడిన బ్రహ్మ, విష్ణు, శివ, కాళీ, సతీ, దక్ష, దుర్గా మరుత్తులును, వృత్రాసుర, త్వష్ట్రి, వరుణ, బ్రహ్మణస్పతి, యింద్రులు మున్నగువారు మిథ్యాపురుషులనియు, వారిలో

త్రిమూర్తులు సూర్యుని ఉదయ, మధ్యాహ్న, సాయంసమయములనియు, కాళరాత్రియే కాళీదేవతయనియు, దక్షునికుమార్తెయు శివునిభార్యయు నగు సతీదేవి యన చంద్రుని వెన్నెలయనియు, దక్షుడన ఉదయించు సూర్యుడనియు, దుర్గాదేవి యన తెల్లవారుచుండు ఉషఃకాలమనియు, మరుత్తులనగా గాలిదేవుడనియు, దనువు కుమారుడగు వృత్రాసురుడన అహి; చీకటి, మేఘములను నర్థములనియు, త్వష్ట్రప్రజాపతియన్న రుద్రుడన్నను అగ్ని లేక నిప్పు మాత్రమేననియు, వరుణుడన జలము లేక సూర్యనందులనియు, లేక రాత్రిదేవతయనియు, బ్రహ్మణస్పతి లేక బృహస్పతి యన నవగ్రహములలోని గ్రహమేననియు, బ్రహ్మయన్నను ఉదయసూర్యుడు లేక సృష్టికర్తయనియు, యింద్రుడన మేఘములనియు సూర్యుడనియు కొందరు పరిశోధకులు (మాక్సుముల్లరు మెగ్డనాల్డు, లోకమాన్య తిలక్, దయానంద సరస్వతి, డా॥ ఏ. సి. దాసు మొదలగువారు) చారిత్రకాంశము లెరుగని పూర్వ వ్యాఖ్యాతల ననుసరించి వివిధములుగా చెప్పుచు ఋగ్వేదములో స్పష్టముగా కనబడుచున్న చారిత్రకపురుషులను వారి చరిత్రాంశములను గమనింపక తారుమారు చేసియున్నారు. ఇది యింతవరకు జరిగిన వారి చరిత్రలవల్ల స్పష్టపడుచునే యున్నది. ఈ చిక్కంతటికి కారణము వారు ఋగ్వేదములోని ప్రతి విషయమును ఖగోళవిషయముగానే భావించుటయే యనవచ్చును. గ్రంథ విస్తరణభీతి స్పష్టముగా గనబడుచున్న ఋగ్వేద దృష్టాంతములను యిచట వ్రాయుట మానితిమి. (ఋగ్వేదమునందలి ప్రథమ మండలము జూడుడు)

ఋభువులు, మరుత్తులు, అశ్వినుల విషయముగూడ నిట్లే పండితులు పొరబడిరి. వారానాటి మానవులేనని ఋగ్వేదఋక్కులు తెలుపుచున్నవి. (ఋగ్వే. మం. 10–77 గూడ చూడుడు) మహాభాగవతము నందలి విషయములకుగూడ వీరి భావములు విరుద్ధముగనే యున్నవని చెప్పినచో జాలును. మన పూర్వులపేర నక్షత్రనామకరణమైన విస్మృతి నల్లబడిన ఋక్కులలో చమత్కారముకొరకు వారి జీవిత చరిత్రలను ఆ యా నక్షత్ర గమనముల విషయములతో కలిపి చెప్పియుండిరి. ఈ కలగాపులగపు ఋక్కులవల్లనే భేదాభిప్రాయములు జనించుచున్నను, వాస్తవిక చరిత్ర కద్దురాదు. చివరికి



అశ్వినులు వైద్యముచేతను, యితర విధములను రక్షణచేసిన చ్యవన, సప్తవధ్రి, గోతమ, రేభ, భుజ్యు, అత్రి ఋష్యాది యనేక పురుషనామములకు గూడ శ్రీ తిలకువంటివారే మేమో కథలు, అర్థములు, సూర్యపరముగ నూహించి కల్పించివ్రాయుట మిక్కిలి చింత్యము. మన వేదములందు గల సత్య చరిత్రలను పురాణములతో సమన్వయించి చూచుకొనకపోవుటే యట్టి పొరబాటుకు కారణము, వృషాగిరి పుత్రుడగు ఋజ్రాశ్వుడు గొర్రెల మేపుచు వానిలో 101 తోడేలునకిచ్చి చంపుటకు కారకుడైనందున నాతని తండ్రి వాని కన్నులు పొడిపించెను. అతని ప్రార్థనపై యశ్వినులు వాని కన్నులను బాగుచేసి తిరిగి చూపువచ్చునట్లు చేసిరి. ఋగ్వేదమునందలి యీ కథకుగూడ సూర్యపరముగా నర్థములూహించుట యెంత విచిత్రము !

మరుత్తు సూక్తములలో 7గురు మరుత్తులు 1 పంక్తియనియు, 7 పంక్తులు 1 గణమనియు, ఉభయపార్శ్వాలతో కలిసి 63 మంది ఉండేవారని, అట్టి గణాలు 7 కలసి ఒక శర్ధ అని, అట్టి 7 శర్ధలు ఒక వ్రాతు అనీ, వీరందరు కత్తులు, బల్లెములు, గదలు, అంబుల పొదులు, ధనస్సులు, ఘూమాస్త్రిలు ధరించేవారని యున్నది. వీరిలో రథములు, అశ్వములు ఎక్కువారుండిరి. పదాతు లుండిరి. లేళ్లు, గుర్రాలు వీరు రథాలకు కట్టేవారట ఈ మరుత్తులు కేవలము గాలిమాత్రులేనా పరిశీలింపుడు—

ఈ దేవతల ఆహారాదికము విచారించినను, వీరు శరీరధారులేనని నిశ్చయమగుచున్నది. విశాలాకాశములోని దేవతలకు చంద్రుడే యాహారమని చెప్పబడినదిగదా. ఇది గ్రహాదులను గురించి చెప్పినది.

ఇక ఋగ్వేద దేవతలలోని ఇంద్రుడు వైద్యశాస్త్రమును అశ్వినులవద్ద నేర్చి భరద్వాజఋషి కుపదేశించెనని చరకాదులలో నుడువబడినది. యజుర్వేదమున అగ్ని దేవతకు (అగ్ని యనువానికి) నల్లధాన్యము (కృష్ణవ్రీహులు)తో చేయబడిన అపూపమును, సోమునకు చాయబియ్యపు అన్నము (చరువు) సవితకు ఆశువ్రీహులనగా 60 దినములకు పండే ధాన్యపు రొట్టెయు, బృహస్పతికి నీవరిధాన్యపు అన్నమును, ఇంద్రునకు మహావ్రీహియనే పెద్ద వరిధాన్యపురొట్టెయు, వరుణునకు యవధాన్యపుఅన్నమును పూషయనుగొరదేవతకు పండ్లులేనివాడగుటవల్ల పిండితోజేసిన జావయు ప్రతినియతాహారము

లని చెప్పబడినది. (కృ. యజు. సం. 1-8-10) దీనినిబట్టి ఆ యా పేర్లుగల వారి పేరిటనే క్రమముగా గ్రహాదులపేర్లు పెట్టబడి, వారిని పూజించు యజ్ఞాదులలో వారికి ప్రీతియైన వస్తువులే యీయబడుచున్నవన వచ్చును. శరీరధారులైనవారు చనిపోయిన పిమ్మట వారి పేర్లతో గ్రహాదులకు నామకరణము చేయబడినట్లు యీ విషయములు స్పష్టపరుచుచున్నవి. అష్టదిక్పాలకులకు, భార్యలు, వాహనాలు, నగరాలు ఉన్న విషయము పెద్దబాలశిక్ష చదివినవారందరికి తెలిసినదే. అందుచే వేదములలోని దేవతలందరు అయోనిజులగు ఖగోళదేవతలనుట వాస్తవము కాదు. యోనిజులు, అయోనిజులు గూడ నందు వర్ణింపబడిరనవచ్చును.

# షష్ఠప్రకరణము

## ఒకేపేరిటి వ్యక్తుల కథలు

పురాణములలో ఒకేపేరిట వ్యక్తులకథలు కల్పి యొక్కరి చరితగానే కొన్నింటిలో చేర్చి వ్రాయబడెను. మొట్టమొదట నివి జాగరూకతగానే చెప్పబడినను 4, 5, శతాబ్దుల దాపులో పురాణములన్నియు నిప్పటిపద్ధతికి బ్రహ్మణ మతానుకూలముగా యుద్ధరించి వ్రాయబడినపుడు గాని, తత్పూర్వమే గాని యిట్టి ప్రమాదములకు లోనై యుండును. అట్టి యుదాహరణలు చూపించినచో పురాణములలో నసంబద్ధములని తలంచునవి కొన్ని తొలగిపోవును. నారద, దక్ష, అగస్త్యనామ కెందరో కలరు. వీరి చరిత్రలకు పురాణములు చూడవలెను.

1. భరతుడు— ఈతని పేరిట భారతదేశ మేర్పడెనని పల్కెదరు గాని యే భరతుడైనది నిర్ణయించుటలో పురాణములలో భేదములున్నవి. భరతులు ముగ్గురు కలరు. మొదటి స్వాయంభువ మనువునకు మనుమడగు అగ్నీధ్రునికి మనమడును, ఋషభుని కుమారుడు నగు వాడొకడు. రెండవవాడు దుష్యంతునకు శకుంతలయందు జనించినవాడు. మూడవవాడు శ్రీరాముని సోదరుడు. భరతవర్ష మనునది మొదటి భరతుని పేరిట నేర్పడియుండెను గాని రెండవ భరతుని కాలమున గావనవలెను. రెండవభరతుడుగూడ దేవరాక్షస యుద్ధమున ప్రసిద్ధివహించినవాడేగాని యప్పటికే భరతవర్ష నామ మేర్పడియుండెను. కొన్నింటిలో రెండవభరతుని పేరిట నేర్పడినట్లు వ్రాయబడినది నిజముగా గన్పడదు.

2. విశ్వామిత్రులు— యిద్దరుగాని యింకా హెచ్చుగా గాని యుందురు. సప్తర్షులలో గణింపబడిన విశ్వామిత్రుడు బ్రహ్మర్షులలోనివాడు. ఇతడు మొదట బ్రహ్మర్షులలో చేర్పబడక అతి ప్రయత్నములో చేరెను. ఈతడు త్రిశంకుని ప్రత్యేక స్వర్గమునందు అనగా ప్రత్యేకరాజ్యమున పదభ్రష్టుడుగాకుండ నిల్పిన ఋషి. త్రిశంకుని ఇంద్రరాజ్యములోనికి రాకుండ జేయగా నట్లొనర్చెను. ఇతడు శునశ్శేపుని యజ్ఞపశువుగాకుండ వారిశ్చం

ద్రుని యాగములో రక్షించెను. ఈ కాలములో నరమేధములుండెను. ఈ కథ ఋగ్వేదమున నున్నది. ఇతడు సుదాసునికిగూడ పురోహితుడనియు భరతసంతతికొరకై నదులను స్తుతించెననియు ఋగ్వేదములోని మం. 3_33. 53 సూక్తములందున్నది. అందుచేనితడు క్రీ. పూ. 5200 ప్రాంతీయుడగును. ఇక రెండవవిశ్వామిత్రుడు గాధినందనుడై యుండి, శ్రీరాముని కాలమువరకు జీవించి తాటకి, మారీచాదుల విరోధిగా నుండినవాడు. కాంపిల్య నగరవాసి. ఇతడు గంధర్వకన్య ఊర్మిళకు చూళియను ఋషికి జనించిన బ్రహ్మదత్తుని మనుమడు. ఇతడు క్రీ. పూ. 3150 ప్రాంతీయుడనవచ్చును.

3. వసిష్ఠుడు— ఈ పేరు గలవారిలో మొదటివాడు బ్రహ్మర్షి. ఈయన భార్య ఊర్జ. అరుంధతి భర్త మరియొకడు. రాజులు పురోహితులుగా నీ వసిష్ఠు లున్నందున దర్వాత పురోహితు లందరును వసిష్ఠు లనబడుచుండిరి. అందుచే విశ్వామిత్రవిరోధి యెన్నవ వసిష్ఠుడో చెప్పజాలము.

4. పృథువు— ఈ పేరిటివారు ఇద్దరున్నారు. వేణుని జంపి బ్రాహ్మణులు తెచ్చిపెట్టినవాడొకడు. యయాతి వంశమునందలి రుక్మని కొడుకొకడు,

5. రైవతుడు— ముచ్చురు ఈ పేరున గలరు. ప్రియవ్రతుని కొడుకగు మనువొకడు. సూర్యవంశమున రేవుని కుమారుడగు కకుద్మిని రైవతుడనిరి. భూతుడనువాని కొడుకొకడు. కకుద్మి కుమార్తెను బలరాముడు పెండ్లాడగా నా కథను మొదటిరైవతుని కంటగట్టి యాతడు బ్రహ్మలోకమునకు వెళ్ళి తిరిగి వచ్చునంతలో నెన్నో యుగములు జరిగెనని బూటకములు పురాణములలో చెప్పబడెను. లింగపురాణ మీ విషయమున స్పష్టముగ నున్నది.

6. ముచికుందుడు— వీరు ఇద్దరు గలరు ఒకడు దక్షిణదేశపాలకుడు. మరియొకడు శ్రీకృష్ణునికి గుహలో గన్పడినవాడు. మొదటి ముచికుందుడు మాంధాత కొడుకు.

7. పరశురాములు — ఇద్దరు గన్పడుచున్నారు; ఒకడు దశరథ, శ్రీరాముల కాలమునాటికి బెద్దవాడుగా నుండినవాడు. ఈయనయే యువకుడై యున్నపుడు హైహయాది రాజులను సంహరించినవాడు. క్రీ. పూ. 3150 సం॥ ల నాటివాడు. రెండవవాడా వంశములోనివాడే కావచ్చునేమో



గాని యాతడు భారతయుద్ధకాలమునకు రమారమి యేబదేండ్లకు ముందుండి భీష్మునితో పోరాడినవాడు. ఇతడే కర్ణునికి విద్యల గొన్ని నేర్పినవాడును. ఈతనికాలము దాదాపు క్రీ. పూ. 1980 కావచ్చును. పరశురామ జయంతి యని యొకటియు, పరశురామ ద్వాదశి యని యొకటియు పంచాంగములందు మనకు రెండు పండుగలున్నవి. మొదటిది వైశాఖ శు ౨ ను, రెండవది వైశాఖ శు ౧౨ ను ఉన్నవి. ఇవి యిద్దరు పరశురాముల జయంతులే కావచ్చును.

8. తార— ఈ పేరు నక్షత్రములకు, చంద్రుని యొంపుడు భార్యకు, వాలి భార్యకు గలదు. పురాణములందు అత్రికుమారుడగు చంద్రుని ఖగోళ చంద్రునితో గలిపి కథల నల్లిరి. అత్రికుమారుడగు చంద్రుడు, బృహస్పతి భార్య తారను మోహించి బుధుని గాంచుట నిజమైన చారిత్రకముగా గన్పడుచున్నది. బ్రహ్మ యొకడు వచ్చి యీ కుమారుని గురించిన తగాదాగూడ మాన్పెనని పురాణములలో నున్నది. ఈ చంద్రుని వంశమున పురూరవుడు జనించి దేవకన్య యూర్వశిని చేపట్టెను. ఈతని పేరిట ఖగోళసోమునకు క్రమముగా నామ ముంచినట్లు కన్పడును. దేవతల రాజగు యింద్రునికి ముఖ్యమంత్రిని బృహస్పతి యనుచుండిరి. ఈ యింద్రపదవి యింద్రరాజ్యమున్నంతవరకుండెను. అనగా భారతయుద్ధకాలము వరకుండెను. ఈ పేరిట నొక గ్రహమునకు నామకరణ మేగ్పడెను.

9. రంభ— ఈ పేరు గలవారనేకులుగా నున్నను ఒక్క రంభయే యున్నట్లు సామాన్యముగా పురాణములు చదువు వారందరును గ్రహించుచున్నారు. రంభయన అరటిచెట్టు, అరటిబోదెలవంటి తొడలుగ్గిన సుందరులను రంభలందురు. ఉత్తరహిందూస్థానమున నట్టి చక్కనివారిని రంభలనుచుండిరి. ఇంద్రుని యాస్థానమున నున్న దేవవేశ్య నొకదానిని రంభయనుచుండిరి. ఆ పేరిటనే చక్కనివారందరును రంభలని ప్రజలు సామాన్యముగా వర్ణించు టాచారమయ్యెను. యజ్ఞాదులచే రాజులు యింద్రాదిదేవతల నన గా నుత్తరహిందూస్థానమువారిని గౌరవించినపుడు ప్రత్యుపకృతిగ వారు దేశపు రంభలను అనగా సుందరకన్యలను కానుకగా నిచ్చువారు. నేటి భోగ

లాలకులగు సంస్థానీకులవలెనే యీ కాలపు రాజులును సుందరకన్యలకై వాంఛించియు, నీటి సౌకర్యముల కొరకును యింద్రుని (అనగా దేవరాజును) అర్థించి ఫలసిద్ధి నందువారు.

10. బాణుడు— ఈ పేరిటివా రనేకులు గలరు. బాణవంశీకులు 11, 12 శతాబ్దులవరకుండి తామ బాణులమని చెప్పుకొనిరి. మొదటి బాణుడు బలిచక్రవర్తి కొడుకు. ఈ వంశములో శ్రీకృష్ణుకాలమున నొక బాణుడుండెను. ఈ వంశము దాదాపు క్రీ. పూ. 6650 నుండి క్రీ. పూ. 1900 వరకే గాక క్రమముగా దక్షిణదేశమునకు వలసపోయి క్రీస్తుశకము 1100 వరకు నుండెను. ఇప్పటికీ నున్నారేమో తెలియదు.

11. అష్టదిక్పాలురు—వీరుగూడ మనుజులే. అగ్ని, యమ, వరుణ, వాయు, కుబేర, యీశానాదు లేడ్వురును ఇంద్రరాజ్యమునకు చుట్టు సరిహద్దు పట్టణాలలో నుండి సరిహద్దులలో అక్రమముగ ప్రవేశించిన రాక్షస రాజ్యము లోనివారిని, మానవరాజ్యములోని వారిని తగినరీతిని శిక్షించుటకై యేర్పడిన వారు. వీరికి వాహనములు భార్యలు మొదలగువారున్నారు. ఇంద్రుడు తూర్పుదిక్కు తానే చూచుకొనుచుండువాడు. ఇందలి వరుణుడు ఆరోధ్యాది రాజ్యములకు నీరుసప్లయి పనిగూడ యింద్రుని యనుమతితో చేయుచుండెను. ఒక వరుణుడు జలంధరాసురుని పెంచియుండెనని లింగ పురాణములో నున్నది. యమాదులు దుర్మార్గులగు ప్రజల శిక్షించుచున్నను వారు దైవచింతనలో గొప్పవారు. నచికేతుడు యమునివద్దనే వేదాంతసారమును గ్రహించెను. ఈ విషయ ముపనిషత్తులలో వ్రాయబడినది. ఈ యేడును పదవులేగాని వారివారి స్వంతపేర్లు కాదు. వీరి నిజనామములు కాలగర్భమున లీనమైనవి. తుట్టతుదకీ పదవులపేరిటనే ఖగోళములో నక్షత్రముల నామకరణము లయ్యెను. ఇందలి కుబేరవంశీకులమని వైశ్యులు కొందరు 12, 13 శతాబ్దులలో వ్రాయించిన శాసనదృష్టాంతము లున్నవి.

12. శుక్రుడు — ఈయన రాక్షస వంశజు లందరికి గురువు. ఈయన తర్వాత వచ్చిన గురువులుగూడ శుక్రులనియే పిలువబడుచుండిరి. ఈయన కుమార్తె దేవయానిని యయాతి పెండ్లాడెను. దీనినిబట్టి యీతడు క్రీ. పూ. 6850 ప్రాంతీయుడగును. మొట్టమొదట శుక్రుడు మంచి కవీశ్వ



రుడు. ఈతని పేరిట కొంతకాలమునకు ఖగోళములోని గ్రహ మొకదానికి శుక్రుడని పేరుబెట్టిరి. గురువు దేవతలకు ప్రధానగురువు, మంత్రియునై యుండెను. మొదటిగురువు బృహస్పతి. ఇతడుగూడ శుక్రుని కాలపువాడే.

13. కశ్యపబ్రహ్మ—ఈతడు పురాతన ప్రజాపతులలోనివాడు. ఈయన గాక మరికొందరు కశ్యపులున్నట్లు కనబడుచున్నది. మొదటి పరశురాముని కాలమున నుండి యీతనిచే దానమును గ్రహించిన కశ్యపుడు మరియొకడు తద్వంశీకుడు గావలెను.

14. గయులు— ఈ పేరిటి రాజులు మువ్వురున్నారు. ఇందెవ్వడు మహారాజో గుర్తింపజాలము. కాని మొదటిగయుడే మహారాజనవచ్చును.

15. నారదుడు— ఈ పేరిటివారు కొందరు గలరు. ఒకడు మొట్టమొదటి బ్రహ్మకొడుకు, ఇతడే ధృవునికి భక్తి నుపదేశించినదియు ప్రహ్లాదునికి జెప్పినదియు. శ్రీకృష్ణునికాలమున నొక నారదుడున్నాడు. ఇట్లింక ననేక కాలములలో ననేక నారదులున్నట్లు పురాణ కథలవల్ల గ్రహింపగలము. ఇట్లే రావణునికాలపు త్వష్టబ్రహ్మ యొకరు. మొట్టమొదటి బ్రహ్మలలో నున్న త్వష్ట మరియొకరు. వీరిమధ్య నెందరు ఆ పేరటివారుండిరో పురాణములు నుడువుటలేదు. ఇట్లు చాలమంది యొకేపేరు గల వారిని కలిపివైచి వారివారి కథలను కలగాపులగముగా మనకు పురాణములలో జెప్పిరి.

16. అగ్ని— యజ్ఞకార్యములను నిర్వహించునపుడు ప్రకృతి దేవతలకు అగ్నిపూర్వకముగా నాహుతులిచ్చునపుడా కార్యము సల్పు ఋత్విజుని గూడ యగ్నియనియే పిలుచుచుండిరి. యజ్ఞములకు రాని దేవతలకు వీరు నానాద్రవ్యములను పంపుచుండినట్లు ఋగ్వేదమున నున్నది. లోగడ జెప్పబడినవారు గాక యీ అగ్ని కార్యపదవిలో దక్షకుమార్తె ఇలయు, భారతి, సరస్వతులను స్త్రీలుగూడ నున్నట్లు ఋగ్వేదమున గలదు. (ఋగ్వేదము మండలము 1, 8.)

17. ఇంద్రులు— ఈ పేరిటి దేవరాజులు పెక్కండ్రున్నను పురాణములందు వారివారి గాథలనన్నింటిని ఇంద్రుని పేరిటనే వ్రాసిరి. అహల్యతో భోగించినవాడు క్రీ. పూ. 8150 ప్రాంతీయుడుగా గన్పడుచున్నాడు.

ఆమె సోదరుడును, ముద్గలుని పుత్రుడునగు దివోదాసుని రక్షించి, యాతని కొరకై యింద్రుడు శంబరుని 100 నగరములను నశింపజేసెను. ఆ స్నేహమును బట్టియే యీ యింద్రుడాతని సోదరివద్దకు చనువుగా వెళ్ళియుండును.

## వ్యాసులు

అష్టాదశపురాణములు వేదవ్యాసు డొక్కడే చెప్పెనని కొందరందురు. అట్లయినచో బరస్పర విరుద్ధచరిత్రల నేల రచించునని కొందరు చెప్పెదరు. 7 వ వైవస్వతమనువునుండి 28 వ మహాయుగము జరుగుచున్నట్లు మన పురాణములలో వ్రాసిరనియు, అవి నిజముగా ఒక్కొక్క మహాయుగము 150 సం॥లు-మాత్ర ముండునవియు లోగడ నుడివితిమి. ఈ యుగముల కొక్కొక్కటికి ఒక వ్యాసుడుండి, వేదపురాణాదులు బోధించుచు రచించుచున్నట్లు కనబడుచున్నది. కూర్మపురాణ ప్రకార మీ 28 వ్యాసుల నామము లీ ప్రకారముగ నున్నవి.

"స్వాయంభువు, ప్రజాపతి, శుక్రుడు, ప్రజాపతి, సవిత, మృత్యువు, ఇంద్రుడు, వసిష్ఠుడు, సారస్వతుడు, త్రిధాముడు, వృషభుడు, శతతేజుడు, ధర్ముడు, తరసుడు, త్రైర్యారుణి, ధనుంజయుడు, క్రతుంజయుడు, ఋతుంజయుడు, భరద్వాజుడు, గౌతముడు వ్యాధ్యశ్రుడు, శుష్మాయణుడు, తృణబిందుడు, భవుడు, శక్తి, చాతుకర్ణుడు, పరాశరుడు, ద్వైపాయనుడు,"

వేదవ్యాసుడని కీర్తిగాంచిన ఇందలి 28 వ, వ్యాసుని శిష్యులే జైమిని, పైలుడు, సుమంతుడు, వైశంపాయనుడు, సూతుడు అనువారు. వీరి కాలమునుండియే వేదములు నాల్గుగా విభజింపబడి మొదటి నల్వురు నేర్చి ప్రచారము సల్పిరి. సూతుడు పురాణేతిహాససంహితలు నేర్చెను. ఇది క్రీ. పూ. 1950 ప్రాంతమై యుండును. పైన నుడివిన వ్యాసులలోని వారే వివిధ పురాణేతిహాసాదులు ఆయా కాలములలో రచించి యుందురు. క్రమముగా ననేకమార్పులకు లోనై మనకు ప్రకృతము కనబడురీతిని లభ్యమగుచున్నవి. పైన నుడివిన వ్యాసులందరును క్రీ. పూ. 7883 నుండి క్రీ. పూ. 1950 సం॥ల మధ్య నున్నవారైనట్లు కనబడుచున్నది.



## పురాణములందలి కొన్ని యసత్యాలు.

మహాత్మ్యములను చెప్పుటకై కొన్ని యభూతకల్పనలు పురాణములందు లోగడ నుడివిన యుగ, మన్వంతరాల వలెనే వ్రాయబడినవి. వానిలో కొన్నిటి నీ దిగువ చెప్పి, వాని నిజస్వరూపమును గురించి తెలిపెదను.

1. దేవతలందరికి నాల్గు భుజములున్నట్లు, వారు నేలమీద ఆనకుండగను, రెప్పలు వాల్పకుండగను ఉందురనుట. ఇది కేవలము కల్పనమే. ఒక్కొక్కసారి వారు విమానములలో సంచరించినను భూమిపై నడచిన వారేగాని యన్యులుగాదు. వారి కెవ్వరికి నాల్గు భుజములు లేవు. శతపథబ్రాహ్మణమందు "విద్వాగ్ం సోహి దేవాః"అనగా దేవతలనగా విద్వాంసులని చెప్పబడినది. ఇంద్రుడు సహస్రాక్షుడుగా వర్ణించుట నాతడు చారచాక్షుడగుట చేతను, నక్షత్రములను కండ్లుగా చేర్కొని, యాతనిని సూర్యునిగా వర్ణించుటవల్లనై యుండును.

2. బ్రహ్మ చతుర్ముఖుడనియు, శివుడు పంచముఖుడనియు, కుమారస్వామి షణ్ముఖుడనియు, రావణుడు దశముఖుడనియు నిట్లే మరి కొందరను వర్ణించి చెప్పబడినవి. బ్రహ్మవద్ద గల 4 వేదములను 4 ముఖములుగా వర్ణించినట్లు గన్పడును. అట్లే వారివారి వద్దనున్న ప్రధానమంత్రులను బట్టిగాని, యితరములగు ప్రాముఖ్యమైన వస్తువులనుబట్టిగాని వారికి ముఖములు పురాణకర్తలు భక్త్యావేశమున జమత్కారముగా జెప్పియుండిరనవచ్చును. రావణునివద్ద గల 9 మంది ప్రధానులతో జేర్చి యాతనిని దశగ్రీవుడనినట్లు కనబడును. ఇట్లే కొందరు ఋషులను జంతువులనుండి జనించిరని వ్రాసిరి. ఇవి వారిలోగల గుణాలనుబట్టి, క్రోధమునుబట్టి వ్రాసిరేమో!

3. సంతానము లేనపుడు కొందరికి అగ్నినుండియు, మగవారల శరీరములో నితరస్థానములనుండియు కొందరు జన్మించినట్లు కొన్ని కథలు వ్రాయబడినవి. ఇవి కేవలము బూటకములు. ఇట్టివారు దత్తపుత్రులుగా గన్పడుచున్నారు.

4. బ్రహ్మ విష్ణు శివాది దేవతలందరును నాటి ప్రజలుగానే రుజువుపడుచున్నను. అట్లే యందందు లిఖించియు, వారే యీ సమస్త సృష్టికి కారణభూతులని మతాభిమానముచే పురాణములలో నతిశయోక్తిగా జెప్ప

బడెను. దీనినే మనలో పల్వురు నమ్మి భ్రమించుచు, నిజమెరుగలేక, మోసపడుచున్నారు.

5. శ్రీరాముని కాలములో వానరులలో హనుమంతుడు సముద్రమును ఒక్క యంగతో దాటెనని రామాయణమున నతిశయోక్తులు కల్పించిరి. ఇట్లే శ్రీరామునికి మహత్తును కల్పించుటకై యాతడు గౌతమఋషి భార్య యగు అహల్య రాయియై పడియుండగా, త్రొక్కినంతమాత్రముననే యది స్త్రీగా మారినట్లు వర్ణింపబడినది. అహల్య యింద్రునితో తనకు హఠాత్తుగా జరిగిన స్నేహమునకు భర్త కోపింపగా, నలిగి వేరొకచోట నివసించుచుండగా నామెను మంచిమాటలతో (నయభయముల బల్కుచు) చివరకు భర్త కడకు వచ్చునట్లు జేసిన కథయే చమత్కారముగా వాల్మీకి రామాయణమున వాల్మీకి లిఖించెను. ఇట్టి మహత్తు లనేక మందు గూర్పబడినవి. కావ్య దృష్టిలో నిది యెంత యుత్కృష్టదశ నందికొన్నను నీ విషయములన్నియు నక్షరాల నిజమేవని తలంచుట వెఱ్ఱియేగాని మరొకటి కాదని మా నిశ్చయము. కపులు యంత్రసహాయమున గొప్పగొప్ప రాళ్ళను దెచ్చి వానితో వారధి నిర్మించి నట్లుండుగలదు. హనుమంతు డెక్కడనో సముద్రము దాటు చోటు కనిపెట్టి యచటి రావణభటులు లేని సమయమున మామూలుగానే దానిని దాటియుండును. కాని యంత్రసహాయమున గట్టబడిన వారధి లేకుండా దానిని దాటెననుట కల్ల. అతడుగూడ ద్రావిడజాతి మానవుడే గాని యన్యుడుగాడు. ద్రావిడులను కోతుల మాదిరిగానే భావించి వాల్మీకి తన గ్రంథమునందంతటను లిఖించుట వారిపైగల నిరసన భావ మెంతటిదో దెలియగలదు. ఇంకను వారు శ్రీరామునికి సాయపడ బట్టియే యంతమాత్రముగ వారినిగురించి చెప్పెనుగాని లేనిచో వారి నసలు పశువులనియే జెప్పెడివాడు. చూచితిరా! యీ బోయబ్రాహ్మణుని కానరాని దుడుకుతనము! వాలిసుగ్రీవుల సంతతిలోనివారమని నేటికిని పరంపరా లంబాడిజాతివారు చెప్పుకొనుచున్నారు. భార్యల విషయమున వారి వాలిసుగ్రీవుల యాచారమనుసరింతురు. హనుమంతుడు వ్యాకరణవేత్తయని వాల్మీకి చెప్పక తప్పలేదు.

6. ఎన్ని దుర్మార్గముల జేసినవారైనను అంత్యకాలమున యిచ్ఛచేగాని, హఠాత్తుగాగాని, కాకతాళీయముగా సంభవించినగాని తమ మతకర్తలను దలచినచో నట్టివారికందరికీ ముక్తియు, పై లోకములలో వాసత్వమును



గల్గునని యనేక కథలు అన్ని పురాణములందును గలవు. ఇవియన్నియు రుజువులేని బూటక కథలు. ఇవి మొదట నమాయకులైన వారి హృదయములలో భక్తి యంకురించుటకై చెప్పబడిన కథలుగా భావింపవలెనేగాని సత్యాన్వేషణలో నిలుకజాలవు. అజామీళుడు మున్నగువారి కథ లిందుకు తార్కాణము. శివకథలలో రుద్రాక్ష మెడకు గట్టబడిన పిల్లియొకటి శివ సాయుజ్యము బొందినట్లు వ్రాయబడినది. ఇట్టి బొల్లు లనేకము గలవు. కర్మసిద్ధాంత మిట్టివానిని ఖండించును. ఇట్టివన్నియు నలంపు లేయటువంటివని కొందర గభిమానులు వచింపవచ్చునుగాని చారిత్రకముగ బరిశీలించునప్పుడిట్టివి బయటికి రాక తప్పదు.

## కొన్ని దురాగతాలు

క్రీస్తుపూర్వము 7800 సం॥ల నుండి యున్న మన పూర్వులలో నెవరెట్టివారో తెలిసికొనుటకు మనకు వేదములు, పురాణాదులే ఆధారములు. వానిలో నెవరి నెట్లు చెప్పినను యింతవరకు సాధారణముగా నమ్ముచుండిరి. సూక్ష్మముగా విచారించినగాని యిందలి యన్యాయములు మన కిపుడు తెలియవు. సుదాసుడు, సుముఖుడు, నిమి, వేనుడు, నహుషుడు మున్నగు రాజులు బ్రాహ్మణులపట్ల యవినయముగా సంచరించి వారి యిష్టమువచ్చిన రీతిని రాజ్యపాలన చేయుచున్నందున నట్టివారి నందరిని బ్రాహ్మణులు క్రోధముతో హింసించి రాజ్యభ్రష్టులను జేసిరట. దేవాపిని రాజ్యమునకు రాకుండజేసిన పాపము వారిదే. ఈతని విషయమున నింద్రాభిమతముగూడ తిరస్కరింపబడెను. వారు చెప్పిన యెట్టి కార్యములైనను చేయుచు వచ్చిన వారిని మనుసంతతి రాజులను దేవతలుగా జేర్కొనిరి. ఇట్టివారిలో శంబుకుడను శూద్రతపసిని బ్రాహ్మణుల కోరిక ప్రకారము చంపిన శ్రీరాముడొకడు. ఈయన మనకు ప్రధాన దేవుడయ్యెను. బ్రాహ్మణులెట్టి దుర్మార్గము లొనరించినను వారిని శిక్షింపకుండ కట్టుబాటు లొనర్చిరి. అందుచే వారి దౌష్ట్యము క్రమముగా మితిమీరి శాసనరూపములుగా గూడ మారిపోయెను. రాక్షసులనువా రెక్కడున్నను వారిని సంహరించి నాశనము చేయుటకే బ్రహ్మావర్తదేశమున మొదట దేవతలు విష్ణువు నేర్పాటుగావించుకొనిరిగదా. దీనినే క్రమముగా దక్షిణహిందూదేశమునకు విస్తరించి దక్షిణ

రాజ్యములందు క్రమముగా మొదట ఋషులు ప్రవేశించి, దండకారణ్యము లందు నివాసము లేర్పరచుకొని, యచటి పాలకుల నాశనమునకై క్షత్రియులం పొగించి జయము బొందినట్లు కనబడును. అగస్త్యుడు త్రోవలో వాతాపి, యిల్వలులను వధించి దక్షిణమున కేగిన దిందులకే. కబంధ, ఖర, దూషణ, తాటకి మున్నగువారి నాశనమునకీ ఋషులే కారకులైనట్లు రామాయణాదులు నుడువుచున్నవి. వీరందరును దుర్మార్గులగుటవల్ల జంపబడిరని మనగ్రంధము లందు సమర్థింపబడినది గాని యిది బ్రిటిషువారు మన దేశచరిత్ర రచించిన పద్ధతిలోని యధార్థము వంటిది.

పరశురాముడు తనతో విరోధించిన హైహయులను మాత్రమేగాక, యదే సమయమని నానారాజన్యుల నిరువదియొక్కమారు దండయాత్రజేసి హింసించుటకన్న ఘోరము మరియొకటి లేదు. వారందరును దుర్మార్గులనియు, నీతడు వారిని లోకసంరక్షణార్థమై వధించెననియు సమర్థించి వ్రాయబడిన వ్రాతలకు విలువ కనబడదు. రాక్షసులను వర్ణించునప్పుడు ప్రతీ గ్రంధమును వారిని నరమాంస భక్షకులుగను, వికృతరూపులుగను, రాత్రించరులుగను జెప్పిరి. ఇవి యన్నియు బక్షపాతముచే వ్రాయబడిన వ్రాతలే. విరోధులనుగురించి సాధారణ జనులు పల్కెడి తీరునే నాటి గ్రంధకర్తలనుసరించిరి. దేవతలు, రాక్షసులు విడివడిన పిమ్మట రాక్షసు లీ దేశపు ఆదిమనివాసులైన ద్రావిడులతో సంబంధములొనర్చిరి. అప్పటినుండి వారిని వేరుగ జూచుచు, విరోధములు ప్రబలినకొలదిని దుర్మార్గులని వ్రాయుచు వచ్చిరి. బలి, బాణుడు మున్నగువారి కట్టివంకలు పెట్టలేకపోయిరి. ఐనను వారిని హింసించుట మానలేదు. పాతాళమునకు బలిని కృత్రిమమున కాగ ద్రోలుటయు, ఒక బాణుని కుమార్తెను శ్రీకృష్ణుని కుమారుడు మోహించి వరించి, బందీగాగా కృష్ణుడు తుదకాతని విడిపించు వ్యాజమున బోరునకు వచ్చుటయు మున్నగునవి దీనికి దృష్టాంతములు. చాలకాలము దర్వాత నీ దేవతార్యులకు గూడ ద్రావిడ సంబంధములు తప్పలేదు. అగస్త్యాది ఋష్యాదులను ముందుగా దక్షిణ దేశమునకు బంపి పలుకుబడి సంపాదించి క్రమముగా ననేకద్రావిడులను బ్రాహ్మణాది వర్ణములుగా మార్చిరి. ద్రావిడ బ్రాహ్మణులు, బోయబ్రాహ్మణులు, పల్లవబ్రాహ్మణులు మున్నగువారు



శాసనములందు గానవచ్చుచున్నారు. వానరులలో చాలామంది దేవతలకు పుట్టినట.

## మహాభాగవత విషయాలు

అసలీగ్రంధము వ్యాసుని పేరిట బోపదేవుడు రచించినట్లు హేమాద్రి వ్రాసియున్నాడు. అది మరొకటున్నను, మార్కండేయ, శివపురాణము లిట్లే వ్యాసులపేరిట రచించినందులకు భోజరాజు ఆ గ్రంధకర్తలకు హస్తచ్ఛేదనాది శిక్షలు విధించినట్లుగా సంజీవని యను గ్రంధమున వ్రాయబడినది. ఇది భోజరాజకృతము. భాగవతము యెవరు వ్రాసినను, దానిలోని విషయాలన్నియు శ్రీకృష్ణునికి మాహాత్మ్యమును గల్పించి, యుత్కృష్ట దైవస్వరూపముగా జెప్పుటకే నుడువబడినట్లు గన్పడుచున్నది. ఇట్లే విష్ణువుయొక్క వివిధావతారముల మహిమలను జెప్పుటలో నిండున్న యసంబద్ధపు అతిశయోక్తులెక్కడను లేవనవచ్చును. కాని యిందు మనదేశపు పూర్వచరిత్ర యంతయు నిగూఢముగా జేర్పబడి యున్నందులకు సంతసింపవలసి యుండును. భక్తిపరులకిది గొప్ప పూజనీయమైన గ్రంధమైనను, యదార్థవాదులకిది కొంతవరకు దూరస్థమైనది. శ్రీకృష్ణుడు చిన్ననాడు గావించిన చర్యలన్నియు విపరీతాతిశయోక్తులతో వర్ణింపబడినవి. ఆతడు విరగగొట్టిన శకటమును, చంపినట్టి గార్ధభ, గో, వృషభ సర్పాదులను వరుసగా శకటాసుర, గార్ధభాసుర, ధేనుకాసుర, వృషభాసురాదులుగా వర్ణించినగాని కవికి తృప్తి కలుగలేదు. ఈతడు వేదములలో వర్ణనలఫక్కిని అనుసరించెను. లోకద నుడివినరీతిని చచ్చినవాండ్లను బ్రతికించినట్లు కథలు గల్పించినగాని శ్రీకృష్ణునికి మహత్తురాదని యాతడు తలంచెను. 16 వేల గోపికల కందరికన్ని రూపుల నేకకాలమున భోగము లిచ్చుచున్నట్లుగూడ వ్రాసెను. కలలోనైనను నేకకాలమున జరుగుట దుర్లభము. ఇట్టి యసభ్యము లెన్నియో గలవు. ప్రహ్లాదుడెంత విష్ణుభక్తుడైనను, అతడు సామాన్య బాలుడే. అట్టివానిని యేనుగులచేత ద్రొక్కించినను, పాములచేత గరపించినను, కొండలమీఁద నుండి క్రిందికి పడద్రొబ్బించినను, చావకపోవుటయేగాక, అణుమాత్రమైన బాధపడడని, జంకడని, అదియంతయు విష్ణుమహత్తేననియు, జెప్పుటకు జంక

లేదు. శ్రీకృష్ణుని విష్ణువుయొక్క అవతారముగా జేయుటకై పడరానిపాట్లు బడి, యాతడు జంపినవారి నందరిని, చివరకు పశువృక్షాదులను గూడ రాక్షసాదివర్గమువారుగా వర్ణించెను. భక్త్యావేశమంతయు నిందు ప్రత్యక్షమైనది. రాక్షసులైనగాని విష్ణువు చంపగూడదని, యాతడు సర్వలోకరక్షకుడని చెప్పుటకై యీ కృత్రిమ వర్ణనములు జరిగినవి. భావి కాలగతులనే శీర్షికతో నీ గ్రంథము రచింపబడిన నాటికి పాలించిన మనరాజుల కథలన్నియు నా కవికి తెలిసినంత వరకు నందు జేర్చినట్లు కనబడుచున్నది. ఆంధ్రరాజులు మున్నగు పాలకుల విషయముగూడ నిందుగలదు. వీరు 3, 4 శతాబ్దముల వరకుండిరి. భారతాదిగ్రంథములందు లేని యనేక చారిత్రక గాథల నిందు జూపెట్టుట విశేషము. దీనిని దయానంద సరస్వతీస్వాములు లోగడ విమర్శించి యిట్టి గ్రంథము వ్రాయబడ గూడదని యాక్షేపించెను. గాని పురాణములకన్న హెచ్చు బొల్లు లిందున్నవన జాలము. ఒకచోట కశ్యపప్రజాపతి తన నానాభార్యల మూలమున చెట్లు, చేమలు, పశు, పక్షి, మృగాదులు, లతలు మున్నగు నవన్నియు బుట్టించెనని వ్రాయబడినది. వారందరు కలసి తమకు గావలసిన చెట్టుచేమలను బెంచియు, పశు పక్షి మృగాదులను మచ్చికతో సాకియు వృద్ధిచేసినట్లు మనము భావించినచో నిది సరిపోవును. ఈ భాగవత విషయములన్నియు నిట్లే యుండును. పోతన్నగారి తెలుగుసేత యింకను మహిమలను పెంచినదేగాని తగ్గించలేదు.

## కంసుడు మేనల్లురను వధించెనా?

దీనిలో కంసుడు దేవకీ వసుదేవులకు జనించిన కుమాళ్ళ నందరిని వధించెనని యచ్చటచట వ్రాయబడియున్నను, సూక్ష్మముగా విచారించినచో నీ సంగతి యబద్ధమనుట కాధారము గనుబడుచున్నది. దేవరాజ్యమునకు సరిహద్దులలో తప్పులోనర్చిన వారిని యముడు ఖైదుచేయుచుండెననియు, నట్టివారిలోని బ్రాహ్మణబాలురను శ్రీకృష్ణుడు విడిపించి తెచ్చెననియు లోగడ నుడివితిమి. కంసుడు జ్యోతిష్యుల మాటలను విని (ఇదియే ఆకాశవాణియని వ్రాసిరి.) భయభ్రాంతుడై మేనల్లురను పుట్టగనే యితర స్థలమున ఖైదులో



బెంప నియమించినట్లు గనబడుచున్నది గాని వారిని అసలే చంపినట్లులేదు. అందువల్లనే దేవకీదేవి కంసమరణానంతరము తన పుత్రులను జూపుమని వేడగా, శ్రీకృష్ణుడావిషయము విచారించినమీదట వారు సుతలమున నున్నారని తెలుసుకొని యచటికేగి యచటివారితో మాటలాడి వారలను గొనివచ్చి తల్లికి జూపియుండెను. వారు చాలా కాలమునుండి యచటనే యున్నవారగుట వారు తల్లిని చూచినపిదప మరలిపోయి సుతలమునందే వసింపదొడగిరి. సుతలము అనగా దక్షిణదేశము. దానినిగూడ బలివంశజులే పాలించుచుండిరి. ఆ కాలపు బలివద్దనే కంసుడు వారలను దాచి పెంచినట్లు కనబడునేగాని వధించియుండలేదని నమ్మవచ్చును. వచ్చినవారిని బ్రదికించి తెచ్చెనని శ్రీకృష్ణుని కీవిషయమున మన పూర్వులు గొప్ప మహత్తు నంటగట్టిరి. దీనికి కారణ మాలోచించగా, నదివరకు వారెచటకు గొంపోబడినదియు తెలియకుండుటచేత వారలు చచ్చినట్లుగానే యప్పటివారు భావించిరిగాని కంసమరణానంతరము శ్రీకృష్ణుడా రహస్యములను భేదించి వారల గనుగొనెను. ఇట్టి రహస్యములను భేదించుటలో కుశాగ్రబుద్ధి యగు నీయన కనేక మహత్తులు మన పురాణములందు గల్పించిరి. కాని యవియన్నియు నమ్ముటకు వీలులేనివి.

## పదారువేల కన్నియలు

పదారువేల కన్నియల కందరికి ఏక కాలమున గన్పడుచు వారితో సుఖించుట మున్నగు నద్భుతకల్పన లిట్టివే. వీరి నిజమైన గుట్టు యాదవులందరు కొట్టుకుచచ్చిన పిమ్మట బోయలు వచ్చి వీరిని అపహరించిన కథలో గానవచ్చుచున్నది. ఆ స్త్రీ లనేకులు యిచ్ఛాపూర్వకముగానే బోయల వెంటబడి పోయినట్లు గలదు. ఎంతకాలము వారలు భర్తలులేక నుండగల్గినదియు, శ్రీకృష్ణుడు వారి నెట్లు సుఖవంతులుగ జేసినదియు వారి పోకడవల్లనే గ్రహింపగలము, వారు పట్టుకూటికై శ్రీకృష్ణునివద్ద నున్నను, దాంపత్య సుఖము వారికి వలసినంత సమకూరనందుననే వారు బోయలవెంట యిష్టముగానే వెళ్ళిపోవుటకు కారణమనుట స్పష్టము.

## మరికొన్ని రామాయణకాల రహస్యాలు

రామాయణము రాముని కాలమునందే వాల్మీకి వ్రాసినను తర్వాత యెన్నో మార్పులు, చేర్పులు జరిగినందున వందలి నిజచరిత్రను విడదీయడము కష్టమే. రాముని పేర్లదిశరకే పరశురామాదుల కున్నందున సీతనిని శ్రీరాముడని పిలిచిరి. దశరథుని కాలములో రాక్షసులతో వైరముండినను అది దేవతల సహాయముకొరకు విధిలేక చేసినదేగాని యాతనికి ప్రత్యేకం కోరికలేదు. అందుల కనియే రాక్షసవిరోధము వచ్చునని దశరథుడు విశ్వామిత్రునితో మొదట దండకారణ్యమునకు శ్రీరాముని బంప నంగీకరింప లేదుగాని చివరకు తప్పక పోయెను. మొదటగానే దండకారణ్యములో నొక భాగమున కధిపతియగు తాటకిని నిష్కారణముగా విశ్వామిత్రుడు చంపించి యా భాగమును ఋషులచే ఆక్రమింపజేసెను. శ్రీరాము డరణ్యములకు వచ్చినపిమ్మటగూడ నచటి యధిపతులకు లోబడియుండక వారితో విరోధములు పెట్టుకొనెను. ఋషుల మాటలనే శ్రీరాముడు అనుసరించెను. అచటి పాలకులలోని విరధుడు, కబంధుడు, ఖరదూషణాదులు జనస్థానమున నుండి పాలించుకొనుచు తుదకు రామునితో బోరి మరణించిరి. తాటకిరాజ్య మంతకుముందే మునులు హరించిరి. దండకారణ్య పాలకులగు నీ ద్రావిడులందరును లంకాధిపతియగు రావణునికి సామంతులు. అందుచేతనే యాతడువచ్చి రాముని పరాభవించుటకై సీతను చెరగొనిపోయెను. కిష్కింధపాలకులగు వాలి సుగ్రీవులకు రావణుడు విరోధియగుటచే మెల్లగా రాముడు సుగ్రీవ స్నేహమొనర్చి వాలిని జంపి, యాతనియొక్క సహాయముచే రావణునితో యుద్ధమునకేగెను. రాక్షససంహార మెప్పుడునుగోరు యింద్రున కిది తెలిసి రథాదుల గొన్నిటిని రామునకు కానుకగానంపెను. చివరకు రావణుడు బంధుమిత్రపరివారముగా జంపబడి యాతనితమ్ముడగు విభీషణునకు రాజ్యమీయబడెను. ఐనను అతడు శ్రీరామునికి లోబడియుండెను. వానరులనగా ఆ కాలములో గోచీలు వ్రేలాడగట్టుకొనుచుండిన ద్రావిడులేగాని యితరులుకారు. ఈ కాలములో నీ క్రింది రాజ్యము లున్నట్లు రామాయణమువల్ల విశదపడుచున్నది.



## రామాయణకాల రాజ్యాలు

విదర్భ— పూర్వ మీరాజు సుతకేశిని సగరచక్రవర్తి పెండ్లాడెను.
విశాలదేశము— విశాలుడు పూర్వం కట్టించినది. సుమతియను రాజు పాలించుచుండెను.
సాంకాశ్యము— సుధన్వయనువాడును తర్వాత కుశధ్వజుడును పాలించిరి.
కేకయరాజ్యము— యుధాజిత్తు పాలించినది.
గిరివ్రజము (మగధ)— భరతుని తాత పాలించినది.
కిష్కింధ— వాలి సుగ్రీవులు పాలించినది.
బాహ్లీకము— రాజుపేరు తెలియదు. దీని రాజధాని సుదామునిపురము.
అంశుధానము— ధర్మవర్ధనుడను రాజు. ప్రాగ్వటమనే పురం రాజధాని.
కళింగము— రాజుపేరు తెలియదు.
జనస్థానము— ఖర దూషణాదులు.
దండకారణ్యములో మరికొంత— తాటకి, మారీచుడు, విరధుడు, కబంధుడు మొదలగువారు.
లంకారాజ్యము— రావణుడు, విభీషణుడు.

రాక్షస సంహారమునకు సంతోషించి దేవరాజ్యమువారు శ్రీరాముని తమలో కల్పుకొనిరి. ఆయన చివరికాలములో వైకుంఠాధిపత్యము గూడ నిచ్చి వైష్ణవునిగ మార్చిరి. అనగా విష్ణుపదవిలో నుంచిరని యర్థము. ఈయన కాలమునకు బ్రాహ్మణాధిక్యము మితిమీరెను. దాని ఫలితమే యీయనచే నిరపరాధియు శూద్రతపస్వియునగు శంబుకుని వధింపజేసినదని లోగడ చెప్పితిమి. ఈ శ్రీరాముడు క్రీ. పూ. 3102 లో జన్మించినట్లు జాతక చక్రమును బట్టి కొందరు నిర్ణయించిరి. రావణ సంహారముతో ద్రావిడజాతివారు తల యెత్తజాలకపోయిరి. కాలక్రమేణ వీ రార్యజాతివారికి లోబడి వారిలో లీనమైపోయి, వారి జాతివారినే నీచాతినీచముగ దెల్పు పురాణాదులు పఠించుచు, నవియే సంపూర్ణ విశ్వాసపాత్రములుగా స్వీకరించిరి. ఇప్పటికి రామాయణము లనేకము వెలసి, ప్రతిదానిలోను కొన్ని మహాత్మ్యలు పెంచబడుచు, సామాన్య జనులకు నిజమైన చరిత్రను మరుగుపరచుట గనుచున్నాము. శ్రీరాముడు మనకు దేవుడైనపిమ్మట నిట్లు జరుగుటలో నాశ్చర్యము లేదు.

## భారతకాల రాజ్యములు

ఇక భారతకాలపు రాజ్యములను గురించి తెలుసుకొందము. క్రీస్తుకు పూర్వము 1980 సం॥ నాటికి అనగా భారతయుద్ధకాలమునకు ముందు మన దేశమున ననేక రాజ్యములున్నట్లు మహాభారతమున గలదు. వాని నీ క్రింద దెలిపెదను.

| దేశము | రాజు | దేశము | రాజు |
|---|---|---|---|
| ఢిల్లీరాజ్యము | ధృతరాష్ట్రుడు | నాగ ,, | కౌరవ్యుడు |
| మధుర ,, | కంసుడు | సింధు ,, | సైంధవుడు |
| అంగ ,, | కర్ణుడు | విరాటమత్స్య ,, | విరాటుడు |
| పుండ్ర ,, | వాసుదేవుడు | త్రిగర్త రాజ్యము | సుశర్మ |
| మద్ర ,, | శల్యుడు | హైహయ ,, | నీలుడు (మాహీష్మతి) |
| సాళ్వ ,, | సాళ్వుడు | పాండ్య ,, | మలయధ్వజుడు |
| మణిపురము ,, | చిత్రవాహనుడు | ఉలూక ,, | క్షేమధూర్తి |
| దశార్ణవ ,, | సుధర్ముడు | అవంతి ,, | విందానువిందులు |
| పాంచాల ,, | ద్రుపదుడు | కోసలలో ఒకభాగం ,, | నగ్నజితు |
| నిషాద ,, | కేతుమంతుడు | మగధరాజ్యము | జరాసంధుడు |
| కళింగ ,, | శ్రుతాయువు | విదర్భ ,, | రుక్మి |
| ఆంధ్ర ,, | ... | చేది ,, | శిశుపాలుడు |
| కరూశ ,, | వృకుడు | అమరావతి ,, | ఇంద్రుడు |
| కాశి ,, | సుబాహుడు | ఒకరాక్షసరాజ్యం | అలంబసుడు |
| కాంభోజ ,, | సుదక్షిణుడు | గంధర్వరాజ్యం | పేరుతెలియదు |
| ప్రాగ్జ్యోతిష ,, | నరకుడు | బాహ్లీక ,, | బాహ్లికుడు |
| శోణపుర ,, | బాణుడు | | |
| మిధిలరాజ్యము | బహుళాశ్వుడు | | |

మరికొన్ని దక్షిణదేశము లుండియుండును గాని వానిని మహాభారతము పేర్కొనుట లేదు. ఈ భారతము మొదట జయమను పేరిట వ్యాసమహర్షి కల్పించి 8 సం॥ లకు తయారు చేసెను గాని, వీనిలో ననేక కల్పితములు 4 వ. శతాబ్ది వరకును జేర్చబడినవి. అసలే కృష్ణ మాహాత్మ్య



మునకు, ధర్మరాజాదుల ప్రతిష్ఠకొరకును నిర్మింపబడిన యీ యితిహాస గ్రంథములో నింకను హెచ్చు కృత్రిమకథలు జేర్చబడుటచే నిది ప్రమాణ గ్రంథముగా స్వీకరింప వలనుగాకున్నది. నానాటి స్వార్థపరులైన బ్రాహ్మణు లేర్పరచిన యధర్మము లనేకమిందు జేర్చబడినవి. పరస్పర విరుద్ధ గాథలు గూడ గలవు. ఐనను యీ యుద్గ్రంథము లేనిచో మన దేశచరిత్ర మనకు బొత్తుగా తెలియకయే పోయెడిది. భారత యుద్ధకాలమునకు సంస్కృత భాష మనదేశమున జాల యత్యున్నతస్థాయి నందికొనె ననుట స్పష్టము. శ్రీకృష్ణుడప్పటికే యున్న 108 ఉపనిషత్తులను జదివి, జ్ఞానియై వానిసారము లను భగవద్గీత యను పేర నర్జునుడు అక్రూరుడు మున్నగు వారికి దెల్పెను. దీనినే వ్యాసుడు భారతమందు సంగ్రహముగను, భగవద్గీత యనుదానిలో విపులముగను దెల్పియున్నాడు. దీని ప్రకారము సర్వకార్యములను నిష్కామ బుద్ధితో నీశ్వరార్పణముగ జేయుచుండవలె ననియు, జీవులు శాశ్వతులనియు, వారి నొకరు జంపువారు లేరనియు జెప్పబడెను. ఆత్మయే దైవ మనియు. జీవాత్మ దానిలో నొకభాగమే ననియు నది విశ్వ వ్యాపకత్వ దృష్టిని బొందినపుడు పరమాత్మయగుననియు నందలి భావము. విశ్వరూప దృష్టితో శ్రీకృష్ణుడాతత్వ ముపదేశించుటచే నాతని బరమాత్మగనే వ్యాసుడు మొదలైనవారు భావించి యట్లువ్రాసిరి. శ్రీకృష్ణుడు సుయోధనుని సభలో విశ్వరూపము జూపెనని భక్త్యావేశమున వర్ణింపబడినదేగాని నిజముగా నాతడు మిక్కిలి కోపోద్రిక్తుడై, యుగ్రుడై యానాడు సభనుండి వెడలి పోయిన విషయమునే వ్యాసుడు మనోహరముగ వర్ణించెను. ఇట్లు వర్ణించుటలో శ్రీకృష్ణుని పాండిత్య మాతనికి జ్ఞప్తికి వచ్చి యుండును.

వ్యాసుడీ గ్రంథమును జాల యతిశయోక్తులతోనే వ్రాసెను. మొదటి నుండి వ్యభిచారిగానుండిన కుంతీదేవిని సైతము సమర్థించెను. ఎన్నడు దూర్వాసుడో యొకడు సూర్యుడను పేరిటి వానితో భోగించి కర్ణుని వివాహపూర్వమే కని యాతడిచ్చిన కర్ణకుండలాలు, కవచమును దొడిగి యా బిడ్డని బారవేసిన దీమె. సహజమైన గుణముతో, నియోగమను పేరిట ముగ్గురు బిడ్డలను యింద్ర, యమ వాయుదేవులతో విహరించి కన్నది. దూర్వాసుడిచ్చిన కవచకుండలాలు కర్ణునివద్ద నాకాలపు యింద్రుడు మోసముగా హరించెను. ఈ కథను మార్చి దూర్వాసుడు మంత్రముపదేశము

జేయగా సూర్యుడేవచ్చి యామెను భోగించినట్లు చమత్కారముగా వ్యాసుడు వర్ణించినాడు. ఆ కాలములో కుండలాలు ధరించెడివారు యజ్ఞములుజేయు సోమయాజులేగాని యన్యులు గారవచ్చును. కర్ణునకు లభ్యమైన కుండలా లాతని బుట్టించిన సోమయాజి యొసంగినవై యుండునేగాని యన్యముగాదు. కవచమనగా నొక చొక్కాయని భావింపరాదు. మంత్రయుక్తమైన కవచ ములనగా తాయెత్తులని యర్థము. వానిలో బీజాక్షరముల చక్రముండును. అట్టిదాని నా సూర్యనామకుడు తయారుచేసి యాతనికి గట్టియుండును. ఆ కాలమునకుగూడ శివుడను ప్రవక్త యొకడున్నట్లు అర్జునుని కథవలన దెలి యును. అర్జునుడు శివునితో పందికొరకై పోరి తుదకాతనిచే పరశువును బహుమానముగా బడసెను. అప్పటి యగ్నిదేవు డాతనికి గాండీవమను ధనస్సు నిచ్చెను. ఖాండవవనమును గొట్టించి దహించుటకై సాయపడి నందుల కిది లభించెను.

ఆనాటివరకు దేవతలనబడువారుండి వారి చంద్రవంశీకులతో సంబంధ ములు గల్గియున్నట్లు కుంతీకథనము తెల్పుచున్నది. క్రమముగా వారును దక్కినదేశస్థులతో గలిసిపోయిరి. ఈ దేవవంశీకులు హెచ్చుగా బ్రాహ్మణ క్షత్రియ వంశములై పోయెను. వేదవ్యాసుడుచేసిన కృత్రిమ కార్యములలో ఘోరమైనదొకటి యాతని భారతమువల్లనే విశదమగుచున్నది. భారత యుద్ధానంతరము చనిపోయిన వీరుల భార్యల రోదనములకును మనోవృత్తి యిచ్చుటకును ధృతరాష్ట్ర ధర్మరాజులకు కష్టముగానుండి యాతని సలహా నపేక్షించిరి. అంతట నాబాధ తప్పింతునని చెప్పి మాయోపాయమున నీ వ్యాసుడు విగతభర్తృకల నందరి నొకచోజేర్చి వారందరికిని యొకానొక ప్రవాహమున మునిగినచో వారి భర్తలను చూపెదనని నమ్మించి దానిలో మునిగి చనిపోవునట్లు జేసెను. పాపము! కొందరుమాత్రము తిరిగి బ్రది కిరి. ఈతనినే నేడు మనము వేదవ్యాసునిగా బూజించుచు, ఆయన యొసగిన భారతమునే పరమపవిత్ర గ్రంథముగా బఠించుచున్నాము. గాని యట్టివా డెన్ని మర్మములను దాచెనో మన మెఱుంగజాలము. ఆ కాలములో ఋషు లాడిన దాటయు, పాడినది పాటయునై ఎంతటి యక్రమమైనను సరియే చెల్లిపోయెను. ఇక భారతమునందలి స్వర్గారోహణ పర్వమునందలి విషయ మును బరిశీలించినయెడల ధర్మరాజాదు లప్పటి యాచారము ననుసరించి



రాజ్యత్యాగులై వైరాగ్యధర్మ మవలంబించిన పిదప హిమాలయములందలి యముని కార్యాలయమువద్దకు ప్రయాణించి క్రమముగా శరీరము వదలి నట్లు కవబడుచున్నది. ఆతడు తనవెంట వచ్చు నొక కుక్కతోగూడ వెళ్ళి నను, వ్యాసులవారు దానిని కేవలము ధర్మదేవతగనే వర్ణించెను. అచట చనిపోయిన అర్జున, కర్ణ, దుర్యోధనాదులు ధర్మరాజునకు గనపడిరను వ్రాతలనుబట్టి వారందరును విరాగులై యా ప్రాంతమునకు జేరి తనువుల త్యజించియుందురని సందేహించవలసి వచ్చుచున్నది. భీమార్జున ద్రౌపదీ మాద్రేయులందరును మంచునకు, చలికి, వడకుచు త్రోవలో బడిపోయి క్రమముగా దేరుకొని యమాలయమునందలి ఉపచర్యాలయమునకు బోయి రని గూడ తలంపవలెను. లేదా నీ కథాభాగము నాటి విశ్వాసములనుబట్టి ధర్మరాజు ధర్మమూర్తి యని చెప్పుటకై చమత్కారముకొరకై వర్ణించి నట్లియినను భావింపవలెను. అంతేగాని ఆకాశములో నెక్కడనో యను లోక మున్నట్లును, దానికడకు భౌతికశరీరముతోను, కుక్కతోను ధర్మరాజు వెళ్ళినట్లు గల గాథమాత్రము నమ్ముటకు వీలులేదు.

## కల్కి విషయము

శంబలగ్రామమున విష్ణుయశుడను విప్రునికి కల్కి యనువాడు బుట్టి మ్లేచ్ఛులను జయించి పాలించుననియు, నపుడు కృతయుగము వచ్చుననియు భాగవతాదులలో గలదు. శంతనుని యనుజుడగు దేవాపియు, నిక్ష్వాకు వంశములోని మరుత్తును ఆ కాలమువరకు కలాపగ్రామమున నుండి సూర్య చంద్రరాజుల నుద్ధరింతురనిగూడ యున్నది. పరీక్షిత్తు కలిని నిగ్రహించి పాలించినట్లు గూడ చెప్పబడినది. పరీక్షిత్తును తక్షకుడను నాగవంశీయుడు బ్రాహ్మణప్రేరితుడై పండ్లమూలమున విషమిచ్చి చచ్చునట్లు చేసినపిమ్మట నాతని కుమారుడగు జనమేజయుడే నాగవంశీకులందరిని వరుసబెట్టి చంపుట కుద్యమించెను. ఇదియే గొప్ప యజ్ఞము (సర్పయాగము) గా భాగవతము నందు వర్ణితమైనది, దుర్మార్గుడైన యా తక్షకుడు మాత్రము చిక్కక తప్పించుకొని యెట్లో బ్రాహ్మణు లండగా నుండగా, నింద్రరాజ్యమున కేగి

ఇంద్రుని శరణుజొచ్చెను. గాని జనమేజయుడు దూరకుండలేదు. ఆతనిని, ఆతనికి రక్షణయిచ్చిన యింద్రుని గూడ శిక్షింపదలచెను. గాని యిది సహింపజాలని యాతని గురువు (ఆంగీరస వంశీకుడొకడు) వచ్చి యిక నా యుద్యమము మాని వారిని రక్షింపుమని కోరగా, నతడు శాంతివహించి తిరిగి తన నగరమునకు వెడలిపోయెను. ఈ జనమేజయుమహారాజు యుధిష్ఠిరశకము 89 సం॥ ప్లవంగనామ సం॥న మునిబృందక్షేత్రమున వ్రాయించిన దానశాసనమును గురించి లోగడ తెలిపితిమి. తక్షకునివంటి దుష్టులకును,ఆతనిని ప్రోత్సహించిన కృత్రిమ గుణసంపన్నులగు కొందరు బ్రాహ్మణులకును అప్పటివరకు ఆశ్రయస్థానముగా నున్న యింద్రరాజ్యము నీ జనమేజయరాజు అప్పటినుంచి హరించినట్లుగా గనబడును. ఇంద్ర, తక్షకులను మన్నించి యాతడు జీవములతో వదలివేసినను, ఇంద్రరాజ్యము మాత్రము తనదానిలో గల్పుకొన్నట్లే కనబడును. ఏలన, యే గ్రంథములో గాని మన దేశములో నీ యింద్రరాజ్యము తర్వాతనున్నట్లు కనబడుటలేదు. భాగవతమునందు ఇంద్రుడీయన యొనర్చిన యాగములో స్థానభ్రంశము నొందినట్లే వ్రాయబడినది. భవిష్యత్పరముగా భాగవతమునందు జెప్పబడి యున్నను, దేవాపి, మరుత్తుల కాలములోను, కలిపురుషుని కాలములోను వచ్చిన కృతయుగము భారతయుద్ధముతర్వాత 87 సం॥లకు వచ్చిన కృతయుగమే గాని యన్యముగాదని చెప్పవచ్చును.

శ్రీకృష్ణుడు వైకుంఠాశ్రమమునకు వెడలుచు నక్రూరుని కలియుగాంతమువరకు నచటనుండి తరువాత తనవద్దకు రమ్మని యుపదేశించి యున్నాడు. దానినిబట్టి కలియుగాంత మప్పటికి కొలది కాలములో నుండెననియు అది గడచినపిమ్మట కృతయుగము వచ్చుననియు సూచింపబడెను. (భాగవతము చూడుడు)

## సప్తవధ్రి చరిత్ర

ఋగ్వేదము పంచమ మండలమున నీతని చరిత్ర కలదు. ఇతడు అత్రి మహర్షి కుమారుడు. ఈతనిని రాత్రులందు భార్యతో కలియకుండగా నితని సోదరులు నిత్యమొక కొయ్యపెట్టెలో దాచియుంచి పగలు మాత్రమే యాతడు భార్యను చూచునట్లు చేసిరట. ఈ చెర పడలేక యతడు దేవ



వైద్యులగు యశ్వినుల సాయము గోరెను. వారు వచ్చి యాతని రక్షించిరట. ఈతని సోదరులే కారణమున నట్లు భార్యను కలియకుండ జేసిరో తెలియుటలేదు. బహుశః ఆమె కోరికతోనే యట్లు చేసెడివారేమో! ఈ కథకుగూడ సూర్యపరముగా కొంద రర్థములుచెప్పి వేదార్థములను తారుమారొనర్చుట చింత్యము. ఋగ్వేద ప్రథమ మండలమునందు వధ్రిమతియను నామె వధ్రియను తన భర్తచే సంతానములేక యశ్వినులవలన హిరణ్యహస్తుడను కుమారుని గాంచెనని కలదు. ఈ వధ్రిమతి సప్తవధ్రి భార్యయే కావచ్చును. వధ్రి లేక సప్తవధ్రి నపుంసకుడై యుండునని సాయనాచార్యులు వ్రాసెను. అందుచే వధ్రిమతి యా కాలమున ధర్మసంతానము గనె ననవచ్చును.

## వైదికమత విజృంభణము

క్రీస్తు పూర్వము 7830 ప్రాంతమునుండి ప్రకృతి దేవతల పూజాదులతో నారంభింపబడిన వైదికమతము ఇంద్రాది ప్రత్యక్షనాయకుల పూజలతో యజ్ఞయాగములను పేరిట బెరిగి, వారందరికి తమకుగల నానావిధ వస్తు సంబారములను హవిస్సులను పేరిట నర్పించుట మూలముగా జనులలో ముఖ్యముగా ప్రభు, ఋషి వంశములలో వ్యాపించినట్లు లోగడ కనుగొంటిమి. రానురాని యాగములలో గోవులు, అశ్వములు, వృషభములు, గొర్రెలు, మేకలు మొదలైనవానిని బలిగా నర్పించు తంత్రము లేర్పడెను. యజుర్వేదమంతయు నిట్టి కార్యకలాప మంత్రములచే నిండియున్నది. చివరకీ యాగములలో నరబలులు గూడ దేవతాప్రీతికై చేయసాగిరి. శునశ్శేపుని కథయే దీనికి తార్కాణము. అప్పటినుండి అనగా క్రీస్తుపూర్వము 5000 నుండి భారతయుద్ధకాలమువరకు ననగా క్రీస్తుపూర్వము 1957 వరకు అచ్చటచ్చట నిట్టి నరమేధములు జరుగుచుండెను. జరాసంధుడనేక రాజకుమార్లను దెచ్చి దేవీబలి యిచ్చుచున్నట్లు పురాణములందున్నది. పరశురాముడనేకమంది రాజులను 21 మారు తిరిగి చంపి వారి రక్తముతో పితరులకు తిలోదకాదుల నిచ్చెనట. సామవేదములో కొన్ని ఋక్కులు రచించిన ఋషిపేరు నరమేధ ఋషి. ఈ నరమేధముపై నెంతప్రీతి యాతని దలిదండ్రాదులకుండి యాతని కా పేరు నుంచిరో నూహించ శక్యముగాదు. గోసూక్త, అశ్వసూక్త, పురుమేధ, మేధాతిథియను పేర్లుగూడ కొందరు ఋషులకున్నవి. ఋగ్వేదములో

నచ్చుటచ్చుట నశ్వమాంసము వండి హవిస్సుగా నర్పించుచున్నట్లు కాననగును. వేదవ్యాసుని తాత తండ్రుల ఋక్కులుగూడ ఋక్సామవేదములలో నుండుటవల్ల నా వేదములలో భారతయుద్ధము వరకుండిన ఋషుల రచనలన్నియు జేర్పబడి వేదవ్యాసునిచే బిమ్మట నాల్గు వేదములుగా విభజించబడినట్లు స్పష్టమగుచున్నది. ఈతడు తన శిష్యులలో పైలునకు ఋగ్వేదమును, వైశంపాయనునకు యజుర్వేదమును, జైమినికి సామమును, సుమంతునికి అధర్వవేదమును, సూతునకు పురాణములును నేర్పి ప్రకాశింపజేసెను. ఇది క్రీస్తుపూర్వము 1954 ప్రాంతము. నానావిధ బలులతో విసుగెత్తిన మనదేశము భారతయుద్ధములో జరిగిన హత్యాకాండతో ఋషులకు సైతము మనస్సు క్రమముగా మారినది. వ్యాసుడే బ్రహ్మసూత్రములు, భగవద్గీత మొదలగువానిని రచించెను. ఈతని శిష్యపరంపర క్రమముగా వేదములను పరిశోధించి దుర్గ్రాహ్యమైన భాగములకు వివరణములుగా బ్రాహ్మణములను వ్రాయజొచ్చిరి. కొన్ని భాగము లదివరకే వ్రాయబడెను. ఈ బ్రాహ్మణముల రచనముతర్వాత నా శిష్యపరంపరలో నారణ్యకములు, ఉపనిషత్తులను వేదమత సారములు వెలువడినవి. జైమిని, కౌషీతకి లేక శాంఖాయన, తైత్తిరీయ, వాజసనేయ, కాణ్వ, మాధ్యందిన, మైత్రాయణాది ఋషులు బ్రాహ్మణారణ్యకములను రచించిరి. కొన్ని పూర్వఋషుల పేరిటగూడ చెప్పిరి. ఋషులనేకులీ కాలమున దమ యనుభవములను వెలిబుచ్చుచు వైరాగ్యమును బోధించుచు ఆత్మవస్తువును స్థిరీకరించుచు, పునర్జన్మ సిద్ధాంతమును రూఢిపరచుచు, బ్రహ్మవిద్యను నూతనముగా దెలుపుచు వ్రాయబడినవే యుపనిషత్తులు. ఇవి వేదములలో జేరిపోయిన పిమ్మటనే వైదికమతమునకు మిక్కిలి ప్రాముఖ్యత వచ్చెను. వీనిలో బహిరంగముగ వేదకాలపు కర్మకలాపములు నిరసించకపోయినను పరోక్షముగ వాని ప్రయోజనము స్వల్పముగా రూఢిపరచబడెను. శ్రీకృష్ణుని కాలమునకే యిట్టివి కొన్ని పుట్టియుండెను. యజుర్వేద సంబంధియగు బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్య ఆతని భార్య మైత్రేయి, జనకుడు మొదలగు తొమ్మిదిమంది ప్రవక్తలు సల్పిన వాదములందు పునర్జన్మాదులను గురించి తర్కింపబడి నిశ్చయింపబడెను. ఈ యుపనిషత్తుల సారము క్రమముగా ప్రజలలో వ్యాపించినకొలదిని కొంతవరకు హింసాపద్ధతి తగ్గినను గౌతమబుద్ధుడు జన్మించువరకును యజ్ఞయాగము



లందు జరుగుచునే వచ్చెను. ఆతని మతము వ్యాపించని తావులను, అది క్షీణించిన తర్వాతను మరల నశ్వమేధాదులు రాజులచే కావింపబడుచు వచ్చినట్లు మనకు చరిత్రలు ఋజువుపరచుచున్నవి. వాని నన్నిటి నిచ్చట నుడువజాలము. ఈ రీతిగా వైదికమతము క్రమముగా కొన్ని మార్పులకులోనై యుత్తమస్థితికి వచ్చుటకు 8 వేల సం॥లు పట్టెనుగాని యిందెన్నియో క్రిందిశాఖ లనేకమిప్పటికిని నిలిచియున్నవి. ఈ శాఖల యుత్పత్తినిగురించిగాని ఆ ప్రవక్తల గురించిగాని చెప్పవలెనన్న నొక ప్రత్యేక గ్రంథమగును.

## మరికొన్ని విశేషాలు

యజ్ఞములుచేయు కర్తలకన్న క్రమముగా చేయించు ఋత్విజుల పలుకుబడియు గర్వమును హెచ్చయినట్లు వేదమంత్రములవల్ల దెలియుచున్నది. అసిత, దేవలులను ఋషులు తమకు దానములియ్యని యాగకర్తలను చంపుమనిగూడ ఋక్కుల నల్లుచుండినట్లు సామవేదమునందలి ఉత్తరార్చికములోని యొక ఋక్కు తెలుపుచున్నది. (9-2) ఈ ఋషులు యాగకర్తలవద్ద వలసినంత ధనమును, వస్త్రములను కొల్లగా గైకొనుచుండిరి. పురుషన్తియను రాజు ధనమేగాక 1300 లేక 3 లక్షల వస్త్రములు గైకొనినట్లు సామవేద ఋక్కొకటి తెలుపును. (7-2) సోమలత మొదట ముంజవత్పర్వత సన్నిధి నుండి తార్క్ష్యుడు మున్నగువారు తెచ్చుచుండిరి. క్రమముగా నది యనేకచోట్ల పెంపబడుచుండెను. దాని రసము మిక్కిలి బల, మదములు గూర్చునని వేదములలో పెక్కుచోట్ల చెప్పబడినది. దీనిని త్రాగి యింద్రాదులు తమ విరోధులను జయించువారు. శర్యణావతి సరస్సులో నిది పనికిరాదని యొక ఋక్కులో నున్నది. (సామ 8-5) ఇంద్రుని పరివారవర్గములోని మరుత్తులు రుద్రులు, వాయువులు మున్నగువారికి గూడ నిది యాగములందొసగబడుచుండెను. ఈ యింద్రులలో శృంగవృషుడనువాని కొడుకొక యింద్రుడుగా నుండినట్లు సామవేదము 2-2 లో నున్నది. ఈ వేదమును బట్టి యింద్రుడీ క్రింది రాజులను, రాక్షసులనుగూడ చంపినట్లు తెలియుచున్నది.

యదు, తుర్వసులు, సహస్రబాహువు, నముచి అనువు మొదలగువారు. సాధారణముగా నీ యాగములు తమ విరోధులను చంపవలసియున్న కాలము

లోనే నాటిప్రజలు, లేక ప్రభువులు కావించుచు, నింద్రాదుల సహాయమును గోరుచుండువారు. ఇంద్రుని యంగరక్షకులలో రుద్రగణమొకటి. వారిలో క్రిందట చెప్పబడినవారు గాక అజవీకపాద, అహిర్బుధ్న్య, విరూపాక్ష, రైవత, హర బహురూప, త్ర్యంబక, సురేశ్వర, సావిత్ర్య, జయంత, పినాకి యనువారున్నట్లు లింగపురాణమున గలదు. వాయుగణముగూడ నాటి పురుషులే యనుటకు దృష్టాంతములున్నవి. సత్యశ్రవుడను ఋషి వాయుపుత్రుడని సామవేదమున నైంద్రపర్వము 4-8 లో గలదు. ఇట్లే తృక్షుని పుత్రుడు తార్క్ష్యుడు లేక గరుడుడనియు, నాతని కుమారు డరిష్టనేమియను ఋషి యనియు గొన్ని ఋక్కులవల్ల దెలియును. గరుడునే సుపర్ణుడనిగూడ యందురు. తృక్షి పురుకుత్సరాజు కుమారుడగు త్రసదస్యుని వంశీకుడని కొన్ని ఋగ్వేద ఋక్కులు తెలుపును. ఋక్సామవేదములలో మరికొందరు రాజులపేర్లు గావచ్చుచున్నవి. వీరి చరిత్రలన్నియు భావి పరిశోధకులు పురాణాదులనుబట్టి నిర్ణయింపనగియున్నది.

"రాజులు - వృషణాశ్వుడు— ఈతనికి యింద్రుడు మేన యను కన్యను కుమార్తెగా నిచ్చెను. (ఋ 1-10) ఆయువు, కుత్సుడు, అతిథిగ్వుడు వీరిని విశ్రవ వశునకు యింద్రుడు లోబడజేసెను. యదువు, ఉగ్రాదేవుడు, నవవాస్త్వుడు, బృహద్రధుడు, తుర్వీతి, శార్యాతుడు, వృషాగిరి పుత్రులగు ఋజ్రాశ్వ, అంబరీష, సహదేవ, భయమాన, సురాధులు, శర్యాతి, ఋమ, ఋశమ, శ్యావక, కృప, కురుస్రుంజయ రాజులు, త్రిసదస్యు, మాంధాత మొదలగువారు," ఇందలి ఆయువు పురూరవుని కొడుకనియు, మాంధాత సూర్యవంశములోనివాడనియు, యదువు యయాతి కొడుకులలోని వాడనియు, శర్యాతి యయాతికి 8 వ తరములోనివాడనియు, పురాణములం దున్నది. వీనినిబట్టిగూడ యింద్రుడానాటి ప్రజలకు రాజేనని తెలియగలదు. ఇక నీతని యాధిపత్యములో భూలోకమున గాక ఖగోళములో నున్నదని జెప్పబడెడి స్వర్గమును గురించి నుడివెదము. కఠోపనిషత్తులో యముడు అగ్నివిద్య నెరుంగువారు స్వర్గాది యనంతలోకములను బొందుదురని నచికేతునికి జెప్పెను. ఇచట యనంతలోకములు ఖగోళములోని నక్షత్రాదిలోకములను సూచించును. ఇతడు నుడివిన స్వర్గలోకము ఆదిత్యలోకముగా గన్పడుచున్నది. పుణ్యాత్ములు అర్చిరాది మార్గమున



ఆదిత్యుని జేరుదురను విషయము లోగడ తెలుసుకొంటిమి. ఇదియే యాతడు పేర్కొనినది. దీనికిని యింద్రరాజధానియను సువర్గము లేక స్వర్గమునకు సంబంధము లేకున్నను యింద్రుని పేరిట గ్రహ నక్షత్రనామకరణము జేసినట్లే నాతని రాజధాని పేరున యింద్రాధిపత్యముగా నీ అదిత్య స్వర్గమున్నట్లు సనత్పూర్వఋషులూహించి కల్పించినట్లు చెప్పవచ్చును.(*) తక్కిన లోకము లిట్లే నప్పటి దేవతార్యుల గణముల పేరిట నూహించిరి. ఇదియే గంధర్వ, పితృ, బ్రహ్మాదిలోకములు. దేవతార్యులు పూర్వము గోవుల నొక ప్రక్క పూజించుచునే గో వృషభములను యాగములందును పితృకార్యములందును వధించుచుండిరి. దేవపితృకార్యములలో జేయుహింస హింసకాదని చెప్పిరి. పితృకార్యములలో ముఖ్యముగా మాంసము పెట్టవలెనని మనుస్మృత్యాదులం దున్నది. అశ్వమును వధించి అశ్వయాగము చేయుటే గాక దాని వీర్యమును ముందుగా 3 దినములు యజ్ఞకర్తభార్యకు యోనిగుండా ప్రవేశింపజేయువారు. అట్టివారి కశ్వములవంటి బలసంపన్నులగు పుత్రులు జనింతురని నాటి విశ్వాసము. ఈ యశ్వమేధ, గోమేధ, నరమేధములు క్రమముగా నాగరికత వచ్చినకొలదిని కలియుగమునకని పేరుబెట్టి నిషేధించిరి. వాల్మీకిరామాయణమున నశ్వమేధమున జరుగు కలాపము వర్ణింపబడినది. శ్రీనాధుడు గూడ దీని నొకచోట వివరించినాడు. అశ్వమేధము జరుగుకాలమున పఠింపవలసిన మంత్రములు యజుర్వేదమునం దున్నవి. ఈ రీతిగనే తక్కినవియు. యజ్ఞములందు దేవతలకు నిచ్చుట కే వస్తువును నిషేధింపనట్లే కనబడుచున్నది. పౌండరీకయాగమున యజ్ఞకర్త, భార్యయు కలసి తమ శుక్లశోణితములను అగ్నియందు వ్రేల్చు కలాపము గలదు. క్రమముగా నీ పని యితరులచే చేయించు ఆచారమువచ్చి నేటికిని అటనట జరుగుచున్నది. దేవతలకు ప్రీతియగువస్తువు నిచ్చి తృప్తి పొందింపవలెనను మూఢవిశ్వాసమే యిట్టి యజ్ఞయాగాదుల నిర్మాణమునకు కారణము. వీనికన్నిటి కనేకమహత్తులు, స్వర్గభోగాది ఫలములు చెప్పుటవల్లనే పల్వురు భ్రమించువారు, నిజము చెప్పవలెనన్నచో, నిట్టికలాపములన్నియు మనవారి యూహాజనితములే, విషయవాసనా లంపటులే యనవచ్చును.

(*) ఋగ్వేదము 5, 6, 7, 10 మండలములలో కొన్నిచోట్ల కొందరు ఋషులు ఇంద్రుని సూర్యపరముగా నుతించిరి.

## ఉపనిషన్మతము

క్రీస్తుపూర్వము 7850 సం॥ల నుండి యున్న ప్రజాపతులు, విష్ణువులు. శివులు ఇంద్రులు మున్నగువారిని దేవతలుగా నవగా అధికారులుగా మన భరతభూమిలో ప్రజలు పూజించుచున్నను, వారు ఆయా కాలములందలి తమ కోరికలను బడయుటకై యట్లు మొట్టమొదట చేయుచువచ్చిరిగాని యీ ప్రకృతికంతటికిని వారే ఆధారభూతులని మాత్రము నమ్మియుండలేదు. ఈ కారణముననే మన పూర్వులలో ప్రతిభావంతులైన ఋషులు తరువాత కాలమున అప్పటియున్న వేదశాస్త్రములు పరిశోధించియు, నసేక పెద్దలతో చర్చించియు, తాము తపముచే పరిశోధించియు సత్యమతమును కనిపెట్టుటకై యెంతో ప్రయాసపడిరి. అట్లు కష్టపడి కనిపెట్టినదే వేదాంతము. ఇదియే యుపనిషన్మూలమున మనకు వేదములలో నిపుడు లభ్యమగుచున్నది. దీనికి పూర్వము సృష్టి యెవ్వడెప్పుడెట్లు దేనితో చేసెనను విషయము సృష్టికర్తకుగూడ తెలియునో లేదోనని ఋగ్వేదము 10 వ మండలములోని 129 వ సూక్తము వచించెను. సృష్టియైన పిదపనే దేవత లేర్పడిరని గూడ యందున్నది, (*) మొట్టమొదట బ్రహ్మలును, మనుసంతతివారందరును ఈ దేశమున వసించుచు, యప్పటికి సూర్యచంద్రాది కొలది ప్రకృతి (Elements) దేవతలను మాత్రము పూజించుచుండిరి. గాని వారికి మూల కారణమగు పరమాత్మ యొక్కటి కలదను భావము చాలకాలమునాటికి గాని తోచలేదు. అందువల్లనే యీవిషయమై యనేక భేదాభిప్రాయములు, వాదోపవాదనలు, పరిశోధనలు ఆరణ్యకములలోను, ఉపనిషత్తులయందు నున్నవి. జీవులెట్లు యితరలోకమునకు బోయి మరల వచ్చి యీ లోకమున పుట్టుదురో మున్నగు విషయములన్నియు నీ కాలమునందే చర్చింపబడి బలీయ

(*) "కో అద్ధావేదక ఇహప్రవోచాత కుత అజాతా కుత ఇయమ్ విసృష్టిః।
అర్వాగ్దేవా అస్య విసర్జనేన అథాకో వేదయత ఆబభూవ॥"
(ఋగ్వే. మం. 10-129-6)

"ఇయం విసృష్టిర్యత ఆబభూవ యదివాదధే యదివానయో అస్యాధ్యక్షః।
పరమేవ్యో మనసో అంఙ్గవేద యదివానవేద॥" (ఋగ్వే మం. 10-129-9)



మైన కర్మసిద్ధాంతమునుగూడ తెలుసుకొనిరి. పరమాత్మ శరీరధారియై జీవ నామరూపములు ధరించి కర్మల నొనరించుచునిగూడ గ్రహించిరి. జనకమహారాజు కాలమునాటికి (దాదాపు క్రీ. పూ. 3150) మన మతమందలి చర్చ చాలవరకు ముగిసి యద్వైత వేదాంతము సిద్ధాంతపరచబడినట్లు కనబడును. అయినను అదివరకు వ్యాప్తియైన బహుదేవతా ప్రార్థనాదిమతమును ఖండింపకుండ యాత్మ జగద్వ్యాపితమైన వస్తువుగ గుర్తెరింగి జగత్తులో దేని నే రూపముగ బ్రార్థించినను పరమాత్మకే చెందునను సిద్ధాంతముతో భక్తి మార్గముగూడ హర్షింపబడెను. ఈ రెండునుగాక కేవలము విజ్ఞానదృష్టితో జూచువారికి "సర్వం ఖల్విదం బ్రహ్మ" మనునట్లు అంతయు బ్రహ్మ స్వరూపముగా భావించుచు నందులో తానుగూడ లీనమై బ్రహ్మభావన చేయు జ్ఞానమార్గముగూడ ప్రకటితమయ్యెను. ఈ మూడు మార్గములును జనులు తరించుటకుత్తమమార్గములే యని ఋష్యాదులు తలంచిరి. శ్రీకృష్ణుడు క్రీస్తుపూర్వము 1900 ప్రాంతముననుండి దీనినే యర్జునునకు బోధించుచు, ఆస్తికబుద్ధిచే సర్వ ప్రపంచమును పరమాత్మయందున్నట్లు భావించి, జీవులు తమతమ కర్మలందు కర్తృత్వాహంకారముల నుంచుకొనక, నిష్కామకర్మముల నొనర్పవలెనని సర్వోపనిషత్తుల సారముగా జెప్పియున్నాడు. దీనినే ఈశావాస్యోపనిషత్తుగూడ నీ క్రింది శ్లోకముచే జెప్పియున్నది.

"ఈశావాస్యమిదమ్ సర్వమ్ యత్కించత్ జగత్యామ్ జగత్
తేనత్యక్తేన భుంజీథా మాగృధః కస్యస్విత్ ధనమ్॥"

ఈ విధముగా భక్తి జ్ఞాన కర్మ వైరాగ్యములు మన హిందూమతమున క్రమముగా వృద్ధిజెందెను. మొదటిదగు భక్తి శాఖావృద్ధికై క్రమముగా రెండవయుగమునం దనేకప్రతిమలు, దేవళములు, వానిలో పూజాపునస్కారాదులు నైవేద్యాదుల సమర్పణములు, మేళతాళాలు, చివరకా ప్రతిమలకే వివాహాదులు, పట్టాభిషేకాదులు చేయు తంత్రములన్నియు నేర్పడెను. వీనిని కట్టుబాటొనర్చుటకై శైవాగమములు, వైష్ణవాగమములు రచింపబడెను. ప్రజోపయోగముకొరకై యేర్పడిన మతసంస్థకర్తల లేక యధికారులనే రానురాను ప్రధాన దేవరలుగా భావించి, వారికి పైన నుడివినట్టియు

నింకను షోడశోపచారాది విధులచే వారి విగ్రహములకు బూజలను గావించు నాచారము వృద్ధిజెంధి, మతకర్తల యొక్కయు మతాభిమానులగు పూర్వ రాజన్యులయొక్కయు సహాయ ప్రోత్సాహములచే నభివృద్ధికి వచ్చెను. అయినను విజ్ఞానశీలురగు కొందరు ఋషులబోధచే వేదాంతజ్ఞానముగూడ నభివృద్ధిజెందెను. సామాన్యజనులు భక్తి, కర్మసిద్ధాంతముల ననుసరించుచు వచ్చిరి. ఈ మూడు సిద్ధాంతములపైన నింక ననేక యుపశాఖలు బయలు వెడలి యనేకపేర్ల నింటింటికొక దేవత నిర్మింపబడి మన దేశములో వ్యాపక మాగనున్నను, సర్వేశ్వరుడొక్కడే యను భావమూమాత్రము సర్వత్రను గ్రహింపబడుచున్నది. ఏ మతగ్రంథమైనను మన హిందూదేశమున నీ భావ మునే బలుకుచున్నది. ఈ నిర్వచనము చేయబడుటకు యెన్నియో పరిశోధ నలు చేసిగాని ఋషులీ నిర్ణయమునకు రాలేరు. ఏ మతమువారి మతకర్త యైనను ఆతడే సర్వలోకాధిపతియని లేక యాతని యంశయని యా మతస్థులు నమ్మ మొదలిడిరి. కొందరట్టివారిని ఆ సర్వకర్తకు కుమారుడని పలుకు చుందురు. రామకృష్ణులు పరమేశ్వరుని విశ్వరూపమున వెంటుకవాసి వారని భాగవతమున నున్నది. ఈ విధముగా జూచినచో ప్రపంచమునందలి ఆస్తికమతములన్నియు నొక్క ప్రధానవిషయమునే బలుకుచున్నవనవలెను. అది యేమన—సర్వేశ్వరుడొక్కడే, వాని నామములు దేశ, కాలభేదము లచే వివిధములు. అతని యంశయే ప్రవక్తలలో ప్రస్ఫుటమగుచుండును. వేదపురాణాదులు నింతవరకు చారిత్రకదృష్టిలో గావించిన చర్చల సారాంశ ముగా మన దేశపు వాస్తవికచరిత్ర యీ దిగువ క్లుప్తముగ నిర్మింపబడు చున్నది. పురాణాదులలో గన్పడు యితరవర్షముల సంగతిని వదలి ముఖ్య ముగా భారతవర్షపు చరిత్రయే యిందు పేర్కొనబడుచున్నది.

—౧—

# సప్తమప్రకరణము

## నిజమైనచరిత్రము – మనువుల పాలనము

క్రీస్తుపూర్వము 7800 సంగల నుండి దాదాపు క్రీ. పూ. 6650 వరకు మన దేశమున కొందరు మనువులు పాలించుచుండిరి. వారిక్రింద ఇంద్రులు, రాజులు అను రెండు తెగల పాలకులుండిరి. ప్రతి మనువుక్రిందను సప్తర్షు లను సలహాసంఘ ముండెను. మతరాజ్యముల రక్షణకొరకై విష్ణువొక డుండెను. ప్రజల సాంఘిక వ్యవహారోద్ధరణకును, ప్రజాసృష్ట్యభివృద్ధి నొనర్చుటకును, దత్కార్యసిద్ధికై వలయు ప్రార్థనాకార్యములు సల్పుటకును ప్రజాపతులుండిరి. ఈ ప్రజాపతు లందరిపైన నొక బ్రహ్మ యుండెడివాడు.

స్వాయంభువు— మొట్టమొదట కొందరు బ్రహ్మలు మనదేశమునకు క్రీ. పూ. 7800 ప్రాంతమున వచ్చిరి. వీరందరిపై పాలనసల్పిన మొదటి మనువు స్వాయంభువు. ఈయన చక్రవర్తిహోదాలో నుండెను. ఈయన చేతిక్రింద ప్రియవ్రత, ఉత్తానపాదులాది రాజులు 10 మంది వివిధ ప్రదే శములందు ఉత్తరహిందూస్తానము బాలించుచుండిరి. ఆప్రదేశములు విడిగా గుర్తింపజాలము. సుయజ్ఞుడను యింద్రుడు కొంతదేశము ఆ కాలమున పాలించెను. ఇతడు కొంతకాలము విష్ణువుగాగూడ వ్యవహరించెను. ఈయన గాక కర్దమ ప్రజాపతికి దేవహూతికి జనించిన కపిలుడే ఆ కాలమున విష్ణు వయ్యెను. ఈతడే వైష్ణవమతమును (సాంఖ్య) ఆరంభించినవాడు. ఈ మొదటిమనువు కాలములోనే చాలమంది ప్రజాపతు లుండెడివారు. దక్షుడు, రుచి, కర్దముడు, అధర్వ, అత్రి, ధర్ముడు, మరీచి, కశ్యప, వశిష్ట, నారద, పులహ, పులస్త్య, భృగు, క్రతువు, అంగీరసాదులు. ఇందలి పులస్త్యుని కుమారు డగస్త్యుడు. అంగీరసుని పుత్రుడు బృహస్పతి. వీరందరును బ్రహ్మలనిగూడ యనబడు చుండిరి. ఈ మనుకాలములో జలప్రళయము

వచ్చెను. ఇల యనుచోట నీతని నావ యప్పుడుండెను. (*) ఈ మనువు పాలించుచుండగా, సోమకాసురుడు వేదములను దొంగతనముగా నేర్చి విష్ణువగు సుయజ్ఞునిచే సంహరింపబడెను. ఈ రక్కసుడే కాలోలు మనువు మీదకు వచ్చి యాతనిని దినుటకు ప్రయత్నింపగా నీ విష్ణువే కాపాడెను. మనువు కుమారులలో ప్రియవ్రతుడు తర్వాత పాలించెను. ఇది దాదాపు క్రీస్తు పూర్వము 7700 సం॥ల ప్రాంతము.

ప్రియవ్రతుని వంశపాలనము — ప్రియవ్రతుడు సప్తద్వీపముల నేలినట్లు భాగవతమున నున్నది. ఇతడు తనరాజ్యము నేడు ద్వీపములుగా భాగించి తన కుమాళ్ళను పాలించ నియమించెనట. ఆగ్నీధ్ర, ఇధ్మజిహ్వ, యజ్ఞబాహు, హిరణ్యరేత, ఘృతపృష్ఠ, మేధాతిథి, వీతిహోత్రులను కుమారు లేడ్వురును జంబు, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మల పుష్కర ద్వీపములు పాలించిరని చెప్పబడినది. ఇవి యింకను గుర్తింపబడలేదు. ఇవి హిమాలయము చుట్టును గల ప్రదేశము లగునేమో! ఆగ్నీధ్రుడు జంబూద్వీపము నేలుచు దానిని తొమ్మిది వర్షములుగా విభజించి, తన కుమాళ్ళలో నాభి, కింపురుష, హరి, ఇలంవృ, రమ్యక, హిరణ్మయ, కురు, భద్రాశ్వ, కేతుమాలులనువారల పాలింపనిచ్చెనట. ఈయగ్నీధ్రుడు తన సోదరుడగు ఉత్తమునివలె మనువుకాలేదు. ఇందలి హరివర్షమునందే నృసింహుడైన విష్ణువు నివసించెను. నాభిపాలనతర్వాత నాతని కుమారుడు ఋషభుడు నాభిభాగమును పాలించి పేరొందెను. అది అజనాభ మనబడెను. ఈతనికి చాల విద్యలందు ప్రవేశముండెను. ఈతనికి యింద్రకుమార్తెయైన జయంతివల్ల భరతుడాది 100మంది కుమాళ్ళు గల్గిరి. వారిలో భరతుడు రాజయ్యెను. ఆ పేరిటనే యీ రాజ్యము తర్వాత భారతవర్షమనియు, భరతఖండమనియు పేరొందెను. అతని తర్వాత 18 మంది, తర్వాత గయుడు, తర్వాత 11 లేక 12 మంది పాలించిరి. ఇందలి

(*) ఇది కాశ్మీరులో నున్నది. ఈ జలప్రళయము క్రీ. పూ. 7500 సం॥ ప్రాంతమున వచ్చియుండునని డా॥ ఎ. సి. దాసు మొదలగు పండితులు గూడ నభిప్రాయపడిరి. అందుచే మనుకాలము మనము నిర్ణయించిన దానికిది సరిపోవుచున్నది.



గయుడు షోడశమహారాజులలో నొకడుగా పేరొందెను. భరతవర్షము ఋషభుని కాలములో కుశావర్త, ఇలావర్త, బ్రహ్మావర్త, ఆర్యావర్త, మలయకేతు, భద్రసేన, నిద్రస్పృక్కు, విదర్భ, కీకట దేశములుగా విభజింపబడి యీ పేరిట కుమాళ్ళక్రింద పాలనలో యుండెను.

ఉత్తానపాదుని వంశము— మనువు కుమారుడగు ఉత్తానపాదుడు కొంత భూమి నేలెను. అతని తర్వాత నెట్లనో ఆనాటి విష్ణువుసాయముతో ధృవుడు రాజయ్యెను. ఈ ధృవుడు 75 సం॥లు పాలించినట్లు కన్పడుచున్నది. అతని వంశమున వత్సరుడు, పుష్పార్ణుడు, సర్వతేజుడు, చక్షుస్సంజ్ఞుడను వారలు వరుసగా పాలించిరి. ఈ చాక్షుషుడే ఆరవ మనువయ్యెను.

స్వారోచిషుడు— స్వాయంభువమను కుమాళ్ళ పాలనము ముగిసిన పిమ్మట దాదాపు క్రీ. పూ. 7600 ప్రాంతమున స్వారోచిషుడనువాడు రెండవ మనువయ్యెను. ఈతడు వసిష్ఠుని కూర్జయను సతియందు జన్మించెను. ఈతని కాలములో ద్యుమత్సుషేణ, రోచిష్మతాదులు 12 మంది రాజులుగా నుండిరి. రోచనుడనువా డింద్రరాజ్యమేలెను. రాజ్యరక్షణకై విభుడను నతడు విష్ణువుగా నుండెను. ఈతడు మొదటి యింద్రవిష్ణువులుగా నుండిన సుయజ్ఞునికి దక్షిణయను భార్యయందు జనించినవాడు. ఈ స్వారోచిష మనుకాలమున ఊర్జస్తంభాది ఋషులు సప్తర్షులుగా నుండిరి. విష్ణువీకాలములో కేవల రక్షణాకార్యము లొనర్చుటయే గాక కౌమారిక బ్రహ్మచారియై యుండి 8 వేలమంది మునులకు నాయకుడై మతకర్తగూడ నయ్యెను.

ఉత్తముడు—స్వారోచిషునితర్వాత ప్రియవ్రతుని కుమారుడును, మొదటి మనువునకు మనుమడు నగు ఉత్తముడనువాడు మనువయ్యెను. ఇది దాదాపు క్రీ. పూ. 7400 సం॥ లగును. ఈయన కాలములో పవన, సృంజయ, యజ్ఞహోత్రాదులు రాజులుగా వ్యవహరించిరి. సత్యజిత్తను నతడు (సుశాంతుడని కొన్నింట గలదు) యింద్రపదవిలో నుండెను. సత్యసేనుడు విష్ణువుగా నుండెను. ఈతడు ధర్ముడగువానికి సూనృతయను భార్యయందు జనించినవాడు. ఈ కాలమున వశిష్ఠసుతులు సప్తర్షులుగా నుండిరి. ఈ మనుకాలమందు యక్ష, రాక్షసులు దుష్టశీలురుగా నుండగా నట్టివారిని విష్ణువు ఖండించెనట.

తామసుడు—క్రీ. పూ. 7250 ప్రాంతములో తామసమనువు పాలన వచ్చెను. ఈయన యుత్తముని భ్రాత. ఈతనిక్రింద కేతు, వృష, నరఖ్యాత్యాది రాజులు వివిధప్రదేశముల బాలించుచుండిరి. దేవరాజ్యము త్రిశిఖుడను యింద్రుడు పాలించెను. హరిమేధుని కొడుకగు హరి విష్ణువుగా నుండెను. ఇతడే గజేంద్రుని మకరిబారినుండి రక్షించెను. గజేంద్రుడన యేనుగమాత్ర ముగా భావింపరాదు. ఇతడు ద్రావిడదేశము నేలుచుండిన ఇంద్రద్యుమ్న మహారాజు. ఈతనిని మకరివలె బట్టినది గంధర్వులలోని హూహూ నాముడు. ఈత డగస్త్యశాప ప్రేరితుడై యారాజును లోబరచుటకు బాధించు చుండగా నాతడు విష్ణువును ప్రార్థించి, యాతని బారద్రోలిన కథయే చమత్కారముగా కరి మకరి యుద్ధముగా వర్ణింపబడినది. అగస్త్యుడు వింధ్య దాటి ద్రావిడరాజ్యములను లోబరచుకొనుటకు వచ్చిన కాలములో మర్యాద సరిగా జేయలేదని పగబట్టి గంధర్వుని పంపించి యింద్రద్యుమ్నుని హింసించెను. ఈ మనుకాలములో జ్యోతిర్ధామాదులు ఋషులుగానుండిరి.

రైవతుడు—తామసవంశపాలన పిమ్మట రైవత మనువంశపాలన వచ్చెను. ఇది దాదాపు క్రీ. పూ. 7100 సం॥ ప్రాంతము. ఇతడు తామసుని తమ్ముడు. ఈతనిక్రింద ప్రతివింధ్య, అర్జునాది సుతులు రాజులుగా పాలించిరి. ఇంద్ర రాజ్యమునకు శుభ్రుడు రాజుగా నుండెను. వసుకని కొన్నింట గలదు. ఈ కాలములో వికుంఠుడను విష్ణువు దేశరక్షణకార్యము లొనర్చెను. ఈతడే వైకుంఠము గట్టించినది.

చాక్షుషుడు— రైవతవంశపాలన తర్వాత క్రీ. శ. 6950 ప్రాంతమున నీ వంశపాలన వచ్చెను. ఈతని పాలన పిమ్మట నితని సుతులగు పురు, పురుష, సుద్యుమ్నాది రాజులు వివిధ స్థలములందు బాలించిరి. దేవరాజ్య మున మంత్రద్యుమ్నుడు లేక మనోభవుడను యిందుడ్రుండెను. ఆ హవి ష్మద్వీరకాదులు సప్తర్షులుగా నుండిరి. అజితుడను విష్ణువు ఆ కాలమున రాజ్యరక్షణాధిపతి. ఈతడే కూర్మమువలె వ్యవహరించి మందరగిరి మథన కార్యమును సాధించెను. ఈ మనువు తర్వాత నాతని పన్నిద్దరు కుమాళ్ళలో ఉల్ముకుడు రాజయ్యెను. క్రమముగా నీ వంశములో అంగుడు, వేనుడు, పృథువు, విజితాశ్వుడు మున్నగువారు పాలించిరి. ఇందలి వేనుడు బ్రాహ్మణ మతమును ధిక్కరించి బ్రహ్మ విష్ణు శివులకుబదులు రాజగు తననే యెల్లరును



సేవింపుడని శాసించుటచే బ్రాహ్మణులాతనిని రహస్యవిధమున బరిమార్చిరి. తర్వాత బ్రాహ్మణులచే దేబడిన పృథుచక్రవర్తి బ్రాహ్మణానుకూలముగా బాలించెను. ఈతని భార్యయగు అర్చి, యితడు చనిపోయినపుడు సహగమన మొనరించెను. ఆ కాలమునకది గొప్పగా నుండెను. పృథువునకు ఆ కాలము యింద్రునకు సరిపడక, పృథువొనర్చిన యజ్ఞాశ్వముల నింద్రుడు పలుమార్లు పట్టుకొనిపోయి హింసించెను. పృథుకుమారుడగు విజితాశ్వు డింద్రుని జయించి వానిని గొనితెచ్చి యింద్రుని బట్టగా, తుదకు బ్రహ్మ రాజీకుదిర్చి పోరుమాన్పెను. ఇది దాదాపు క్రీ. పూ. 5800 సం॥ నాటి విషయము.

వైవస్వతవంశ పాలనము— చాక్షుషమను వంశపాలన కాలము జరిగిన పిమ్మట యితని పాలన వచ్చెను. ఈతడు సూర్యకుమారుడని చెప్పబడినది. ఈ పాలన ఆరంభం క్రీ. పూ. 6750 సం॥ ప్రాంతము కాలము కావచ్చును. ఈతని కుమాళ్లు ఇక్ష్వాకు, నభగుడు, ధృష్టుడు, శర్యాతి, అరిష్యంతుడు, నాభాగుడు, దిష్టుడు, కరూశకుడు, బృషధ్రుడు, వసుమంతుడనువారు వివిధ ప్రదేశముల బాలింప మొదలిడిరి. ఆ యా స్థలములనిపుడు గుర్తింపజాలము. ఈ కాలములో దేవరాజ్యము పురందరుడనువాడు పాలించెను. కశ్యపాత్రి భరద్వాజ గౌతమ విశ్వామిత్ర వశిష్ట జమదగ్నులు సప్తర్షులుగా నున్నట్లు భాగవతమున నున్నది. కాని యిప్పుడు నక్షత్రములందలి సప్తర్షులకే పేర్లుగాక పులహ, క్రతు, వశిష్ట, కశ్యప, అత్రి, గౌతమ,జమదగ్నుల పేర్లు వాడబడు చున్నవి. ఈ మన్వంతరముననే వామనుడు విష్ణువుగా వ్యవహరించెను. దేవరాజ్యమును మాయోపాయమున బలివద్ద దానముగా బరిగ్రహించి మరల యింద్రునికిచ్చెను. ఈతడు నుడివిన మూడు పాదములు భూమ్యాకాశ వాయుప్రదేశము లను మూడేగాని యన్యముగాదు. వైవస్వతుడు మొదట ద్రావిడదేశమున సత్యవ్రతుడను రాజుగానుండి, దేవతలకు సాయపడుచు వచ్చినందున నాతనిని మనువుగా జేసినట్లు కనబడుచున్నది. ప్రాయశః నితడు బలి మున్నగువారిని లోబరచుకొనుటలో సాయపడి యుండును. ఇక భావి మనువులను పేరిట నున్నవారి పాలనా వివరములు తెలియ రాదము.

సూర్యసావర్ణి— ఇతడు వసువులలో చివరివాడు. ఈయన కాలమున దీప్తిమా విరజిస్కాద్యులు రాజులుగను, బలి యింద్రుడుగను, పరశురామ,

అశ్వత్థామ, కృప, బాదరాయణ, ఋష్యశృంగాదులు ఋషులుగను, వామనుడీ కాలమున విష్ణువుగను, ఉండి పాలించిరని భాగవతమున గలదు.

దక్షసావర్ణి— ఇతడు వరుణుని కొడుకు. క్రమముగా ప్రసిద్ధికి వచ్చి మనువై యుండును. ఈతని పాలనలో ధృష్టకేతు, దీప్తకేతు మున్నగు రాజులును, అద్భుతుడను యింద్రుడును, ద్యుతిమంతుడు మున్నగు ఋషిగణమును అద్భుతుడే విష్ణువుగను వ్యవహరించిరి.

బ్రహ్మసావర్ణి— ఈయన ఉపశ్లోకుని కుమారుడు. ఈతని కాలములో భూరిషేణాదులు రాజులుగను, శంభుడను యింద్రుడును, విభుడను విష్ణువును హవిష్మతాదులు సప్తఋషులుగను ఉండి పాలనజరిగెను.

ధర్మసావర్ణి—ఈతని కాలమున సత్యధర్మాదులు రాజులుగను, వైధృతుడను నాతడు దేవరాజుగను, ధర్మసేతువను నాయన విష్ణువుగను, అరుణాదులు ఋషులుగను ఉండిరి. ఈ 11 వ మనుకాలములో తృణబిందుడున్నట్లు పురాణములందున్నది.

భద్రసావర్ణి— ఈయన కాలమున దేవతదుపదేవ దేవశ్రేష్ఠాదులు రాజులైరి. ఋతుధాముడింద్రుడయ్యెను. స్వధాముడు విష్ణువయ్యెను. తపోమూర్తి, తపాగ్నిధ్రుగాదులు ఋషులైరి. ఇందలి రాజులు భారతకాలపు శ్రీకృష్ణుని తండ్రియగు వసుదేవుని బావలు, మరుదులుగా నున్నారు.

దేవసావర్ణి— ఈయన కాలమున చిత్రసేన విచిత్రాదులు రాజులుగానుండి దివస్పతి దేవరాజై, యోగవిభుడు విష్ణువునై యుండిరి. నిర్మోహ తత్వదర్శి మున్నగువారు సప్తర్షులైరి.

ఇంద్రసావర్ణి— ఈయన కాలమున గంభీరవస్వాదులు రాజులుగాను, శుచి దేవేంద్రుడుగాను, బృహద్భానుడు విష్ణువుగాను, అగ్నిబాహు, శుచి, శుక్ర మాగధాదులు ఋషులుగాను వుండిరి.

వీరిలో కొందరు అయోధ్యలో యిక్ష్వాకు మున్నగువారు 7 వ మనువు కాలములో నుండగానే వివిధ ప్రదేశముల నున్నారేమోనని తోచుచున్నవి. ఈ రాజులపేళ్లు కొన్నికొన్ని వంశావళులందు గలవు. గాని సంపూర్ణముగా లేవు. ఈ కాలమంతయూ దాదాపు 1200 సం॥ల యొక యుగమని చెప్ప వచ్చును. అనగా కృతయుగమున క్రీ. పూ. 6500—5300 మధ్యవారన వచ్చునుగాని దేవరాజ్యము శ్రీకృష్ణకాలమువరకు నున్నట్లు లోగడ తెలిపి



తిమి. అందుచే నది క్రీస్తుపూర్వము 1900 సం॥ల వరకు నున్నట్లు భావింప వచ్చునుగాని యీ రాజ్యములోని యింద్రులు మొదలైనవారి చరిత్రము మనకు దొరకుటలేదు. భావిమనువులుగా చెప్పబడిన మనువులు ఒకేకాలము నాటివారుగాక, భారతయుద్ధకాలమువరకు పేరొందినవారైనను గావచ్చును.

## సూర్యవంశ పాలనము

ఇక్ష్వాకుపాలనము—వైవస్వతమను కాలములోనే యీతని కుమారుడగు యిక్ష్వాకుగూడ పాలించెను. ఈతని కుమారుల 100 గురిలో వికుక్షి, నిమి, దండకుడను మువ్వురును కొంతభూమి నేలిరి. 25 గురు తూర్పుభూమిని, 25 గురు పడమరదేశమును, 47 గురు ఉత్తరదక్షిణముల భూములను పాలించినట్లు చెప్పబడినదిగాని యివియన్నియు గుర్తింపజాలము. నిమి మిథిలప్రాంతమును, వికుక్షి యయోధ్యను పాలించిన దృష్టాంతములున్నవి.

శర్యాతివంశ పాలనము— మనువు కుమారులలో నొకడగు శర్యాతి కొంత భూమి నేలెను. ఈతని కుమార్తె సుకన్యనే చ్యవనఋషి పెండ్లాడెను. ఈతనికి నాల్గవ తరములో రైవతుడనువాడు పాలకుడవచ్చి సముద్రమున కుశస్థలినగరమును గట్టించి పేరొందెను ఆకాలములో సప్తసింధుప్రాంతము చుట్టును సముద్రముండెను. ఈ రైవతుడను రాజు దాదాపు క్రీస్తుపూర్వము 6400 ప్రాంతీయుడనవచ్చును.

నృగవంశ పాలనము— నృగుడు కొంతభూమిని పాలించెను. ఆతనికి పిదపవాడగు సుదర్శనుడు అతిథి పూజానురక్తుడై తన భార్యను సైతమతిథి కర్పించెను. ఈ యాచారమప్పటికి శిష్టులలోనున్న స్త్రీతర దృష్టాంతములు గలవు. ఈ సుదర్శనుడు క్రీ. పూ. 6250 ప్రాంతీయుడు. శ్వేతకేతు కాలమున నీ యాచారము తొలగింపబడెను.

అరిష్యంతుని వంశము— ఈ వంశమువారు అగ్నివేశ్య బ్రాహ్మణ కులముగా మారిపోయిరి. వీరు రాజ్యాధిపతులు కాలేదు.

ధృష్టుని వంశము — ధృష్టుడు మనువుతర్వాత కొంతభూమి నేలెను. ఈతని 14 వ తరములో మరుత్తనువాడు చక్రవర్తి యయ్యెను. ఈతడు క్రీ. పూ. 6850 ప్రాంతీయుడు. ఈతనివద్ద సంవర్తుడను యాజకుడుండి

యితనిచే యజ్ఞములు చేయించెను. ఈతనితర్వాత నీవంశమున ఆగవవాడుగా బిందుమంతుడు వచ్చెను. తర్వాత నీ వంశమునందు శశిబిందు, తృణబిందు మున్నగువారు పాలించిరి. తృణబిందుని కుమారుడగు విశాలుడు తనపేరిట వైశాలి నగరమును నిర్మించెను. ఇతడు క్రీ. పూ. 5800 వాడన వచ్చును. ఈ వైశాలుని తర్వాత 7 గురు పాలించిరి. చివరివాడు సుమతి కొడుకగు జనమేజయుడు; వీరందరును వైశాలి రాజులుగా పేరొందిరి.

నభగుని వంశము— నభగుడు కొంత భూభాగమును మనువు తర్వాత పాలించెను. ఆతని తర్వాత నాభాగుడు, తర్వాత నీతని కొడుకగు అంబరీషుడును పాలించిరి. అంబరీషుడు విష్ణువునందు భక్తిగల్గియుండి, దూర్వాస మహర్షిని సైతము పాదాక్రాంతుని చేయగల్గెను. ఈతని పేరిట నిప్పటికిని నాగపూరు ప్రాంతమున నొకతీర్థమున్నది. కరూశకుని కుమారులు కారూశు లనబడి యుత్తరాపథమున కొంతభూమి పాలించిరటగాని యీ ప్రదేశము నిర్దేశింప బడలేదు.

ఇక్ష్వాకువంశ పాలనము— ఇక్ష్వాకు కుమారుడగు వికుక్షి పాలన హెచ్చుగా లేకుండనే యాతని పుత్రుడగు పురంజయుడయోధ్యను పాలించెను. వికుక్షి యాగమునకు దెమ్మనిన మాంసమును ఎంగిలి చేసినను నేరమునకు ఇక్ష్వాకు వసిష్టుని యానతిప్రకార మాతనికి రాజ్యపాలనలేకుండ శిక్షించెనట. పురంజయుని కాలమున నింద్రునకు రాక్షసులతోడి కల్గిన కయ్యమున పురంజయుడు ఇంద్రునెక్కి రాక్షసులను సంహరించెను, అప్పటి నుండి కకుత్స్థుడనబడెను. ఇది క్రీ. పూ. 6550 ప్రాంతమగును. ఇక్ష్వాకు వికుక్షికి మధ్య కుక్షియనువా డున్నట్లు రామాయణమున గలదు. వాని విశేషములు తెలియవు. ఇక్ష్వాకు మిక్కిలి ధనవంతుడనియు, పరాక్రమవంతుడనియు ఋగ్వేదమున గలదు.

ఈతని తర్వాత 5, 6 తరములు గడచుసరికి శ్రావస్తియను రాజొకడు పాలనకు వచ్చి శ్రావస్తినగరమును నిర్మించెను. ఇది దాదాపు క్రీస్తుపూర్వం 6200 లో జరిగెను. ఈ శ్రావస్తి మనుమడగు కువలయాశ్వుడు దుంధుడను రాక్షసుని సంహరించి దుంధుమారుడను బిరుదు వహించెను. ఇది క్రీ. పూ. 6100 ప్రాంతము. పిమ్మట 6,7 తరములకు యవనాశ్వుడు వచ్చెను. తర్వాత మాంధాత పాలించెను. ఈయన పేరిట నొక పట్టణము నేటికి నున్నది.



ఇతని కొడుకు పురుకుత్సుడు. చాలప్రసిద్ధి గలవాడు. ఈతనికి యిందురుడు సాయపడినట్లు ఋగ్వేదమున నున్నది. ఈతని కొడుకు త్రసదస్యు కూడా గొప్ప పురుషుని ఋగ్వేదమున గలదు. ఈతని తర్వాత 5 తరములకు వచ్చిన త్రిశంకు కాలములో నాతనిని బ్రాహ్మణధిక్కార మొనరించెనను వంకతో యిందరి రాజ్యమున కడుగిడకుండను, ఆతనితో సహకరింపకుండను జేసిరి. ఇది దాదాపు క్రీ. పూ. 5200 ల నాడు. దీనిని విశ్వామిత్రుడు ప్రతిఘటించి తప్పించి, ప్రత్యేక త్రిశంకుస్వర్గమును గావించి, యాతనితో తగాదామాన్పి రాజ్యపు సరిహద్దు నేర్పరచెను. పిమ్మట హరిశ్చంద్రుడు పాలకుడయ్యెను. ఈతని కాలములో వరుణుడను యింద్రరాజ్య సరిహద్దు నగరపాలకు డాతని కుమారుని తనకు బలిగా (లోబడ) నిమ్మని బలవంతపెట్టగా చివరకు విశ్వప్రయత్నముచే నాతని నితరవిధముల మెప్పించి దానిని మాన్పించెను. ఆ కాలమునందే శునశ్శేపుడు బలికై గొనిరాబడగా విశ్వామిత్రుడు దయనిచ్చి యాతనిని యాగపశువుగాకుండ యాతనిచే బ్రహ్మలను ప్రార్థింపజేసి యాతనిని దప్పించెను. ఈ విషయమునసే విశ్వామిత్రుని కుమార్లకు నాతనికి విరోధముగూడ వచ్చెను. వారు తండ్రి యాజ్ఞను ధిక్కరించి యాగపశువుగా నెవ్వరు బోరైరి. ఇది క్రీ. పూ 5150 సంగల క్రిందటు జరిగియుండును. వరుణు డీరీతిని తన యాగముల మిషతో నరబలిని సరిహద్దు రాజులనుండి కోరుచుండెను. ఈ నరబలి యాచారము దేవతలపేరిట భారతయుద్ధకాలము వరకే గాక, చాటుమాటుగా నిప్పటికిని మన దేశమందుండుట విచిత్రము. చంపన పాలించు కాలమునం దతనిచే చంపానగరము నిర్మాణమయ్యెను. ఈతడు హరిశ్చంద్రుని తర్వాత 3 వ తరమువాడు. ఈతని కాలము క్రీ. పూ. 5000 సంగల క్రిందటిదైయుండెను. క్రీ. పూ 4500 ప్రాంతమున పాలించినది సగరుడు చంపన కితడు 7 వ తరమువాడు. ఈతడయోధ్యా రాజ్యములోని సరయూ, గంగానదుల కావశ్యకములగు జాళ్లు, కాల్వలు, కొన్ని నూతనముగా ద్రవ్వింప నారంభించెను. వీనినే సముద్రములని పురాణములందు వర్ణించిరి ఇవి యాతని కాలమునందు పూర్తికాలేదు. దిలీపుడాపనినే కొంత చేయించెను. తుదకది భగీరథుని కాలములో హిమాలయములలోనున్న శివాశ్రమము మొదలు విష్ణ్వాశ్రమపాదములమీదుగా చివరవరకు నెరవేర్పబడెను ఇది క్రీ. పూ. 4250 ప్రాంతమనవచ్చును. సగరకుమార్లీ జాలును ద్రవ్వించు

నపుడు కపిలుడు విష్ణువుగానుండి యాతని యాశ్రమము సరిహద్దులగుండా త్రవ్వించినందులకై కోపించి, యాతడు వారిని సంహరించినట్లు కనబడు చున్నది. కపిలుని కోపాగ్నికి వారు నీరైరని వ్రాసిన పురాణవ్రాతలలోని యదార్థమిదియే. సగరుని తర్వాత నాతని మనుమడగు నంశుమంతుడును, తర్వాత దిలీపుడును, తర్వాత నాతని కొడుకగు భగీరథుడును, ఆతనికి 5 వ తరములో ఋతుపర్ణుడును అయోధ్యలో ప్రసిద్ధిగా పాలించిరి.

ఋతుపర్ణుడు చంద్ర వంశములో నలమహారాజు సమకాలికుడై యుండెను: ఈతనికి అశ్వహృదయమను విద్య వచ్చును. ఇతడు క్రీ. పూ. 4000 ప్రాంతీయుడు. ఈతనిమనుమడు సుదాసుడు. సుదాసుని మనుమడు కల్మాషపాదుడు. ఈతనికి నాల్గవతరమున ఖట్వాంగుడను రాజు క్రీ. పూ. 3600 ప్రాంతమున నుండి అవసానకాల మెరింగి విష్ణుభక్తుడయ్యెను. ఈ కాలమునందు భావి నెరుంగు విద్య యుండెను. ఈతని మనుమడగు రఘువు క్రీస్తు పూర్వము 3350 ప్రాంతీయుడై యుండి, యనేక దానధర్మములను యజ్ఞయాగాదుల నొనరించెను. ఇతనివలెనే యితని తర్వాత వచ్చినవారిలో యజుడును ప్రసిద్ధికెందెను. పిమ్మట వచ్చిన దశరథుడు రాక్షసులతోడి యుద్ధమున దేవతలకు సాయపడెను. వారి పేర్లు లోగడ తెలిపితిమి. ఇది దాదాపు క్రీస్తు పూర్వము 3150 ప్రాంత మనవచ్చును. ఈతని తర్వాత శ్రీరాముడు వచ్చి రావణ, కుంభకర్ణ, ఖర, విదూషణ, మారీచ, కబంధాది పెక్కు రాక్షసులను, వాలి మొన్నగువారిని సంహరించెను ఈ కాలమునకు పుష్పకవిమానమువంటి విమానములు మన దేశమున సకుస్తగా నుండెను. ఈ శ్రీరాముని జాతకచక్రమునుబట్టి యతడు క్రీ. పూ. 3122 లో జన్మించినట్లు కొందరు జ్యోతిషశాస్త్రజ్ఞు లనుచున్నారు. ఈయన వైకుంఠాశ్రమాధిపత్యము కొంతకాలము వహించినట్లు గన్పడును. ఈయన వంశములో దర్వాత కుశుడు, అతిథి, నిషధుడు, నభుడు, పుండరీకాక్షుడు, క్షేమధన్వుడు, దేవానకుడు, అహీనుడు, పారియాత్రుడు, బలుడు, చలుడు, వజ్రనాభుడు, శంఖణుడు, విధృతి, హిరణ్యనాభుడు, పుష్యుడు, ధ్రువసంధి, సుదర్శనుడు, అగ్నివర్ణుడు, శీఘ్రుడు, మరువు, ప్రశుశ్రుకుడు, సంధి, అమర్షణుడు, మహస్వంతుడు, విశ్వసాహ్యుడు, బృహద్బలుడను 27 మంది పాలించిరి. ఈ చివరివాడు భారతయుద్ధమున క్రీ. పూ. 1957 లో జనిపో



యెను. ఈతని తర్వాత సుమిత్రునివరకు 30 మంది పాలించిరి. సుమిత్రుడు క్రీ. పూ. 700 వాడు కావచ్చును.

## చంద్రవంశ పాలనము

చంద్రవంశము— ఈ రాజులకు ప్రతిష్ఠాన పురమొకటి రాజధాని. క్రీస్తుపూర్వము దాదాపు 6650 సం॥ల నుండి యీ వంశములో పాలించిన వారిలో యీక్రిందివారు ప్రసిద్ధరాజులుగా పురాణములందు చెప్పబడినారు. పురూరవుడు, నహుషుడు, యయాతి, పూరుడు, సుమతి, దుష్యంతుడు, భరతుడు, నలుడు, రంతిదేవుడు, హస్తి, శంతనుడు, చిత్రాంగద, విచిత్రవీర్యులు, భీష్ముడు, ధృతరాష్ట్రుడు, పాండురాజు, దుర్యోధనుడు, ధర్మరాజు మొన్నగువారు. ఊర్వశీ పురూరవుల కథ ఋగ్వేదమున గలదు. (మం. 10) ఇందలి నహుషు డనేక యాగము లొనర్చి దేవరాజ్యము వారిని సంప్రీతులుగా నొనర్చి చివరకు ఇంద్రరాజ్యమును గూడ పాలించెను గాని తుదకు ఆయనకును, ఋషులకును వచ్చిన విరోధమున దానిని కోలుపోయెను. ఈతని రాజ్యము సరస్వతీ తీరమున నున్నట్లు ఋగ్వేద నిదర్శనము గలదు. (ఋగ్వే 8—95) ఈ కాలమునకే పాడిపంటలు సమృద్ధిగా నుండెను. ఈతని తర్వాత కుమారుడగు యయాతి రాజై క్రీస్తుపూర్వము 6350 ప్రాంతమున పాలించుచు వచ్చెను. ఇతని కుమారులు పూరువు, అనువు, యదు, ద్రుహ్యువులు, మొన్నగువారు వివిధప్రదేశములందు పాలింపజొచ్చిరి. వీరు పంచాలురనబడుచున్నట్లు వేదదృష్టాంతములున్నవి. భారతయుద్ధమువరకు నీ వంశములో 58 గురి పేర్లుమాత్రము భాగవతాదులలో గన్పడుచున్నవి. ఋగ్వేదమునుబట్టి పంచాలురు సింధ్వ సిక్ని నదులమధ్య హస్తినాపుర సన్నిధిని నివసించుచున్నట్లు మార్గనాల్డు పండితుడు వ్రాయుచున్నాడు. వీరి రాజధాని కంపిలనియు, కురువంశీకులకు అసందివంతినియు గలదు. అనువులు పరుష్ణీతీరమునను, తృత్సువులు పరుష్ణికి నాతిదూరములోను, పూరువులు సరస్వతీ తీరమందును నివసించుచుండినట్లు ఋగ్వేదఋక్కులు తెలుపుచున్నవి. వీరిలో పూరువులందు పురుకుత్స, త్రసదస్యు, తృక్షి యనువారు మిక్కిలి శూరాగ్రేసరులని యందు గలదు. ఇందలి త్రసదస్యు పురుకుత్స రాజు కుమారుడనియు, మిక్కిలి దానధర్మ పరాయణుడనియు గూడ

మున్నది. తృత్సువులు బలవంతులుగా నుండిరి. వారికి తుర్వశులును, సృంజయులును విరోధులుగా నుండిరి. పరుష్ణీతీరమున జరిగిన యొక యుద్ధములో నార్యవర్గములకు చెందిన 10 రాజులు తృత్సువుల కధిపతియగు సుదాసునితో బోరి యోడిపోయినట్లు ఋగ్వేదమునందుగలదు. ఈ తృత్సువులకు యమునా తీరమున నివసించుచుండిన మత్స్యులుగూడ శత్రువులైరి. ఇట్లే భరతులును విరోధములోనే యుండిరి. సుదాసునికి యింద్రుడు సాయపడినట్లును, శంబరుని జయించి యాతనికొరకే 99 నగరములను వశపరచుకొన్నట్లును కొన్ని ఋక్కులలో గలవు. (ఋగ్వే మం. 4) ఈసుదాసునకు భరతులుగూడ విరోధులైరి. తృత్సులకు, సుదునకు వసిష్టుడు పురోహితుడుగా నుండగా, యదువులకు కణ్వగోత్రీకులును, అనువులకు భృగు గోత్రీకులును, పురోహితులైరి. (ఋగ్వే 8, 10 మండలములు) ఉశీనరులు ఉత్తర భారత మధ్యదేశమునందును, చేదులు మగధలోను, గంధర్వులు పశ్చిమోత్తర ప్రాంతమునను, మూజవత్తులను వీరిసన్నిహితులు మూజవత్తు పర్వత ప్రాంతమందును నివసించుచున్నట్లు మెక్డనాల్డు పండితుడు నుడివెను. గంధర్వులు మేషపాలనము ముఖ్యముగా గావించుచుండిరి. ఈ విషయములు గూడ ఋగ్వేదమున గలవు.

భరతునికి 5 వ తరమునందు రంతిదేవుడు పాలించెను. ఈతడు తనవద్దనున్న సర్వస్వమును తన ప్రాణము బోవుచున్నపుడు దొరకిన ఆహారజలములను గూడ నతిథులకిచ్చి పరవశపడించినట్లు పురాణములందు చెప్పబడినది. ఈతని కాలములో నిత్యము 2 వేల పశువులజంపి బ్రాహ్మణులకు భోజనములో మాంసము వడ్డింపబడుచుండెను. (భాగవతము) యదు తుర్వసుల కింద్రుడు సాయపడి శత్రుకోటలు 7 నాశమొనర్చెను. (ఋగ్వే. మండ. 10-49) చేదివంశీకులు గూడ ఋగ్వేదమున జెప్పబడిరి. (ఋగ్వే. మం. 8) సనకవంశీకులను యింద్రుడు సంహరించియుండెను. వీరు సనకసనందనాదులలోని వారు కావచ్చును. (ఋగ్వే 1-33-4) క్రమముగా యదువులును, త్రసదస్యును. దస్యులకు ప్రభువులైరి. (ఋగ్వే మం. 8, 10) కుత్సుని కాలములో ఫణులతోడి యుద్ధము జరిగెను. అందు ఫణులోడిపోయిరి. ఈ ఫణులు తోడేళ్ళ వంటివారనియు, స్వార్థులనియు, అక్రతులనియు, దుష్టులనియు ఋగ్వేదమున చెప్పబడెను. (ఋగ్వే మం. 6) వీ రార్యులనుండి విడిపోయినవారు. వీ



రోడవ్యాపారము లొనర్చి ధనము సంపాదించి ఋణములిచ్చి క్రమముగా దేశమున విరోధులై యింద్రునిచే వెడలగొట్టబడిరి. వీరు సిరియా, ఛాల్డియా, మెసపొటోమియా, యీజిప్టు, నార్వే. ఉత్తర అమెరికా మున్నగుచోట్లకు వారి ద్రావిడస్నేహితులతో కలసి వెడలిపోయి యాయాచోట్ల స్థావరము లేర్పరచుకొన్నట్లు పరిశోధకు లభిప్రాయపడిరి. (Rigvedic India P. 587) వీరికి నాయకుడు బృబు అనువాడు. ఈతనిని త్వష్ట్రియనిగూడ యనుచుండిరి. ఈ బృబు ఒకసారి భరద్వాజుని రక్షించుటయేగాక వెయ్యి గోవులను ఋషులకిచ్చెను. ఈతని గానములు ఋగ్వేదము మం.6 లో గలవు. ఈ ఫణులు భరద్వాజునికి తోడ్పడినవా రగుటవల్లను పురుకుత్సుని సమకాలీనులగుటవల్లను క్రీ. పూ. 5600-5200 సం॥ల మధ్యప్రాంతీయులని మనము నిర్ణయింపవచ్చును.

దుష్యంతుని కాలములో విశ్వామిత్రునికి మేనకయందు జనించిన శకుంతలను వనములో ప్రేమించి దుష్యంతుడు తర్వాత నామెను, ఆమెకు బుట్టిన కుమారుని దిరస్కరింపజూచినను, బ్రాహ్మణులు పట్టుబట్టి యా రాజ్యమును ఆమెకు జనించిన భరతునికే వచ్చునట్లు చేసిరి. ఆతడు పెరిగి పెద్దవాడగువరకు ఊరకుండి చివరకాతనిని తల్లిసహితముగా గొనివచ్చి బలాత్కారముగా దుష్యంతుని కంటగట్టిరి. వనములో తాత్కాలిక వ్యామోహమునకు గురియై శకుంతలను వలచి వలపించి తర్వాత మరచిపోయిన దుష్యంతుని కావిధముగా బ్రాహ్మణులు శిక్షనిచ్చిరి. ఇంత కాతని కుమారుడే రాజయ్యెను. ఈతడే రెండవభరతుడు. ధృతరాష్ట్రి, పాండురాజు లిట్లు ధర్మసంతానముగా జనించిరో. అట్లే భర్త లేకారణమువలనైన పనికిరానపు డాకాలపు స్త్రీలు ధర్మసంతాన మితరులవల్ల బొందుచుండిరి. ధర్మజ, భీమార్జున, నకుల సహదేవులు వరుసగా యమ, వాయు, యింద్ర, అశ్వినులను వారికి పుట్టినవారై యుండిరి. వీరా కాలపు యింద్రరాజ్యములోని పాలకులే గాని యాన్యులుగారు. వీరిని కోరి కుంతీదేవియు, మాద్రియు ధర్మసంతానము గల్గించుకొనిరి. ధర్మసంతానముకొరకు తాత్కాలికభర్త లిట్లు గైకొనిరో, యట్లే కొందరా కాలమున బహుభర్తృకలుగాగూడ నుండిరనుటకు ద్రౌపదియే నిదర్శనము ద్రౌపదిగాక పంచపాండవుల కితర భార్యలున్నను ఆమె ముఖ్యపత్నిగా నుండెను. ఆకాలమునకు గొందరా యాచారమును గలిచేయు

వారున్నను, అది యప్పటికి సనాతనాచారముగనే భావింపబడెను. శ్వేతకేతు కాలములో నుండియే మనదేశమున వివాహబంధ మేర్పడెననియు తత్పూర్వము ప్రజలు విచ్చలవిడిగా స్త్రీ పురుష సంగమము లొనర్చుచున్నట్లును పూర్వగ్రంథములు తెలుపుచున్నవి. అతిథులకు వివాహమైన పడుచులను గూడ మొట్టమొదట సమర్పించు నాచారముండగా, దానిని శ్వేతకేతు కాలము నుండియు గర్హింపబడినట్లు కనబడుచున్నది. ఈ విధముగా మన పూర్వులు కట్టుదిట్టములు క్రమముగా నొనరించిరి. ఈ చంద్రవంశపు పూర్తి వంశావళి పురాణములందు గానరానందున నందరి కాలనిర్ణయము గావింప లేకున్నను కొందరి కాలములనుమాత్రము సూర్యవంశావళి కాలములనుబట్టి యీ క్రింది విధమున నిర్ణయించుచున్నాను.

పురూరవుడు—ఈయన క్రీ. పూ. 6500 సం॥ ప్రాంతీయుడు. ఈయన పేరు ఋగ్వేదమున నున్నదని లోగడ నుడివితిని.

నహుషుడు—ఈయనను సూర్యవంశములో దశరథునికి గొన్ని తరములు ముందుజేర్చి వాల్మీకిరామాయణములో వ్రాయబడినదిగాని యది దాదాపు అన్ని పురాణములకు విరుద్ధముగా నున్నది. దానిని వదలి యితర పురాణముల ప్రకారము యితడు చంద్రవంశీకుడుగను పురూరవుని మనుమడుగను భావించినచో నీతడు క్రీ. పూ. 6400 వాడగును. ఈతడు పెక్కు యాగను లొనర్చి యింద్రరాజ్యమునగూడ కొంతకాలము యింద్రుడయ్యెను. ఇతని చివరకు బ్రాహ్మణులు ఇంద్రరాజ్య రథముపైనుండి కూలద్రోసిరి.

యయాతి— ఈతడు నహుషుని కుమారుడగుటవల్ల క్రీ. పూ. 6350 ప్రాంతీయుడనవచ్చును. ఈతనినుండి భారతయుద్ధము వరకు 53 మంది రాజులపేర్లు మాత్రము కానవచ్చుచున్నవి.

పూరుడు—ఇతడు యయాతికుమారుడు. అందుచే క్రీ. పూ. 6300 ప్రాంతీయుడు.

నలుడు— ఈయన ఆరుగురు చక్రవర్తులలోనివాడు. ఋతుపర్ణుడను సూర్యవంశీకుని సమకాలికుడగుటవల్ల యిర్వురును క్రీ. పూ. 4000 సం॥ల ప్రాంతీయు లనవచ్చును.

దుష్యంతుడు— ఈయన కాలము సరిగా నిర్ణయము చేయుటకు వంశావళి పూర్తిగాలేదు. ఇతడు క్రీ. పూ. 5250 ప్రాంతీయుడగు విశ్వామిత్రుని



కుమార్తె శకుంతలను చేపట్టెను. అందుచే యీతడాకాలము వాడగునని మాత్రము చెప్పవచ్చును.

భరతుడు— ఈతడు క్రీ. పూ. 5200 ప్రాంతీయుడు.

రంతిదేవుడు— ఈతడు క్రీ. పూ. 4800 వాడగును. ఈతని కాలములో నిత్యము 2 వేల పశువులను జంపి బ్రాహ్మణులకు భోజనము పెట్టబడుచుండెను.

శిబి— ఈతని కాలనిర్ణయము చేయుటకు వంశావళి యసంపూర్ణముగ నున్నది. ఇతడు సుశీనరుని పుత్రుడుగ గన్పడును. యయాతినుంచి చూచినచో 12 తరముల కితడు వచ్చెను. కాని భారత యుద్ధకాలమున కితనికి మధ్య 16 తరములే చెప్పబడినవి. చాల తరములు లోపించినట్లు కనబడుచున్నవి. అయిన నితడు క్రీ. పూ. 5700—4000 మధ్యవాడనవచ్చును. ఈతడు నేటి బెలూచిస్తానములో పాలించుచువచ్చినట్లు కనబడును. అచట నిప్పటికి నీతని పేరిట నెలకొల్పబడిన శిబినగరము కలదు. పురాణములందలి ప్రముఖులందరును చారిత్రక పురుషులేననుటకు గల యాధారములలో నిది యొకటి

హస్తి—ఈతడు దాదాపు క్రీ. పూ. 4000 సం॥ వాడు. ఈయన పేరిటనే హస్తినాపురి నిర్మింపబడినది.

శంతనుడు— ఈయన క్రీ. పూ. 2000 సం॥ ప్రాంతీయుడు.

ధృతరాష్ట్రుడు— ఇతడు క్రీ. పూ. 1950 ప్రాంతీయుడు. ఈయన సోదరుడగు పాండురాజుతో కలసి ఢిల్లీ రాజధానిగా నేలెను. ఈయన కుమారుడే దుర్యోధనుడు. ఇతనివల్లనే భారతయుద్ధము వచ్చెను.

ధర్మరాజు—భారతయుద్ధము క్రీ. పూ. 1956 సం॥లో పూర్తియయ్యెను. అప్పటి కలియుగం క్రీ. పూ. 1920 సం॥తో పరిపోయెను. తర్వాత 25 సం॥ల కీయన చనిపోయెను. ఇతడు 62 సం॥లు పాలించెను. ఈయన పేరిటనే యప్పుడొక శక మేర్పడెను. ఇదియే సప్తర్షి శకమనియు, యుధిష్ఠిరశకమనియు పేరందెను.

పరీక్షిత్తు— ఈయన అర్జునుని కుమారుడగు నభిమన్యుని పుత్రుడయందు జనించెను. ధర్మరాజు రాజ్యభారము విడచినప్పటినుంచి రాజ్యమేలెను.

ఈతడొక బ్రాహ్మణునిపై, తపసు చేసుకొను కాలమున సర్పశవము వేసి యవమానించెనను క్రోధమున నా తపసికుమారుడు కుట్రచేసి నాగవంశీకుడగు తక్షకుని మూలమున విషఫలములను ఈ రాజునకు బంపి యితనిని జంపెను. ఈ పరీక్షిత్తు జన్మము మొదలు నందులవరకు 1500 సం॥లు జరిగెనని కొన్ని పురాణములందు గలదు. ఈ లెక్క సరిపోవుచున్నది. ఈయన తర్వాత నితని కుమారుడు జనమేజయుడు రాజయ్యెను.

జనమేజయుడు— తక్షకుని వ్యాజమున నీతడు నాగవంశీకులందరిని దాదాపు చంపించెను. ఇదియే సర్పయాగ మనబడెను. తుదకా తక్షకుని కాశ్రయమిచ్చిన యింద్రుడుగూడ దండింపబడి, యాతని రాజ్యము హరింపబడెను. అందువల్లనే నేడు యింద్రరాజ్యము లేకుండబోయినది. దీనితో పాటు యమ వరుణాది పురాలుగూడ నశించినవి. ఈతడు క్రీ. పూ. 1813 (యుధిష్ఠిరశకము 89 సం॥) వేయించిన శాసనముసంగతి లోగడ వ్రాసితిమి.

ఈ జనమేజయుని తర్వాత కలి, మరుత్తు, దేవాపి మున్నగువారివల్ల సృష్టి మార్పులు జరిగెనో తెలియదుగాని జనమేజయుని తర్వాత శతానీకుడు, సహస్రానీకుడు, అశ్వమేధజుడు, అసీమకృష్ణుడు, నిచకుడు మొదలగువారు 28 మంది పాలకులపేర్లు భాగవతమున గానవచ్చుచున్నవి. భారతయుద్ధము 1957 సం॥లోని దగుటను, 28 మంది పాలకుల చివరికాలము దాదాపు క్రీ పూ. 700 ప్రాంతము కావచ్చును. ఇందలి చివరివాడు బ్రహ్మక్షత్రుడు నిర్వంశ్యుడయ్యెనని చెప్పబడినది.

భారతయుద్ధకాలము నుండి మగధరాజ్యము క్రమముగా ప్రసిద్ధికివచ్చెను. అచట బృహద్రథుని మనుమడును, జరాసంధ పుత్రుడు నగు సహదేవుని వంశమువారు 22 మంది పాలించిరనియు, చివరివాడు పురంజయుడనియు గలదు. వీరలు వెయ్యి సంవత్సరములు పాలించిరని చెప్పబడినది. పురంజయుడు పద్మావతీనగరము రాజధానిగా గంగాప్రయాగలవరకు పాలించెనట. బృహద్రథవంశీకుల తర్వాత ప్రద్యోతనవంశీకులును, తర్వాత శిశునాగవంశీకులును, తర్వాత నవనందులును, తర్వాత చంద్రగుప్తాదులును క్రీస్తుశకారంభమువరకు పాలించియుండిరి వారి సంగతి లోగడ నుడివితిమి.



## చంద్రవంశ శాఖలు

చంద్రవంశమునుండి యనేక శాఖలు వెడలి వివిధచోట్ల రాజ్యములు స్థాపించిరి. వారిలో మాహిష్మతిపురమున పాలించినది హైహయవంశము వారు. వీరు యయాతి పెద్దకొడుకు యదువు వంశీకులు. యదువు తర్వాత సహస్రజిత్తు, శతజిత్తు, ఆతని తర్వాత హైహయులనువారును పాలించినట్లు భాగవతమున గలదు. ఈతని తర్వాత 8 మంది పాలించినపిమ్మట కార్తవీర్యార్జునుడు వచ్చెను. ఇతడు రావణునకును, పరశురామునకును సమకాలికుడు. అందుచే క్రీ. పూ. 3150 ప్రాంతీయుడగును. ఇతని తర్వాత నాల్గవవాడు దుర్జయుడు. ఈతని వంశము 12,13 శతాబ్దులవరకు నున్నట్లు శాసనములు వచించుచున్నవి. (S. I. I. Vols. చూడుడు) గాని యీ వంశావళి యంతయు గనుపడుటలేదు. భారతయుద్ధకాలమున నీలుడనువాడు యీ దేశ మేలుచుండెను.

## మిథిల రాజ్యము

ఇక్ష్వాకు కుమారుడగు నిమివంశమువారు మిథిలనుండి పాలించినట్లు పురాణములందు గలదు. ఈ రాజులను వైదేహులనియు, జనకులనియు గూడ బిలుచుచుండిరి. నిమి కుమారుడు విదేహుడు. నిమి ఇంద్రుని ధిక్కరించి యాతని దేవునిగా భావించకుండెనని ఋగ్వేదమున గలదు. (*) (ఋ 8) విదేహునితర్వాత వరుసగా ఉదావసుడు, నందివర్ధనుడు, సుకేతుడు, దేవరాతుడు, బృహద్రథుడు, మహావీర్యుడు, సుధృతి, ధృష్టకేతు తర్వాత 11 మంది పాలించినట్లు పురాణములందున్నది. పిమ్మట శ్రీరాముని కాలమున నీదేశము సీరధ్వజుడను పేరుగల జనకమహారాజు పాలించెను. ఈయన కాలములోనే బృహదారణ్యకా ద్యుపనిషత్తులు రచింపబడెను. ఈయన గొప్ప జ్ఞానయోగియు, రాచ తపసియు పేరొందెను. ఈయన

(*) నిమి యింద్రునితో నట్లు విరోధము వహించి మెసపొటోమియాకేగి యచట రాజ్యము స్థాపించినట్లు ఆధారములున్నవి. అతని కొడుకిచట నుండియుండును. (సుమేరు రాజవంశావళి, భారతి, ప్రమాది సం॥ర ఆశ్వీజ సంచికలు చూడుడు) నిమిపేరిట యచట నగరములున్నవి.

తర్వాత నీ వంశీకులందరును జనకులనియే గొన్నిచోట్ల చెప్పబడినారు. ఈయన పెంచిన కుమార్తె సీతాదేవినే శ్రీరామునకు విలువిద్యా పరీక్షలో నెగ్గినందులకిచ్చి పరిణయ మొనర్చెను. ఈపరీక్షలో నిలుపబడినది శివధనస్సు. ఇది యీ రాజాస్థానములో తత్పూర్వమునుంచి నిల్వయుండెను. శివుడు మానవులలోనివాడనుట కిదియొక గుర్తుగానున్నది. ఈయన తర్వాత 31మంది రాజులపేర్లు భాగవతాది పురాణములందు గానవచ్చుచున్నవి. చివరివాడు మహావశియనువాడు. తర్వాత నీ రాజ్యవిభాగములు దెలియుటలేదు. శతపథ బ్రాహ్మణకాలమునకు గాంధార,సాళ్వ, కేకయ, పౌరస్త్య, కురు,పాంచాల కోసల, విదేహ, సృంజయాది దేశములుండెను. ఈ బ్రాహ్మణమున జనమేజయ, జనక మహారాజుల ప్రశంసయున్నందున నిందలి కొన్ని భాగములు భారతయుద్ధకాలము తర్వాత రచింపబడినవిగా గన్పడుచున్నవి. కొన్ని క్రీ. పూ. 3100 ప్రాంతమున వ్రాయబడియుండును.

## ఇతర రాజ్యములు

భారతయుద్ధకాలములోని రాజ్యములను లోగడ నుదాహరించితిమి గాని వాని చరిత్రలన్నియు పురాణములందు గన్పడవు. తర్వాత క్రీ. పూ. 600 ప్రాంతమువర కేయేరాజ్యము లున్నవో నశించినవో తెలియకున్నను, బౌద్ధగ్రంథములనుబట్టి యీక్రిందిరాజ్యము లుత్తరహిందూస్థానమున నా కాలమున నున్నట్లు కనబడును. మగధ, కోసల, వత్స, అవంతి, గాంధార, అంగ, కాశి, వజ్జియనులదేశము, లిచ్ఛవీలది, మిథిల, మల్లుదేశము, చేది, కురుదేశము, పాంచాలము, కొలియులదేశము, శూరసేన, అస్సక, కాంభోజరాజ్యములు. మన దేశములో పూర్వమీరీతిగా 56 ముఖ్యదేశములుండెను. ఇవిగాక 100 పైగా గణరాజ్యములుండెను. ఇందు కొన్ని నగరరాజ్యములు.

## ఆర్యుల వలసలు

దాదాపు భారతయుద్ధమైన పిమ్మటనో దానికి పూర్వమో మన హిందూదేశపు ఆర్యులు ఇంద్ర, వరుణ, మిత్ర, అశ్వినులను పూజించువారిలో కొందరు ఏషియామైనరులో పడమటి ఏషియాలో యితర దేశములకు వలసవెడలి యచట మితానియనులు, కొసానులు లేక ఖాండులు, ఖేటులు లేక హిట్టిటులు, ఫ్రిజియనులు, లీడియనులను పేర్లతో ఆ యా ప్రదేశములను బట్టి పిలువబడి యాయాచోట్ల క్రమముగా నచటి పూర్వమునుండిన రాజులను జయించి రాజ్యములనుగూడ స్థాపించినట్లు కనబడుచున్నది. మితానియనులు బి. సి. 1470—1400 మధ్య రాజ్యము నేలిరి. వీరిలో అర్తతమ, అర్తసుమ, సుతర్న, దశరట(దశరథ?) నామములు మనదేశపు పేర్లపోలికలు గలవి కానవచ్చుచున్నవి. ఖాండులు బేబిలోనియాలో బి సి. 1800 ప్రాంతమున పాలించిరి. ఖేటులు బేబిలోనియాలో బి. సి. 1750—1100 మధ్య పాలించిరి. వీరు బి.సి. 1750 లో సంశుదితను నోడించి రాజ్యము గైకొనిరి. వీరీజిప్టుతోగూడ పోరాడుచుండిరి. ఫ్రిజియనులు భృగు లేక భృగువంశీకులని యభిప్రాయము గలదు. ఇట్లే లీడియాకు బోయినవారు లీడియను లనబడిరి. మిటానియనులు ఈజిప్టురాజులతో సంబంధము లొనర్చుచుండిరి. ఈరీతిగా నార్యులు మధ్యయేషియానుండి క్రమముగా పశ్చిమదేశముల కన్నిటికి ప్రాకిపోయినట్లు కనబడుచున్నది. ఈ వివరములకు డా॥ ఏ. సి. దాసుగారి Rigvedic India చూడవలెను. లీడియా ముఖ్యపట్టణము సర్డిస్. ఇది శరత్ అను పేరునుబట్టి యార్యులే పెట్టిరని పండితు లనుచున్నారు లీడియనులు లింగారాధకులు. శిశ్నదేవు నారాధించిన యార్యులలోనివారు.

## ద్రావిడుల పూర్వ రాజ్యములు

ఉత్తర హిందూస్థానమున క్రీ. పూ. 3150 లకు పూర్వమే యచట దస్యులు లేక రాక్షసులనబడువారిలో పెక్కండ్రు శంబర, కృష్ణ,ధుంధులు, వంగృదుడు మున్నగువారు అచట స్వర్గరాజ్యమును బాలించు యింద్రునితో నోడి తమ ప్రదేశములను, నగరములను అతనికి వశపరచినట్లు లోగడ చదివియుంటిమి. దక్షిణదేశమునందు యింద్రద్యుమ్నుడు, సత్యవ్రతుడనువారలు తత్పూర్వమే పాలించుచున్నట్లు గ్రహించితిమి. శ్రీరాముని కాలమునను భారతయుద్ధకాలమునందును ద్రావిడదేశమును పాలించుచు వచ్చిన కొందరి విషయములను లోగడ చదివితిమి. ఈ రీతిగానుండిన ద్రావిడరాజ్యములను క్రమముగా నోడించి హరించియు, కొందరిని సామంతులుగా నుండనిచ్చియు నార్యరాజులు తమ పాలనమును విస్తరించినట్లు చెప్పవచ్చును. క్రీ. పూ 3100 సం॥ల ప్రాంతమునకు యిది ఆసేతు హిమాచల పర్యంతము జరిగెనని

యొక్క మాటలలో చెప్పుట బాగుగనుండెను. ఈ ద్రావిడులకు క్రమముగా నార్య నాగరికతయు మతమును నేర్పి, తమలో చేర్చుకొని వారికి కొలది హక్కులు మాత్రమే తమ రాజ్యమునను, మతమునను యిచ్చినను క్రమముగా వారిని తమలో లీనముచేసుకొనుట తప్పలేదు. ఆర్యబ్రాహ్మణులు, రాజులు తర్వాత ద్రావిడరాజులతోటి సంబంధము లనేక మొనర్చి ద్రావిడ జాతి నంతటిని ఆర్యులుగా మార్చివేసిరి. చోళ, చాళుక్యాదిరాజు లిట్లేర్పడిన వారే యనవచ్చును. ద్రావిడబ్రాహ్మణు లనేకు లిప్పుడున్నారు.

## పూర్వుల పరిశోధనలు

ఇంతవరకు మనదేశపు యదార్థ చారిత్రక స్థితిగతులు దెలుసుకొనుటలో పూర్వపు మంచిచెడ్డలుగూడ కొన్ని తెలిసికొంటిమి. కాని క్రీ.పూ. దాదాపు 7800 సం॥ల నుండ క్రీ. పూ. 1900 వరకును తర్వాతను మన పూర్వులు సాధించి తెలుసుకొన్న మహత్తర విషయములు దెలుపకుండనే యీ గ్రంథము ముగింపజాలను. అందనేకము లున్నను దిఙ్మాత్రముగ నుదాహరింతును.

1. ఆదికాలపు మానవులకు మొదట దైవచింతన గల్గించి కృతజ్ఞతకొరకై సూర్య, చంద్ర, పంచభూతాది ప్రార్థనల నేర్పాటుగావించి, క్రమముగా నితరదేవతల ప్రార్థనలకై యనేక మంత్రతంత్రాదుల నేర్పరచుట.

2. విశ్వమంతటికిని ఆధారభూతమైన యొక ఆత్మ సర్వవ్యాపకముగా కలదని నిశ్చయించి, అది తమయందే యున్నను తెలిసికొనజాలని నరులకు దాని వశీకరణకై యనేక పరిశోధనలు, తపములు సల్పి, విశ్వరహస్యములను అన్నిటిని కనుగొను మార్గములు తెలుపుట.

3. ఖగోళమునందలి గ్రహములు, తారలు మున్నగువాని నన్నిటిని వాని కాలగతులను శోధించుటయేగాక, ఆ కాలగతులవలన మానవులకు, యితర జీవులకు కలుగగల భావి పరిణామముల తెలుసుకొను విధానములు (వీనినే ఖగోళజ్ఞానము, జ్యోతిషజ్ఞానము లందురు.) గ్రహించి లోకశ్రేయస్సునకై వెల్లడించుట.

4. తపస్సువలన అనగా ఏకాగ్రబుద్ధిచే దేనికొరకైనను ధ్యానించిన లేక తపించిన, నట్టివాని యాత్మయే, యేరూపమున నే దేవతపేరిట ధ్యానిం



చునో అట్లే కనబడి కార్యసాఫల్య మొనర్చు విషయమును కనుగొని యా రీతి ప్రవర్తించుట. పూర్వరాజులందరిపేర్లను దేవాలయములు స్థాపించిన దిందువల్లనే.

5. జీవుల యారోగ్యాయుర్దాయాదులకు కారణభూతమగు వైద్య శాస్త్రమును తెలుసుకొనుట. ఓషధుల రహస్యములన్నియు కనుగొనుట. సముద్రమథనకాలమున-నున్న శివుడు వైద్యుడనియు, గరళము దీసుకొనెననియు, అశ్వినులప్పటికే దేవవైద్యులనియు లోగడ నుడివితిమి. పృథు చక్రవర్తికాలమున నోషధీపరిశోధనము జరిగియుండెను. ధన్వంతరిగూడ సముద్రమథనకాలపు వాడేనని భాగవతమునగలదు. గాని యాతడు తర్వాత వాడని యితరాధారములున్నవి. మనదేశపు ఆయుర్వేద మతిప్రాచీనమైనదని తెలుసుకొనవలసియున్నది

5. ఎ. యోగము లభ్యసించి వానివలన ననేక విధములైన సిద్ధులను బొందుట. అనగా నేది కావలెనన్నను చివరకు యీశ్వరత్వము సైతము లభించునని కనిపెట్టి యాప్రకారమే అష్టాంగయోగము లమలునందుంచుట.

5. బి. యుద్ధములలో వాడుకకై అనేక రకములగు బాణములను కనిపెట్టుట. వీనిలో కొన్ని విషముపూసినవి మొదలైనవి యుండెడివి. నాగాస్త్ర, గరుడాస్త్ర, వాయవ్యాస్త్ర, సమ్మోహితాస్త్ర, బ్రహ్మాస్త్రాదులు, వీనియొక్క ఆకారాదులనుబట్టియు, వాటికి చేర్చబడిన విషాదుల గుణగణములను బట్టియు, వానిని పురాణములందు చిత్రవిచిత్రములుగా వర్ణించినట్లు కనబడుచున్నది. నేటి ఆటంబాంబువలెనే యనేక విధములైన తంత్రములచే తయారుచేయబడిన వీ బాణములు.

6. అనేక వస్తుజాలములు ఉత్పత్తిజేసి, వాని నుపయోగించుకొను విషయములన్నియు కనిపెట్టుట. ఇట్టివానిలో విమానములు మొదలు సముద్రపు నావలవరకు, నాగలి మున్నగు లోహవస్తువులువహా.

7. కృషిమూలముగా పంటలు పండించి తాము బ్రదికి యితరులను బ్రతికించుట.

8. సృష్టికార్యము పరమపవిత్రమైనదిగా భావించి దాని భావ్యభివృద్ధికై యనేకరీతుల కృషిసల్పుట, ఈ మూలసూత్రము ఆచరణకొరకే స్త్రీలకు, పురుషులకు సంగమవిషయమున నమితస్వేచ్ఛ పూర్వకాలమున నిచ్చియుం

కుట. క్రమముగా వివాహబంధ మేర్పరచి మితపరచుట, శ్రీరాముని కాలమునాటికి బహుభార్యాత్వమున్నను, స్త్రీలకు స్వతంత్రత నొక విధముగా తగ్గింపబడినట్లు కనబడునుగాని మహాభారతకాలమునకు బహుభర్తృత్వ మేర్పడెడి యాచారము సకృతుగా కనబడుచునేయున్నది. కృతయుగమునకు పూర్వము అనగా మొదటి ఆరుమనువుల కాలములోని ప్రజాపతులు లేక బ్రహ్మలందరును సృష్టికొరకై యనేకమంది భార్యల బెండ్లాడి, సంతానము ననేకవిధముల వృద్ధిజేసినవారే. ఇది క్రీ. పూ. 7800 సం॥ల నుండి 6650 వరకు నుండిన విషయము.

9. సృష్టిచేయుటయు, సృష్టియందు నానావిధభోగము లనుభవించుటయు, మామూలుగా జరిగెడిదేయని గ్రహించి యీ జనన మరణ సంసారమును తప్పించుకొనుమార్గ మన్వేషించుట.

10. పూర్వ, పరజన్మము లున్నట్లును, జీవులు వారివారి కర్మానుసారము యీ సృష్టిలో భోగాదులను, బాధలను పొందుదురని కనిపెట్టుట. ఇది చాల గొప్పవిషయము. ఈ భోగములు, బాధలు, యితరలోకములందు గూడ నుండునని చెప్పుట. (ఇవి యింకను శోధింపదగినవి)

11. జననకాలమును బట్టియు, మానవుని హస్తాదులలోని రేఖలను బట్టియు, శకునాదులను బట్టియు, భూత, భవిష్యద్వర్తమానములు కొంతవరకు తెలుసుకొను సూత్రములు గ్రహించుట.

12. పంచభూతములగు పృథివ్యాపస్తేజో వాయురాకాశముల భాగముల పరస్పర సంయోగములవల్ల ననేకశక్తుల కల్పించుట, కనిపెట్టుట. ఇట్లే అనేక వస్తువులు ఉత్పత్తిచేయుట.

13. తపస్సుచే కనుగొనబడు అనేకవిషయములు. అగతానాగతాలు మున్నగునవి.

14. ప్రజాపాలనకై మొట్టమొదట యేర్పరుపబడిన సూత్రాలు. ఇవి మొదటిమనువు కాలములో యేర్పడియుండును. అనగా క్రీ. పూ. 7800 సం॥ల ప్రాంతముననైయుండును. ఈ సూత్రాలు క్రమముగా ననేక మార్పులు, చేర్పులతో నిపుడు మనుస్మృతియనుపేరిట నున్నవి. దైవభక్తియు, వైరాగ్యమును, వేదాంతజ్ఞానమును ప్రజలలో నెంతగా వ్యాపింపజేసినను రాగ, లోభ, మోహాదిగుణములు ప్ర[illegible] హెచ్చుగానే యున్న



[illegible] పూర్వకాలపు యుద్ధములే తార్కాణములు. దేవరాక్షసయుద్ధములు భారతయుద్ధము, పూరు, యదు, ద్రుహ్యువుల యుద్ధములు మొదలైనవి. [illegible] విజ్ఞానవిషయ ప్రకటనకై యెంతయో కృషిసల్పి యిట్టి యవాంతరములన్నియు దప్పించుకొని యరణ్యములందుండి పాటుబడిరి. కాని వారి [illegible]ధిపత్యతకై పెనుగులాడు గర్వమును, తమకు లోబడియుండని రాజాల [illegible] నహంకారమును కుట్రలును క్రమముగా వారిలో గూడ పెరిగినట్లు కనబడును. వేణునిసంహారము, శంబుకవధ, దేవాపిని రాజ్యార్హుడు గాదని తొలగించుట, రాక్షససంహారమునకై నిరంతరకృషి, యిట్టి కార్యములు క్రీ. పూ. 7800 సం॥ల నుండి భారతయుద్ధకాలమువరకు బ్రాహ్మణులొనరించుచువచ్చిన మోసములే. ఇవి లోకశ్రేయస్సునకై చేయబడినవని గ్రంథములందు వారు వ్రాసుకొనిరి. నిజముగా నట్టివన్నియు బ్రాహ్మణాధిపత్యత, పలుకుబడులు తగ్గకుండుటకై మతమనుసాకుతో జేసిన తంత్రములే. ఎట్లున్నను, రమారమి 10 వేల సంవత్సరములనుండి జీవించిన మనదేశపు పూర్వ వీరస్మృతియు, బూజయునే మన హిందూమతమునందన్ని శాఖలలోను గోచరించుచు, నట్టి వీరులనే సర్వేశ్వరాంశ్యులుగా బురాణాదులలో గల్పించినట్లు స్పష్టపడుచున్నది. అందుచే నేడు వీరపూజారాధనము ముఖ్యముగువారు మన మతమునందలి దేవతలనందరి నారాధించుటయు వీరపురుషారాధనమేనని గ్రహించుట యుక్తము. లింగధారణ, అప్పసాదులు ఆదికాలపు మానవుని (Premitive man) మానస వికాసమును, ఉత్పత్తి [illegible]గౌరవమును, దానియందలి భక్తిని దెలుపుచు తర్వాత నాతని [illegible]మును వృథపరచుచున్నవి. దీనినే తర్వాత నా శైవ మతకర్తలనుసరించినట్లు కనబడును. దేవునిపేరిట వీరపురుషారాధనము (Hero-worship) గా మతప్రవర్తకుల ఆరాధనము అన్ని దేశములందున్నది.

సర్వవ్యాప్తమగు నాత్మనేవిధముగ గొల్చినను, తలచినను, దానికే చెందునను సిద్ధాంతము హిందూమతమునందన్ని శాఖలలోను యేర్పడి, యేమతము [illegible] మతము జాడలకు భిన్నములేకుండ నాత్మను గుర్తించి నడచుచున్నట్లు [illegible]ము. అయిన నివియన్నియు సముద్రములో గలియు నదులవలెనుండి హిందూమత సముద్రములో గలియుచున్నవి. ప్రకృతి కంటిటిగాధారమగు

నాఁటి భిన్నశక్తి ఎక్కడ ఏరూపమున నున్నను, దానినే ఆత్మ లేక పరమాత్మ లేక భగవంతుడను పేర్లతో హిందూమత సిద్ధాంత గ్రంథములు నిర్దేశించుచున్నవి. ఉత్పత్తుల కన్నిటికి మూలమగుటవల్లనే యీ నామములు యేర్పడినట్లు గన్పడును. ఇట్టి శక్తినే మన పూర్వనాయకులందు గుర్తించి వారిని పురాణ పురుషులుగాను దేవతలుగాను వర్ణించి, ఆకాలపు వ్యాసులు గ్రంథకర్తలు, వారిని, వారికీర్తిని, శాశ్వత పరచుటయే గాక, మనకు మన నాయకులందెట్టి గౌరవప్రపత్తులుండ వలయునో, అవి యెట్లు ప్రకటింపవలెనో, వారివలన మనమెట్టిమహోన్నత సంపత్తిని బొందగలమో, వారిబోధలచే నెట్టి విజ్ఞానము పొందెదమో, దానివలన నెట్లు యిహ, పర సాధకము నగునో లేటతెల్లముగ నతిశయోక్తులతో తెల్పియుండిరి కాని యీ పూర్వగ్రంథములందనేకములకు ప్రక్షిప్తము లిటీవల చేరియున్నందునను, పూర్వకాలపు టాచారాదులు విశ్వాసములు మక్కికి మక్కిగా నేఁ డనుసరింప వలనుగానందునను, నవియన్నియు తగిన సంస్కరణలతో గాని యనుసరింపరాదు. మతమును లోతుగా విమర్శించుట యీ గ్రంథములో కానిపని. ఆధ్యాత్మిక విషయము లనుభవించుట వల్లనే తెలియును గాని కేవల గ్రంథవిన్యాసమునై దెలియఁబడవు. గావున వానిని వదలి, పురాణములాది గ్రంథములలోఁగల ఆదిమతములయొక్కయు, తత్ప్రవర్తకులయొక్కయు చరిత్రలే యిందు నిష్కృత్రిమముగ వ్రాయఁగల్గితిమి. సత్యాన్వేషణపరులైన చదువరుల కిందలి సత్యము లన్నియు సూక్ష్మదృష్టికి గోచరములగునని నమ్ముచున్నాను.

## అనుబంధము – ౧

### సూర్యవంశములోని ఇక్ష్వాకుశాఖ.

(క్రీ. పూ. 6650 సం॥ల నుండి క్రీ. పూ. 600 దాఁకాపువఁరకు)

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఇక్ష్వాకు | | యువనాశ్వుడు | | హర్యశ్వుడు | 15 |
| కుక్షి లేక వికుక్షి | | శ్రావస్తుడు | | నికుంభుడు | |
| కకుత్స్థుడను పురంజయుడు | | వంశకుడు (లిం) | 10 | బర్హిణాశ్వుడు | |
| అనేనసుడు (కు | | బృహదశ్వుడు | | కృశాశ్వుడు | |
| పృథుడు | 5 | కువలయాశ్వుడు | | సేనజిత్తు | |
| విశ్వగంధుడు | | దృఢాశ్వుడు | | యువనాశ్వుడు | 20 |
| చంద్రుడు | | ప్రమోదుడు (లిం) | | మాంధాత | |



| | | | | | |
|---|---|---|---|---|---|
| పురుకుత్స, అంబరీష, | | శ్రుతుడు | | నిషధుడు | 70 |
| ముచికుందులు. | | నాభాగుడు | | నలుడు లేక బలుడు | |
| త్రసదస్యు | | అంబరీషుడు (లిం) | | నభుడు | |
| సంభూతి (కూ) | | సింధుద్వీపుడు | 50 | పుండరీకుడు | |
| విష్ణువృద్ధ (కూ) | 25 | అయుతాయువు | | క్షేమధన్వ | |
| అనరణ్యుడు | | ఋతుపర్ణుడు | | దేవానీకుడు | 75 |
| వృషదశ్వుడు (కూ) | | స్వధాముడు | | అహీనుడు | |
| హర్యశ్వుడు | | సుదాసుడను కల్మషపా | | * పారియాత్రుడు | |
| వసుమనస్సు (కూ) | | దుడు | | * బలుడు | |
| అరుణుడు | 30 | అశ్మకుడు | 55 | * చలుడు | |
| త్రిధన్వ (త్రిబంధనుడు) | | మూలకుడను నకులుడు | | * వజ్రనాభుడు | 80 |
| సత్యవ్రతుడు | | దశరథుడు (కూ) | | * శంఖణుడు | |
| హరిశ్చంద్రుడు | | అతిరథుడు (లిం) లేక | | * విధృతి | |
| రోహితుడు | | శతరథుడు (కూ) | | * హిరణ్యనాభుడు | |
| లోహిత లేక హారీతుడు | | వృద్ధశర్మ (కూ) | | * పుష్యుడు | |
| చంపన | 35 | విశ్వసహుడు | 60 | * ధ్రువసంధి | 85 |
| సుదేవుడు | | ఖట్వాంగుడు | | * సుదర్శనుడు | |
| విజయుడు | | దిలీపుడు 2 (లిం) లేక | | * అగ్నివర్ణుడు | |
| దురుకుడు లేక కారుకుడు | | దీర్ఘబాహు | | * శీఘ్రుడు ♦ | |
| వృకుడు | 40 | రఘువు | | * మరువు ♦ | |
| బాహుకుడు | | పృథుశ్రవుడు | | * ప్రసుశ్రుతుడు ♦ | 90 |
| సగరుడు | | అజుడు | 65 | * సంధి ♦ | |
| అసమంజసుడు | | దశరథుడు | | * అమర్షణుడు ♦ | |
| అంశుమంతుడు | | శ్రీరాముడు | | * విశ్వసాహ్వుడు ♦ | |
| దిలీపుడు | 45 | కుశుడు | | బృహద్బలుడు ♦ | |
| భగీరథుడు | | అతిథి | | బృహద్రణుడు | 95 |

* ఇవి లింగ, కూర్మ పురాణములలో లేకుండా వీనికి బదులు 7 పేర్లు గలవు.

♦ వీరు భారతయుద్ధకాలపువారు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఉపక్షితుడు | | సుకేతుౖతుడు | | కాశ్యుడు | |
| వత్సప్రీతుడు | | ఋక్షకుడు | | శుద్ధోదుడు | |
| ప్రతివ్యోముడు | | అంతరిక్షుడు | | లాంగలుడు | |
| భానుడు | | సుతీపుడు | | ప్రసేనజిత్తు | |
| సహదేవుడు | 100 | అమిత్రజిత్తు | 110 | క్షుద్రకుడు | 120 |
| బృహదశ్వుడు | | బృహద్వాజి | | ఋణకుడు | |
| భానుమంతుడు | | బర్హి | | సురథుడు | |
| ప్రతీకాశ్యుడు | | ధనుంజయుడు | | సుమిత్రుడు | |
| సుప్రతీకుడు | | రణజయుడు | | రాష్ట్రికూటుడు | 124 |
| మేరుదేవుడు | 105 | సృంజయుడు | 115 | | |

గమనింపు :— ఇది మహాభాగవత ప్రకారము వ్రాయబడినది. లింగ, కూర్మ పురాణములలో మధ్యనుండిన కొన్ని పేర్లుగూడ చేర్చితిమి. ఇవిగాక బృహద్బలునికిపైన శ్రుతాయువు, భానుచిత్తు, చంద్రశీర్షుడు, తారాపీడుడు, చంద్రాలోకుడు, సహస్రాంశులను పేర్ల వానిలోనుండి యందలి 17 పేర్లు వానిలో లేవు. ఇవి మారుపేర్లుగూడ కావచ్చును.

## అనుబంధము — ౨

ఋగ్వేదము 1-10-53 సూక్తము. ఇంద్రుడు —

మంత్రము2—"దురోఅశ్వస్యదుర ఇంద్రగోరసిదురోయవస్యవసునఇనస్పతిః"

టీక:- నీవు అశ్వములను, గోవులు మొదలగు పశువులను, యవలు మున్నగు ధాన్యమును ఇచ్చువాడవు ధనమునకు ప్రభుడవు."

మంత్రము 3 — "శిక్షానరః ప్రదివో అకామకర్శనఃసఖాసఖిభ్యస్త మిదం గృణీమసి"

టీ:- దానములు మెండలైనవి యిప్పించువాడవు.

మంత్రము 4 — "ఏభిర్ద్యుభిఃసుమనా ఏభిరిందుభి ర్నిరుంధానో అమతిం గోభి రశ్వినా
ఇంద్రేణదస్యుందరయంత ఇందుభిర్యుతద్వేషసః సమిషారభేమహి"



టీ :- నీవు మే మొసగు పురోడాశాదులతో, సోమముతో తృప్తిజెంది మాదారిద్ర్యమును పశు,అశ్వధనములతో పోగొట్టి మంచి మనస్కుడవగుము. దస్యులను హింసించుటవల్ల, నీవిచ్చు అన్నముచల్ల సుఖింతుము.

మంత్రము 7 — "యుధాయుధము పఘేదేషి ధృష్ణుయాపురాపురం సమిదం హంస్యోజసా ।
నమ్యాయదింద్రసఖ్యాపరావతి నిబర్హయోనముచిం నామమాయినమ్"

టీ :- నీవు యుద్ధమున వెనుదీయవు. శత్రుపట్టణములను (బలములతో) కూల్చితివి దూరమున నున్న నముచియను మాయావిని చంపితివి. అందువల్ల స్తుతింపబడుచున్నావు.

మంత్రము 8 —"త్వం కరంజముత పర్ణయం వధీస్తే జిష్ఠయాతిథిగ్వస్యవర్తనీ।
త్వంశతా వంగృదస్యాభి నత్పురో నానుదః పరిషూతాఋజిశ్వనా"

టీ :- కరంజుడు, పర్ణయుడు అనువారిని అతిథిగ్వుని కొరకు శక్త్యాయుధముతో (వర్తనీ) చంపితివి. ఋజిశ్వుడను రాజుచే ముట్టడింపబడిన వంగృదుడనువాని నూరు పట్టణములను నాశనము చేసితివి.

మంత్రము 9—"త్వమేతాంజన రాజ్ఞోద్విర్దశా బంధునాసుశ్రవసోపజగ్మషః।
షష్టిమ్సహస్రానవతిం నవశ్రుతో ని చక్రేణరథ్యా దుష్పదావృణక్"

టీ :- సుశ్రవసునితో పోరుచున్న 20 మంది రాజులను, అరవైవేల తొంబ్బందుగురు వీరభటులను చక్రముచే హింసించితివి (లేక) చంపితివి.

మంత్రము 10 — "త్వమావిథసుశ్రవ సంతవో అభి స్తవత్రామ భిరింద్రతూర్వ యాణమ్ ।
త్వమస్మైకుత్సమతిథిగ్వమాయుం మహేరాజ్ఞేయూనేఅరంధనాయః"

టీ :- సుశ్రవసుని, తూర్వయాణుని గాచి రక్షించితివి. కుత్సుని, అతిథిగ్వుని, ఆయువును సుశ్రవసునకు లోబడజేసితివి.

ఋ - మం - 1-15-101 సూక్తము మంత్రము 1 —

"ప్రమందినే పితుమదర్చతావచోయఃకృష్ణగర్భాని రహన్నృజిశ్వనా।
అవస్యవోవృషణం వజ్రదక్షిణంమరుత్వంతంసఖ్యాయహవామహే"

టీ:- ఏయింద్రుడు ఋజిశ్వునితోగూడి కృష్ణగర్భులను భార్యలసహా సంహరించెనో, వానిని మైత్రిచే నాహ్వానింతుము.

మంత్రము 2 – "యోత్వం సంజాహ్యాపాణే నమన్యు సాయః శంబరంయో
అహన్విప్రుముద్రతమ్।
ఇంద్రోయఃశుష్ణమశుష్ణం న్యావృణఙ్మరుత్వంతం సఖ్యాయహవా
మహే"

టీ:- ఏ యింద్రుడు క్రోధముచే భుజరహితుడగు వృత్రుని, శంబరుని, అవ్రతుడగు పిప్రునిగూడ చంపెనో, ఏయింద్రుడు గ్లానిచెందని శుష్ణుని సమూల నాశన మొనర్చెనో, ఆతనిని మరుద్గణ సహితుని ఆహ్వానించు చున్నాము."

మంత్రము 5 – "యోవిశ్వస్యజగతః ప్రాణతస్పతిర్యో బ్రహ్మణే ప్రథ
మోగా అవిందత్।
ఇంద్రోయో దస్యూగధరా అవాతిరన్మరుత్వంతం సఖ్యాయహవా
మహే"

టీ:- ఏయింద్రుడు జగత్తులో ప్రాణిసమూహమునకు ప్రభువో బ్రాహ్మణులకంటె ప్రథమం గోవులను పొందెనో, ఎవ్వడు దస్యులను నీచులనుగా జేసి చంపెనో వాని నాహ్వానింతము. (పణులచే నపహరింపబడిన గోవులని వ్యాఖ్య)

మంత్రము 10– "మాదయస్వహరిభిర్యేత ఇంద్రదిమ్యస్వశి ప్రేవిస్యజస్వథేనే
అత్వాసుశిప్రహర యోవహంతుంశన్మావ్యాని ప్రతిరోజుషస్వ"

టీ:- ఇంద్రుడా! నీవు శీఘ్రము అశ్వములతో గూడ తృప్తిజెందుము. నీ స్వభావము గలవాని దవడలను తెరవుము. మంచి నాసికగలవాడా! నిన్ను అశ్వములు (మా యజ్ఞశాలను)చేర్చుగాక. మాహవిస్సులు గ్రహింపుము.

ఋ 1-15-102 సూక్తము – 6 వ మంత్రము.

"గోజితాబాహూ అమితక్రతుఃసిమః కర్మన్కర్మన్ఛతమూతిః ఖజంకరః।
అకల్పఇంద్రః ప్రతిమాన మోజసా పాజనావిహ్వాయం తేసిపాసవః।"

టీ:- గోవులను జయించుహస్తములు కలవాడవు. అమితక్రతువులు చేసినవాడవు. అపారజ్ఞానివి. శత్రుబంధకుడవు. స్తోతల రక్షకుడవు. యుద్ధకర్తవు. అకల్పుడవు. (నిరుపమానుడు) సర్వులకు ఉపమానుడవు. అందుచేత ధనేచ్ఛ గల జనులు నిన్ను పిలుచుచున్నారు.



ఋ 1-15-103 సూక్తము మంత్రము 2

"సధారయత్పృథివీం పప్రథచ్చవజ్రేణహత్వానిరపః ససర్జ అహన్నహిమభినద్రౌహిణం వ్యహన్వ్యంసం మఘవాశచీభిః॥"

టీ:- ఇంద్రుడు భూమిని ధరించి విశాలమొనర్చెను. వృష్ట్యుదను గక్కిని వజ్రముచేవంపి వెడలించెను. మేఘములను ఛేదించెను. రౌహిణుని చీల్చివైచెను. భుజరహితుడగు వృత్రుని చంపెను. ఇంద్రుడు మఘవుడు, శచీభర్తగా వ్రాయబడినది.

ఋ 1-10-56 సూక్తము – మంత్రము 8.

"సతుర్వణిర్మహాఅరేణుపౌంస్యే గిరేర్భృష్టిర్నభ్రాజతేతుజాశవః।
యేనశుష్ణమాయినమాయసో మదే దుధ్ర ఆభూషురామ
యన్ని దామని॥

టీ:- ఇనుముతో చేయబడిన కవచమునుగల యింద్రుడు దుష్టశిక్షకుడు, కార్యములు శీఘ్రముగా నెరవేర్చువాడై గురువులను బాధించు మాయావి యగు రాక్షసుని చెరసాలలోను, సంకెళ్ళలోను ఉంచి, తనబలమును వీర పురుషయుద్ధము నిర్దిష్టముగా, శత్రుభయంకరముగా పర్వతశిఖరముల ప్రకాశింప జేసెను.

ఋ 1-12-72-8 సూక్తం. మంత్రం 8.

"స్వాధ్యోదివ ఆసప్తయహ్వీరాయోదురోవ్యృతజ్ఞా అజానన్
విదద్గవ్యం
సరమాదృళ్హమూర్వం యేనానుకం మానుషీ భోజతేవిట్॥"

టీ:- అగ్నీ! దివమునుండి 7 నదులు ప్రవహించుచున్నవి. ఋతజ్ఞులు నీవల్ల గోరూపధనమును, మార్గములను కనుగొనిరి. గోవులకల్లనగ్గివ క్షీరరూపాన్నమును సరమయు (దేవదూతి యగు కుక్క) పొందెను. ఈ క్షీరము చేతనే మానుషీ ప్రజ భుజించుచున్నది.

ఋ 1-16-114-115 – రుద్రుని గురించి

"దివో వరాహ మరుషం కపర్దినం త్వేషం రూపం నమసానిహ్వయామహే
హస్తేభిభ్రద్భేషజావార్యాణి శర్మ వర్మచ్ఛర్దిః రస్మభ్యం యంసత్॥"

టీ:- వరాహమువలె దృఢమైనవాడు, ప్రకాశం, జటాజూటము, తేజస్సు రూపము గల రుద్రుని దివమునుండి (వచ్చుటకు) పిలుచుచున్నాము. హ..,

మాకుసద్యాజ నాపేక్ష్యములకు ఔషధములను ధరించి మా కొరకు ఆరోగ్య కవచములను, గృహమును ఇచ్చుగాక.

ఋ 1-16-114-10 మంత్రము - రుద్రుడు.

"ఆరాత్తేగోఘ్న ఉత పూరుషఘ్నం క్షయద్వీరసుమ్న మస్మేతే అస్తు।
మృళాచనో అధిచబ్రూహి దేవాధాచనః శర్మయచ్ఛద్విబర్హా॥"

టీ:- క్షయద్వీరా! నీగోహనన ఆయుధము, పురుషహనన ఆయుధము దూరముగా ఉండుగాక! నీ సుఖము మాకుకల్గుగాక! జ్ఞానకర్మలకు ప్రభువగునీవు పక్షపాతముంచి మాయందు, సుఖమొసంగుము.

ఋ 1-16-109-1 మంత్రము ఇంద్రాగ్నులు

"యతఇంద్రాగ్నీ చిత్ర మోరథో వామభవిశ్వాని భువనానిచష్టే।
తేనాయాతం సరథం తస్థివాంసాథా సోమస్య పిబతంసుతస్య॥"

టీ:- ఇంద్రాగ్నులారా! సమస్త భువనమును ప్రకాశింపజేయు మీరు యిద్దరును రథముపై వసించి విచ్చేసి పిండబడిన సోమరసమును త్రాగుడు.

ఋ 1-16-108- 8 మంత్రము

"చక్రాథేహి సధ్ర్యఙ్నా మభద్రం సధ్రీచీనావృత్రహణా ఉతస్థః
తావింద్రాగ్నీ సధ్ర్యంచానిషద్యా వృష్ణః సోమస్యవృషణా
వృషేథామ్॥"

టీ:- ఇంద్రాగ్నులారా! వృత్రసంహారకులారా! ఎప్పుడు మీ యిద్దరి పేర్లు కలిసియేయుండును. ఎక్కడకు పోయినను కలిసియేపోవుదురు. కాన యిప్పుడు గూడ మీరుమా యజ్ఞమునకు కలిసివచ్చి వేదికనధిష్టించి మేమిచ్చు సోమరసమును గైకొనుడు.

ఋ 10-84-1 మంత్రము (సోమరసలత ముంజవత్పర్వతమున నున్నదని)

"ప్రావేపా మాబృహతో మాదయన్తి ప్రవాతేజా ఇరిణే
వర్వృతానాః
సోమస్యేవ మౌజవతస్య భక్షో విభీదకో జాగృతిర్మహ్యమచ్ఛాన్॥"

ఋ 4-50-5 మంత్రము - (బృహస్పతి వలాసురుని వధించెననుటకు)

"ససుష్టుభాసఋక్వతాగణేన వలంరురోజ ఫలిగంరవేణ।
బృహస్పతి రుస్రియా హవ్యసూదః కనిక్రదద్ వావశతీరు
దాజత్।



ఋ 7-88-3 మంత్రము (వరుణవసిష్ఠుల సముద్ర ప్రయాణము)

"ఆయద్రుహావ వరుణశ్చనావం ప్రయత్ సముద్రమీరయావ
మధ్యమ్
అధియదపాం స్నుభిశ్చరావ ప్రప్రేంఖఈంఖయావహైశుభేకమ్।
వసిష్ఠం హవరుణో నావ్యాధా దృషిం చకార స్వపామహోభిః॥
స్తోతారంవిప్రః సుదినత్వే అహ్నాంయ్నాద్యావస్తతనన్
యాదుషాసః॥"

ఋ మం. 1-11-64 లో 3 & 4 మంత్రములు (వాయువులుం గూడ శక్తిధారులైన వారనుటకు)

"యువానోరుద్రా అజరా అభోగ్ఘనోవవక్షురధ్రిగావః పర్వతా ఇవ।
దృళ్హాచిద్విశ్వాభువనాని పార్థివా ప్రచ్యావయంది దివ్యానిమజ్మనా।
చిత్రైరంజిభిర్వపుషేవ్యంజతే వక్షఃసురుక్మా అధియేతిరే శుభే।
అంసేష్వేషాం నిమిమృక్షురృష్టయః సాకం జజ్ఞిరే స్వధయాదివోనరః॥

టీ:- యౌవనులు, రుద్రపుత్రులు ముదిమిలేనివారు, దేవతలకు హవిస్సియ్యని వారిని జంపువారు, అప్రతిహతగమనులు, పర్వతములవలె దృఢగాత్రులగు వాయుదేవతలు స్తోతల అభిమతముల నిచ్చెదరు. విచిత్రాభరణభూషితులు, వక్షమున సువర్ణహారముల ధరించినవారు, తళతళలాడు నాయుధముల భుజశిరస్సులం బూనినవారు, సర్వప్రేరకులునగు వాయుదేవతలు దినమున ఆకాశమునలన బుట్టిరి.

## మరికొన్ని ప్రమాణములు

(1) ఇంద్రునకు గోమాంసం ప్రీతియని యజ్ఞాదులలో పెట్టుచుండిరని ఋగ్వేదము 10-8-6. 13 & 14 మంత్రములందున్నది.

(2) ఆర్యులు పశుమాంసము (beef) దినుచుండిరనుటకు ఋగ్వేదము సం. 6-39-1 లోను, 2-7-5 లోను, 6-16-49-39-1 లోను, 9-109-8-లోను 10-27-2 లోను, 28-3 లోను 86-1,3,4 చెప్పబడినవి. మం. 10-89-8. 14 లో గూడ గోవధస్థాన విషయమున్నది.

(3) భరద్వాజుడు ఋగ్వేదము 6-39-1 మంత్రములో ఆవుమాంసముతో గూడిన ఆహారమిమ్మని ఇంద్రుని ప్రార్థించెను.

(4) ఇంద్రాశ్వినులు, మరుత్తులు గుర్రాలమీద తిరుగువారని ఋ 8-5-7 లోను, మం. 10-92-9 లోను, 8-6-36 లోను చెప్పబడినది.

(5) ఒక్కొక్కసారి దున్నలను 100 మొదలు 300 వరకు వధచేయుచున్నట్లు వాని మాంసముగూడా ఇంద్రునకు ప్రీతియని ఋ 5-29-8, 6-17-11 మంత్రములందున్నది.

(6) ఇంద్రునకు గడ్డము, మీసములు దువ్వుచు యుద్ధమునకు లేచినట్లు సామవేదము 8-11 లో కలదు.

## మరుత్సూక్తములు కొన్ని

“సప్తసప్త హి మారుతా గణాః సప్తగణాః వైమారుతః ।
శర్ధశర్ధం వ ఏషామ్ వ్రాతమ్ గణంగణం సుశస్తిభిః అను క్రామేమ ధీతిభిః॥
అనేనో వో మరుతో యామో అస్తు-అనశ్వశ్చిదయమజత్యరథీః
అనవసో అనభీశూ రజస్తూః వి రోదసీ పథ్యా యాతి సాధన్॥”

టీ:- మరుత్తులు ధనస్సు, అంబులపొది, కత్తి, బల్లెము, గద, తోమరం, ధూమాస్త్రాలు ధరించేవారని, గధాలకు గుర్రాలు లేళ్ళు కట్టేవారని, 7 గురు సైనికులు 1 పంక్తి, 7 పంక్తులు ఒక గణం, గణమునకు ఉభయపార్శ్వాలలో 63 సైనికులుందురని అట్టి 7 గణములు 7 ఒకశర్ధ అని 7 శర్ధలు ఒకవ్రాతం అని యీ సూక్తములలో నున్నది.

Note:- ఇవియన్నియు దేవత లానాటి ప్రజలని రుజువుపరచును. ఇంద్రకుమారులగు జయ, లవ, వసుక్రి, విమద, సర్వహరి ప్రాతిరథ మొదలగువారి యొక్కయు ఇంద్రస్నుష, ఇంద్రాణి, ఐంద్రోవైకుంఠుల యొక్కయు రచితమైన మంత్రములు గూడ యున్నవి. గాని గ్రంథవిస్తరభీతి నుదు వుటలేదు. (ఋగ్వేదమండలము 10 అధర్వణవేదములు చూడవలెను.)

రుద్రుకు వైద్యుడనుటకు తైత్తిరీయ బ్రాహ్మణమున నిట్లున్నది.

“యా తే రుద్ర శివా తనూః శివా విశ్వాహా భేషజీ శివా రుద్రస్య భేషజీతి”



'విమర్శకాగ్రేసర'

కొత్త భావయ్య చౌదరి రచించిన

# దేవ రహస్యాలు

(పెద్దల అభిప్రాయాలు)

మన దేశము యొక్కయు మతము యొక్కయు ప్రాచీన రహస్యాలు, వాని నిజస్థితులు, స్వర్గ నరకాలు, లోకాలు, దేవతలు, యుగాలు యిత్యాదులను గురించి తెలియవలెనన్నచో నీ గ్రంథము చదివి తీరవలెను. ఈ క్రింది పెద్దల యభిప్రాయములను చదివినచో దాని ప్రాశస్త్యత మీకే విశదమగును.

(1) మద్రాసు హైకోర్టు రిటైర్డు ఛీపు జడ్జి సర్.వేపా రామేశం పంతులుగారును,, రిటైర్డు డిప్యూటీ కలెక్టరు డి. శేషగిరిగారు పంతులు గారును పంపినది. శ్రీ శేషగిరిరావు పంతులుగారి 18-6-55 లేఖలో నిట్లున్నది.

"I have read with great interest and appreciation your book entitled" Devarahasyamulu" lent to me by my grand son and gave it to Sir Vepa Ramesam, Retired Judge of the High Court also to read it. After reading it, he expressed his agreement with me that your book exposed the pseudo religion and Gods, heaven and hell created by Brahmins for their parasitic existance by deceiving the illiterate and gullible people of the South Vindhya religion.

In conclusion I convey the congratulations of myself and Sir V. Ramesam to you for having given the people of Andhra a valuable and matter of fact book as an eye opener to the people for discarding the Brahminical religion which is still living though in the last stages of its decline.

“నా మనుమని వద్ద గల దేవరహస్యములు అను మీ గ్రంథమును చూచి మిక్కిలి యాసక్తితోను గుణమును గ్రహించు సదభిప్రాయముతోను చదివి దానిని హైకోర్టు రిటైర్డు జడ్జి శ్రీ సర్ వేపా రామేశం (పంతులు) గారికి చదువ నిచ్చితిని. దానిని పఠించిన పిమ్మట వారు నా యభిప్రాయముతో నేకీభవించుచు నీ గ్రంథము కపటయుక్తమైన మతము, దేవతలు, స్వర్గ నరకాలు మొదలైనవి బ్రాహ్మణులు తమ పరాన్నభుక్తాధార బ్రతుకు తెరవు కోసము వింధ్యకు

దక్షిణముననున్న చదువురాని అమాయక జనులను మోసపుచ్చుటకుగాను నిర్మించినట్లు బయట పెట్టుచున్నదని యొప్పుకొనిరి..... క్షీణించుచు చివరదశలో నున్న బ్రాహ్మణమతము యొక్క నిరాకరణ విషయమున ప్రజలకు కనువిప్పు కల్గించుటలో అమూల్యమైన యధార్థ విషయములను తెలుపగల యీ గ్రంథ రచనకు నేనును, సర్.వేపా రామేశంగారును మీకభినందనముల నంపుచున్నాము.'

(3)నెల్లూరుజిల్లా బుచ్చిరెడ్డిపాలెం స్థానికోన్నత పాఠశాల ప్రథానాంధ్రోపధ్యాపకులు విద్వాన్ రామిరెడ్డి నారాయణరెడ్డిగారు 6-12-54 యిట్లు వ్రాసిరి.

"మీ దేవరహస్యాలు సంపూర్ణముగా జదివితిని. అచంచలదీక్షతో దుర్గమంబులగు వేదపురాణాది ప్రాచీన గ్రంథముల బరిశోధించి చారిత్రక సత్యములజాటి భారతీయుల అంధవిశ్వాసముల బోకార్చితిరి. నేటివారలకు దూరములైన వేదపురాణాదులు మీ దేవరహస్యాలు చదివిన ప్రతివాడును మరల మరల జదువ నువ్విళ్లూరుననుట నిర్వివాదాంశము."

(3) గుంటూరు హిందూ కాలేజిలోని తెలుగు ప్రొఫెసర్ శ్రీ మందలపర్తి ఉపేంద్రశర్మగారు 12-2-54 యిట్లు వ్రాసిరి.

"దేవరహస్యాలు" అనేకములైన చారిత్రములగు విషయములతో గూడినదియు విమర్శనాత్మకములైన పూర్వగాథాలహరి. మిక్కిలి ఉపయుక్తమైన గ్రంథమని నా విశ్వాసము"

(4) ఆంధ్ర విద్యా వాచస్పతి, కవిరత్న శ్రీ శ్రీరాం వీరబ్రహ్మకవిగారిట్లు వ్రాసిరి.

"శ్రీ భావయ్య చౌదరిగారు భావములు నూతనములయినవిగాను శాస్త్ర విషయములు పూర్వకవి మతానుసారము లైనవిగాను గల గ్రంథములనే రచించిరి. భావయ్య నామము సార్థకమయినది. ఇందులకు వారు రచించిన 'దేవరహస్యమ"ను గ్రంథమే నిదర్శనము. పురాణగాథలన్నియు చరిత్రాంశములు గల కథలేయని వారు తమ గ్రంథమున నిరూపించిరి....ఎవరికెట్టి అభిప్రాయమున్ననూ మన చౌదరిగారి కృషిమాత్రమద్వితీయము. ఇట్టి శ్రీ కొత్త భావయ్యచౌదరిగారి సన్మానమనగా భారతదేవి సేవగా నెన్నదగియున్నది."

ఇంకను శ్రీ వుయ్యూరు కుమార రాజా రంగయ్యప్పారావు మున్నగు ప్రముఖ లీ గ్రంథముపై సదభిప్రాయము లిచ్చియున్నారు.

# కీ॥శే॥ కొత్త భావయ్య చౌదరి
## జీవిత సంగ్రహము

జననము: **2-6-1897.**

తండ్రి: **కొత్త శివలింగయ్య**, తల్లి: **రాజమ్మ** (ముమ్మలనేని భావయ్యగారి పుత్రిక) సంగం జాగర్లమూడి, **గుంటూరు జిల్లా - 522 213.**

వివాహము: **5-3-1920** భార్య: **అన్నపూర్ణాదేవి** (కొల్లి వెంకట సుబ్బయ్య గారి పుత్రిక)

సర్వేయరు ఉద్యోగము చేసి రాజీనామా చేశారు. తెనాలి, అంగలకుదురు మధ్య 18-2-1937న వీరికి జరిగిన మోటారు ప్రమాదము వశాత్తు ఇంటివద్దనే యుండి రచనా కార్యక్రమానికి ఉపక్రమించారు. స్వగ్రామములోని ప్రైవేటు స్కూలులో చదివి తదనంతరం 1915లో విజ్ఞాన చంద్రికా మండలివారి పరీక్షకు అభ్యాసము చేసి 1916 జులై నెలలో పరీక్ష వ్రాసి కృతార్థులయ్యారు. 1-12-1916న ఆ సంస్థ అధ్యక్షులుగా వున్న కందుకూరి వీరేశలింగంగారి సంతకంతో యోగ్యతా పత్రం పొందారు. ఇదిగాక స్వగృహములో భారత, రామాయణాది గ్రంథముల పఠనము, చర్చ వారి దిన చర్యలో భాగం.

**సన్మానములు:** ఆంధ్ర, నలంద, భారతీయ సమితి, లలిత కళాసమితి అను సంఘములచే సన్మానించబడ్డారు.

1931-38 (7 సంవత్సరములు), సంగం జాగర్లమూడి గ్రామ పంచాయితీ బోర్డుకు ప్రజల అండతో ప్రథమ ప్రెసిడెంట్‌గా ఎన్నికై గ్రామస్తులపై భారం లేకుండా, గ్రామ బజార్లలో పశువుల పేడ, కాల్వగట్టు పచ్చగడ్డి పాటల ద్వారా వచ్చిన ఆదాయంతో రోడ్లు వేయించారు. ఎడ్లపల్లి కాల్వ అవల భూములున్న తమ గ్రామ రైతాంగానికి, ఎడ్లపల్లి గ్రామస్తులు గుంటూరు, తెనాలి పట్టణాలకు ప్రయాణించటానికి సులభ మార్గమవుతుందని వంతెన నిర్మించి సత్కీర్తి గడించారు.

ఆనాడు స్వాతంత్రోద్యమంలో కమ్మవారు ఎక్కువగా పాత్ర వహించటం వల్ల బ్రిటిషు ప్రభుత్వం కినుక వహించి కమ్మవారికి ఉద్యోగార్హతలపై ఆంక్షలు విధించటం వల్ల కలత చెందిన భావయ్య చౌదరిగారు 'కమ్మ' అనే పదానికి

ఆవిర్భావం కనుగొనాలనే స్పందనతో చేసిన పరిశోధనా ఫలితమే **కమ్మవారి చరిత్ర**గా రూపొందింది. దైవభక్తి కల్గినవాడై సంఘసేవా దృక్పథంతో వ్యవహరించి ఆర్థికంగా బలహీనపడి దేవరహస్యం తెలుసుకొనే తపనతో వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలుపరిశోధన చేసి **దేవరహస్యాలు** రచించారు.

"తమ కులాభ్యున్నతికయి యత్నంబు సలుప
అన్య కులముల ద్వేషించినట్లు గాదు" అని దువ్వూరి రామిరెడ్డిగారు అభిప్రాయపడినట్లుగా ఆయన పరిశోధనలు ఆమోదయోగ్యము. స్త్రీ విద్యను, గ్రంధాలయోద్యమాలను ప్రోత్సహించారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయము, వి.యస్.ఆర్. కాలేజి తెనాలి, జె.యమ్.జె. కాలేజి-తెనాలి లకు రు. 2,000లు, సంగం జాగర్లమూడి ఉన్నత పాఠశాలకు రు. 500లు, అనేక మంది కవులకు, రచయితలకు నూరు రూపాయలు చొప్పున విరాళాలు యిచ్చారు. వీలునామా ద్వారా తమ ఆస్థిని వంశీకులకు పంచిపెట్టారు.

**వీరి ముద్రిత రచనలు:**

1. కమ్మవారి చరిత్ర 3 భాగాలు 2. దేవ రహస్యాలు 3. కాశ్మీర దేశ చరిత్ర 4. నేపాల్ దేశ చరిత్ర 5. పశ్చిమ చాళుక్య చరిత్ర 6. వేంగీ చాళుక్య చరిత్ర 8. కల్పవల్లి (ఖండ కావ్యము) 9. వ్యామోహము (నవల) 10. సగర పట్టాభిషేకము (నాటకము) 11. శంకర శతకము 12. గోపాల శతకము 13. ధర్మపత్ని 14. మహాజన చరిత్ర 15. రెడ్ల చరిత్ర 16. ప్రభోధ కుసుమావళి 17. సంగభూపాలీయము 18. కమ్మవారి చరిత్ర (Revised) 19. A brief history of the Kammas 20. ధర్మ నందన విలాసం (సంపాదకీయం) 21. ఆత్మ స్వాతంత్ర్యమను రుక్మిణీ కళ్యాణ రూపకము 22. పరశురామ నాటకము 23. ఆంధ్ర రాజులు 24. గుంటూరు మండల ప్రాచీన చరిత్ర

**అముద్రిత రచనలు:**

1. మను సంభవము 2. జమదగ్ని 3. స్వర్ణలత 4. వినోద కథలు 5. చారిత్రక వ్యాసములు.

తమ స్వగ్రామంలో 22-6-1973న అమరులయ్యారు.

కవిగా, పండితునిగా, చారిత్రక పరిశోధకునిగా, సంఘసేవాతత్పరునిగా భావయ్య చౌదరిగారు ధన్యజీవి.

* * *